# బెంజమిన్ ఫ్రాంక్లిన్

## స్వీయచరిత్ర

అనువాదం:

నండూరి విఠల్‌బాబు

దేశికవితా మండలి
విజయవాడ-2

బెంజమిన్ ఫ్రాంక్లిన్ బహుముఖ ప్రజ్ఞావంతుడు. ప్రచురణకర్తగా, తాత్వికుడుగా, రాజకీయవేత్తగా, గొప్ప స్వేచ్ఛాభిలాషిగా అతని ప్రభావం సమకాలికతరం మీదనేగాక, ఆయన తరువాతి తరాలవారిమీద గూడా, అత్యంత శక్తివంతంగా ప్రసరిస్తూంది.

ఆయన సునిశితమైన పరిశీలనాశక్తి - ఆచరణ సాధ్యమైన జీవితసూత్రాలూ, జాతీయ జీవితంలో గొప్ప పలుకుబడినీ - ప్రాభవాన్నీ సంతరించుకున్నాయి.

ఆ మహామహుని స్వీయచరిత్ర, అమూల్యమైన విజ్ఞాన భాండారంగా పరిగణింపబడుతున్నది. ఈ ఉద్గ్రంథం, చరిత్రఎరిగిన ఒక మహావ్యక్తి జీవితాన్నే గాక - ఆయన జీవితకాలంలో సంభవించిన అనేక అద్భుత సంఘటనలు కూడా తెలియ జేస్తున్నది.

— సంపాదకులు

డియర్ సన్,

మన పూర్వీకులను గురించిన వింతలూ విశేషాలూ తెలుసుకోవటం - నాకు చాలా ఆనందం కలిగించే విషయం. నువ్వు ఇగ్లండులో వున్నప్పుడు-మన బంధువుల్ని గురించిన సంగతి సంధర్భాలన్నీ తెలుసుకోవటం కోసం - నేను చేసిన కృషి - నీకు తెలిసిన విషయమే. ఆ ప్రయత్నంలో నేను అనేక ప్రయాణాలు కూడా చేశాను.

అలాగే నా జీవిత స్థితిగతులను తెలుసుకోవటం నీకూ సంతోషం కలిగిస్తుందనే అనుకుంటా. నేను చవిచూచిన అనేక సంఘటనల వివరాలు యింతవరకూ నీకు తెలియదు. ఈ పల్లెప్రాంతంలో ఒక వారం విశ్రాంతి తీసుకుందామని వచ్చాను. ఈ వారంలో నీకు అనేక విషయాలు వ్రాయదల్చుకున్నాను.

నేను బీదరికంలో అనామకమైన కుటుంబంలో జన్మించాను. ఆ అంధకారంలోంచి బయటకొచ్చి, పేరు ప్రఖ్యాతులు గడించి, జీవితంలో చెప్పుకోతగ్గంతగా ఆనందానుభూతుల్ని చవిచూచినవాణ్ణి.

భగవానుని ఆశీస్సులతో-ఏవిధంగా నేను జీవితంలో పురోగమించానో, ముందు తరాలవారు తెలుసుకోవటానికి కుతూహల పడవచ్చు.

అందులో కొన్ని విషయాలు వారి వారి జీవిత సమస్యలను కొంతవరకూ పరిష్కరించుకుంటానికి వుపయోగపడవచ్చు.

నేను జీవితంలో చవిచూచిన ఆనందానుభూతుల్ని జ్ఞప్తికి తెచ్చుకున్నప్పుడల్లా-మళ్ళీ జీవితం పునరావృత్తమైతే బాగుండుననిపిస్తుంది. రెండో ప్రచురణలో రచయితలు కొన్ని పొరపాట్లు సర్దుకున్నట్లు, నేను కూడా నా జీవితాన్ని పదింతలు సలక్షణంగా తీర్చి దిద్దుకునేవాణ్ణి.

ఇది ప్రయోజనంలేని కోరిక అని నాకు తెలుసు. అలా జీవితం ఎవరికీ ఏనాడూ పునరావృత్తం కావటంకాదు. కాని గత జీవితాన్ని ఒకసారి జ్ఞప్తికి తెచ్చుకుని, కొంత సంతృప్తి చెందవచ్చు. నేను యిప్పుడు చేస్తున్నది అలాటి ప్రయత్నమే. కాగా, నా స్మృతిపథంలో మెరుస్తున్న ఆ జ్ఞాపకాలను, శాశ్వతం చేసుకోవాలనే, ఆశతో, వాటిని యిలా కాగితంమీద పెడ్తున్నాను.

వృద్ధులలో ఒక అలవాటు సామాన్యంగా వుంటుంది. అనవరతం తమను గురించీ, తమ గత జీవితాలను గురించీ, వారుమాట్లాడుతూఉంటారు. ఈ సహజస్వభావం నాలో కూడారవ్వంత కనిపించకపోదు. సాధ్యమైనంతవరకూ, వినేవారికి విసుగు కలిగించకుండా ఉండటానికి ప్రయత్నిస్తాను. కొందరు 'పోనీ ఏదో పెద్దవాడు చెపుతున్నాడుగదా పాపం" అనే భావంతో, లోపల యిష్టంలేకపోయినా, పైకివింటున్నట్టు నటించవచ్చు. కాని నా విషయంలో ఆ బాధలేదు. ఈ నా

జీవితగాథ, చదివేవారు, విసుగుపుట్టగానే, దాన్ని కట్టిపెట్ట వచ్చు.

నాలోకూడా కొంత ఆడంబరం లేకపోలేదు. ఆ విషయం నేనే అంగీకరిస్తున్నాను. అంగీకరించకపోయినా ఎవరు నమ్మరు. ఎందుకంటే — నువ్వు ఏ ఉపోద్ఘాతమైనా చూడు.

"ఏ విధమైన ఆడంబరమూ లేకుండా నేను సూటిగా చెప్తున్నాను." అనే వాక్యంతో మాత్రమే ప్రారంభమౌతుంది. చిత్రమేమంటే, ఆ తర్వాత వాక్యాలలోనే, ఆడంబరాన్ని వలకపోస్తున్న వాక్యాలు దొర్లుతూఉంటాయి.

చాలామంది తమలో ఎంత ఆడంబరం గూడుకట్టుకున్నా, ఎదుటివారిలో కనిపించే ఆడంబరాన్ని సహించలేరు. కాని–జీవితంలో–ఆడంబరంకూడా కొంత అవసరమనే భావం నాకు కలుగుతూంది. అంచేత భగవంతుడు మానవునికి ప్రసాదించిన అనేకవరాల్లో, ఆడంబరత్వంకూడ ఒకటని భావించాలి. అందుకు ఆ మహాపురుషునికి మనం కృతజ్ఞులమై వుండాలి కూడా !

భగవంతుని గురించి నే నిప్పుడు ఆలోచిస్తున్నాను. జీవితంలో నే సాధించిన విజయాలకూ, అనుభవించిన సౌఖ్యా నందాలకూ–భగవానుని ఆశీఃప్రభావమే కారణమని నమ్ముతున్నాను. భవిష్యత్తులో కూడా, అదే సౌఖ్యానందాలు నేను అనుభవించవచ్చు. లేదా, అనేకమందికి సంభవించి నట్లు, నా బ్రతుకంతా తారుమారై, ప్రాణాంతకమైన పరిస్థితులు యేర్పడవచ్చు. అలాటి సందర్భంలో కావలసిన

ఉత్కృష్టయిర్యాన్ని ప్రసాదించమని భగవంతుని ప్రార్థిస్తున్నాను. ఎంచేతనంటే, నా భవిష్యత్ జీవిత సౌభాగ్యం ఆయనకు మాత్రమే తెలుసు. మా పెదతండ్రి ఒకరు, మన పూర్వీకులకు సంబంధించిన వివరాలు కొన్ని సేకరించి నాకు పంపాడు. వాటినిబట్టి, మన పూర్వీకులకు సంబంధించిన అనేక విషయాలు తెలుసుకోగలిగాను.

మన కుటుంబం, చాలా కాలంనుంచీ, అంటే షుమారు మూడువందల సంవత్సరాల పైనుంచీ, నార్తాంప్టన్ షైర్ లోని ఎక్టన్ గ్రామంలో నివసిస్తున్నది. నిజానికి, ఎన్నాళ్ళనుంచి మన కుటుంబం అక్కడ వున్నదో చరిత్ర కందని విషయం. బహుశా మన వంశ మూలపురుషుడైన ఫ్రాంక్లిన్ కాలం నుంచీ కావచ్చు. ఆయన పేరే మన యింటి పేరయింది చివరకు–మన కుటుంబానికి ముప్పై యెకరాల పొలానికి తోడుగా, బంగారం వ్యాపారం కూడా వుండేది. కుటుంబంలో పెద్దకొడుకు యెప్పుడూ బంగారపు వ్యాపారం చేయటం రివాజు. నా తండ్రి కూడా అదే ఆచారం అనుసరించాడు. ఎక్టన్‌లో నాకు ఒకరిజిస్టర్ కనిపించింది. అందులో మన పూర్వీకుల్లో అనేక మందికి సంబంధించిన వివాహాలూ, జననమరణాలు, మొదలైన వివరాలు లభించాయి. కాని 1555 నుంచి మాత్రమే వివరాలు సేకరించబడ్డాయి. అంతకు పూర్వం అలాంటి రిజిస్టరంటూ ఒకటి వుండేదికాదు. ఐదు తరాలుగా, నాతోసహా, నా తాత తండ్రులంతా, కడగొట్టు బిడ్డలే.

నా తాత థామస్ 1598లో జన్మించాడు. బాగా వయసు వచ్చేదాకా అక్కడే వున్నాడు. వ్యాపారం చేయటానికి కావలసిన శక్తియుక్తులన్నీ నీరసించిపోగానే - ఆక్స్ ఫర్డుషైర్ లోని బాన్ బురీలో వుంటున్న తన కుమారుడు జాన్ దగ్గరకు వెళ్ళాడు. అప్పుడు నాతండ్రికూడా అక్కడే ఉండేవాడు. తర్వాత కొంతకాలానికి మా తాత అక్కడే మరణించి-సమాధి చేయబడ్డాడు. 1758 లో మే మాసమాధి రాయిని చూశాం.

మా తాత పెద్దకుమారుడు అప్పటికి ఎక్టన్ లోనే ఉంటున్నాడు. ఆ ఇంటినీ, పొలాన్నీకూడా, తన కుమార్తెకు యిచ్చివేశాడు. ఆమె కొన్నాళ్ళకు దాన్ని మిస్టర్ ఇస్టెడ్ అనే ఆసామీకి అమ్మివేసింది. ఇప్పుడా భూమికీ, ఆ యింటికీ అతడే యజమాని.

మా తాతకు నలుగురు కొడుకులు. థామస్ - జాక్ - బెంజిమన్ - జోసియా వాళ్ళను గురించి - నాకు తెలిసినంత వరకూ చెప్తాను.

థామస్ తండ్రి దగ్గర బంగారపు వ్యాపారం నేర్చుకున్నాడు. అతడు చాలా సూక్ష్మబుద్ధి కలవాడు అందుకు తగిన ప్రోత్సాహంకూడా లభించటంతో - ఎస్క్వయిర్ పామర్ అనే చర్చి అధికారి దగ్గరకు పంపబడ్డాడు. అక్కడే విద్యాబుద్ధులు నేర్చుకుని, దేశంలో తగినంత పేరు ప్రఖ్యాతులు సంపాదించాడు. దేశంలో - ముఖ్యంగా నార్తాంప్టన్ పట్టణంలో అతని జోక్యంలేని ప్రజోద్యమం ఉండేదికాదు. అతని స్వగ్రామచరిత్రలో కూడా అనేక సంఘటనలు అతని

జీవితంలో పెనవేసుకుని ఉన్నాయి. ఆయన 1702 లో జనవరి 6 వ తేదీన మరణించాడు. ఆ తర్వాత నాలుగుసంవత్సరాలకు, అదేరోజున నేను జన్మించాను. ఆయన గుణగణాలను గురించి, ఎరుగున్నవృద్ధులు చెప్పే కబుర్లువింటే - ఒక అసాధారణ విషయం నీకు స్ఫురిస్తుంది. నాకూ, ఆయనకూ అనేక విషయాల్లో పోలిక కనిపిస్తుంది. దానికితోడు నేను అదేరోజున జన్మించాను. అంచేత ఆయన జీవుడు నాలో ప్రవేశించాడేమో - అని నీవు చెప్పవచ్చు.

జాన్ ఉన్నిగుడ్డలకూ - బెంజిమన్ సిల్కుగుడ్డలకూ - రంగులు వేస్తుండేవారు. బెంజిమన్ చాలా సూక్ష్మబుద్ధి గలవాడు. ఆయన నాకింకా బాగా గుర్తు. మేం బోస్టన్‌లో ఉన్నప్పుడు, ఆయన మా యింట్లో కొన్ని సంవత్సరాలు న్నాడు. బాగా వయసు వచ్చేదాకా జీవించాడు. అతని మనుమడు శామ్యూల్ ఫ్రాంక్లిన్ యిప్పుడు లండన్‌లో ఉంటున్నాడు. బెంజిమన్ రచయిత కూడా. బంధువులనూ, స్నేహితులనూ ఉద్దేశించి, కొన్నిపద్యాలు కూడా వ్రాశాడు. ఆయన స్వయంగా ఒకరకమైన షార్ట్‌హాండ్ కనిపెట్టాడు. దాన్ని నాకు నేర్పాడు. కాని సాధన లేకపోవటం వల్ల యిప్పుడు బొత్తిగా మర్చిపోయ్యాను. నా తండ్రికి ఆయన మీద ప్రత్యేకమైన ప్రేమాభిమానా లున్నాయి ఆయన గొప్ప ధర్మపరుడు. అనేక ఆధ్యాత్మిక పరిషత్తులకు హాజరై, అమూల్యమైన విషయాలెన్నింటినో సేకరించి, తన షార్టుహాండ్ సాయంతో గ్రంథస్థం చేశాడు. కొంతవరకూ రాజకీయాల్లో కూడా ఆయనకు ప్రవేశం ఉంది. రాజకీయ సమస్య

లకు సంబంధించిన అనేక కరపత్రాలను ఆయన సేకరించి దాచాడు. రిఫార్మేషన్ తొలిరోజుల్లో, మన పూర్వీకులు ప్రొటెస్టెంటు మతాన్ని స్వీకరించారు. అవి క్వీన్ మేరీ ప్రాస్తున్న రోజులు. మనవాళ్ళు ఎలాగో ఒక ఇంగ్లీషు బైబిల్ సంపాదించారు. దాన్ని ఎప్పుడూ ఒకస్టూలు వెనక దాచేవారు. మా తాత దాన్ని చదివి వినిపిస్తున్నప్పుడు—ఒక పిల్లవాడు గుమ్మం దగ్గిర కాపలా ఉండేవాడుట. ఎవరన్నా చర్చి ఆఫీసరుగనుక వస్తుంటె—అతడు సంజ్ఞ చేసేవాడు. వెంటనే, ఆ బైబిలు మళ్ళా స్టూలుక్రింద దాక్కునేది.

ఈ కథ మా పెదతండ్రి బెంజమన్ చెప్పింది. నా తండ్రి జోసియా చాలా చిన్నవయస్సులోనే వివాహం చేసుకున్నాడు. 1682 లో ముగ్గురు పిల్లలతోనూ, భార్యతోనూ, న్యూఇంగ్లండు చేరుకున్నాడు. అక్కడ మతస్వాతంత్ర్యం కావల్సినంత ఉంది. ఆ తర్వాత మరో నలుగురుపిల్లల్ని కన్నాడు. రెండో భార్యకు పదిమంది జన్మించారు. మొత్తం ఆయన సంతానం పదిహేడుమంది అయారన్నమాట. అందరూ యిప్పుడు పెరిగిపెద్దవారై పెళ్ళిళ్ళు చేసుకుని కాపురాలు చేసుకుంటున్నారు. మొగపిల్లల్లో నేనే కడగొట్టువాణ్ణి. నా తర్వాత యిద్దరు చెల్లాయిలు ఉన్నారు. నేను న్యూ ఇంగ్లండులోని బోస్టన్ పట్టణంలోనే జన్మించాను. నా తల్లి రెండవభార్య. ఆమెపేరు పీటర్ఫాల్గర్. కాటన్‌మాదర్ అనేచరిత్రకారుడు—న్యూ ఇంగ్లండులో స్థిరపడ్డ కుటుంబాలలో వారిదే మొట్టమొదటిదని, తనచర్చిచరిత్రలోపే ర్కొన్నాడు.

'మగ్నోలియా క్రిస్టి అమెరికానా' బాగా చదువుకున్న పండితుడనీ, భగవదంశంగల వ్యక్తనీ, పేర్కొనబడింది. అతడు చిన్నచిన్న రచనలు చాలా చేశాడుట. అందులో ఒకటి మాత్రమే అచ్చయింది. ఇన్నాళ్ళకు దాన్ని చూసే భాగ్యం నాకు గల్గింది. అది 1675 లో వ్రాయబడింది. అప్పుడు ప్రభుత్వంచేత హింసింపబడుతున్న బాప్టిస్టులూ, క్వేకర్లూ మొదలైనవారిని సమర్థిస్తూ వ్యక్తిస్వేచ్ఛ ఆవశ్యకతను గురించీ, నాటి ప్రభుత్వదమన నీతినిగురించీ, అందులో ప్రస్తావించబడింది. మత విభేధాలను పురస్కరించుకొని, అలా కొందర్ని వెన్నాడటంవల్ల ఎలాటి విషమపరిణామాలు సంభవిస్తాయో, ఆయన నిరూపించాడు. పరిపూర్ణమైన వ్యక్తి స్వాతంత్ర్యం వాంఛిస్తున్నవ్యక్తి ఆయన. ముగింపులోని ఆరు పంక్తులూ, యిప్పటికీ నాకు గుర్తుకు వస్తున్నాయి. నా అన్నలందరూ తలోక వ్యాపారంలోనూ, పనులు నేర్చుకుంటూనికి ప్రవేశించారు. ఎనిమిదేళ్ళ వయస్సులో నన్ను గ్రామర్‌స్కూల్‌లో ప్రవేశపెట్టారు. నన్ను మతప్రచారకునిగా రూపొందించాలని, నా తండ్రి ఆలోచన. అదీగాక, చదువులో నేనుచూపుతున్న చురుకదనంచూసి, నేను ఏనాటికైనా, గొప్ప పండితుణ్ణవుతానని, అందరూ అంటూండేవారు. పెదతండ్రి బెంజిమన్‌కూడా ఇందుకు అంగీకరించాడు. ఆయన షార్టుహాండ్‌లో వ్రాసి, అనేక పవిత్ర గ్రంథాలను నాకిచ్చాడు. కాని గ్రామర్‌స్కూల్లో నేను ఒకసంవత్సరం కూడా పూర్తిగా ఉండలేదు. కాని ఆ స్వల్పవ్యవధిలోనే, ఆశ్చర్యకరమైన అభివృద్ధి సాధించాను. క్లాసులో మొదటి

వాణ్ణయ్యాను. వెంటనే పై తరగతిలోకి ప్రమోట్ చేశారు. అనతికాలంలోనే ఆ పై తరగతిలోకికూడా ప్రమోట్ చెయ్య దల్చుకున్నారు. కాని ఆసమయంలో నా తండ్రి మనస్సు మార్చుకున్నాడు. ఆయనకు పెద్దకుటుంబాన్ని పోషించవల సిన భారం నెత్తిమీద ఉంది. అధిక వ్యయప్రయాసలతో కూడిన కాలేజీచదువులు చెప్పించలేనని ఆయన నిశ్చ యించుకున్నాడు. నన్ను మరొక స్కూలుకు పంపారు. మిస్టర్ జార్జిబ్రౌన్ మహాశయుడు నాకు అధ్యాపకుడయ్యాడు. అక్కడే నాకు సరైన విద్యాబుద్ధులు అలవడినయ్. కాని లెఖ్ఖల్లో నే నెప్పుడూ తప్పుతుండేవాణ్ణి ఆ తర్వాతకూడా లెఖ్కలకు సంబంధించినంతవరకూ, ఆనగింజంత అభివృద్ధి కూడా సాధించలేకపోయాను.

అప్పుడు నా వయస్సు పది సంవత్సరాలు. వ్యాపా రంలో సాయం చేయటానికి అవసరమంటూ, నన్ను మా తండ్రి యింటికి తీసుకుపోయాడు. ఆయన కొవ్వొత్తులు చేసి అమ్ముతుండేవాడు. అసలది ఆయన చేయవలసిన వ్యాపారం కాదు. కాని-కులవృత్తి కుటుంబాన్ని పోషించనప్పుడు అంత కంటే ఎవరైనా యేం చేయగలరు? ఆ విధంగా నేను మూసల్లో కొవ్వు నింపుతూ, వత్తులు చేస్తూ, అమ్ముతూ, బాకీలు వసూలుచేస్తూ, నా తండ్రికి సాయపడుతున్నాను. ఆ వ్యాపారం నాకు బొత్తిగా ఇష్టంలేదు. ఎప్పుడూ సముద్రం మీదకు పోవాలనే కోరిక నాలో బుసలు కొడుతూ వుండేది. కాని నా తండ్రికి అలాంటి పని సుతరామూ యిష్టంలేదు. నేను చిన్ననాటినుంచీ, ఈత, బోట్లు నడపటం బాగా నేర్చు

కున్నాను. ముఖ్యంగా గాలి సరిగా లేక, ప్రమాదం సంభవించటానికి అవకాశం గల క్లిష్ట సమయాల్లో, బోటు నడపటంలో నాకు ప్రత్యేక ప్రజ్ఞ వుంది. నాతోటి స్నేహితులందరికీ, సముద్రయానంలో, ఎప్పుడూ నేనే నాయకత్వం వహించేవాణ్ణి. అలాటివాటిల్లో నా వుత్సాహం యెటువంటిదో నిరూపించే ఒక సంఘటన చెప్తాను. ఊరిబయట ఉప్పుకొటారుల దగ్గర మేం చేపలు పట్టేవాళ్ళం. స్థిరంగా నిలబడి చేపలు పట్టటానికి వీలుగా, ఒక అరుగులాటిది వేద్దామని నా మిత్రులకు నేను సూచించి, అందుకు కావలసిన ఒక రాళ్ళ గుట్టను వాళ్ళకు చూపెట్టాను. 'ఒక ఆసామి కొత్తగా ఇల్లు కట్టుకోటానికని, అక్కడ రాళ్ళు పేర్పించుకున్నాడు.' ఒక రోజు సాయింత్రం పనివాళ్ళమంతా, నిరాటంకంగా ఆ రాళ్ళు తెచ్చి, మా నిర్మాణం సాగించాం. మర్నాడు వుదయం ఆ యింటి యజమాని, తన రాళ్ళగుట్ట అదృశ్యం కావటం, ఎదురుగుండా ఒక కొత్త నిర్మాణం ప్రత్యక్షం కావటం చూసి, కాలుకాలిన పిల్లిలా గోలచేస్తూ ఆరా తీశాడు. దొంగలం దొరికిపోయాం. పెద్దవాళ్ళు చీవాట్లు పెట్టారు. మేం సాగించిన నిర్మాణం చాలా వుపయోగకరమైందని నేనెంతో వాదించాను. కాని, నీతి బాహ్యమైంచేదీ, ఉపయోగకరమైంది కాదని, నా అంతరాత్మ చెప్తూనే వుంది.

నా తండ్రి వ్యక్తిత్వాన్ని గురించి తెలుసుకోవటానికి నువ్వు యిష్టపడవచ్చు. సాధారణంగా వున్నప్పటికీ, ఆయనది ధృఢమైన శరీరం. చురుకైన మనస్సు. చిత్రలేఖనం, సంగీతంవంటి లలితకళల్లో ఆయనకు బాగా ప్రవేశం వుంది.

సాయంత్రం వ్యాపారం చూసుకుని యింటికి వచ్చాక, వయొలిన్ వాయిస్తూ ఆయన పాడుకుండేవాడు. ఆయన కంఠస్వరం కూడా మధురంగా వుంటుంది. ఆయన వివేకం, విచక్షణాజ్ఞానం అసాధారణమైనవి. సర్వసాధారణంగా ఆయ నెన్నడూ రాజకీయాల జోలికి పోయేవాడు కాదు. పెద్ద సంసారం-పిల్లల చదువు సంధ్యలు, వ్యాపారం - వీటితోనే ఆయన మునిగి తేలుతూ వుండేవాడు, కాని కొందరు పుర ప్రముఖులు తరచుగా మా యింటికి రావటం - పట్టణవ్యవ హారాల గురించి, ఆయనతో సంప్రదించి, సలహాలు పొందటం జరుగుతూ వుండేది. ఆయన సలహాకు వారు చాలా విలువ యిచ్చేవారు. చాలామంది స్నేహితులు కూడా, ఆయన్ను కలుసుకొని వారి వారి వ్యక్తిగత సమస్యల పరిష్కారానికి, సలహాలు పొందేవారు. ఇరుగు పొరుగువారి మధ్య పొర పొచ్చాలు వచ్చినప్పుడు ఆయన్ను మధ్యవర్తిగా యెన్ను కొనేవారు. ఎప్పుడూ యెవరో ఒక స్నేహితుడు యింటి కొచ్చి టేబిలు దగ్గర కూర్చొని, పిచ్చాపాటీ మాట్లాడటం ఆయనకు యిష్టం. కాని-సర్వదా, ఉపయోగకరమైన, మంచి విషయాలు మాత్రమే చర్చనీయాంశాలు అయేవి. ఆ కబుర్లు వింటూన్న నాలాంటిపిల్లలకుకూడా యెంతో వుపయోగకరం గా వుండేవి. జీవితాన్ని ఎలా నిర్వహించుకోవాలో - ఏది మంచో - ఏది చెడ్డో- తెలుసుకోటానికి కావలసిన అనేక విష యాలు బోధపడేవి. నిజానికి అలాటి విషయాలు మేం వినా లనే, ఆయన చర్చలు సాగించేవాడు. ఇక భోజనం విషయం లో - టేబిలుమీద ఏదిపెట్టారో-దాని రుచి ఏమిటో-ఆయన

యెన్నడూ పరిశీలించేవాడుకాదు. క్రమంగా నాకుకూడా అదే అలవాటయింది. ఈనాటికీ, భోంచేసిన కాసేపటికి గాని, ఏం తిన్నానో నేను చెప్పలేను. ప్రయాణాల్లో, ఇది చాలా ఉపయోగకరమైన అలవాటు. నా స్నేహితులు చాలామంది ప్రయాణాలు చేస్తున్నప్పుడు సరైన ఆహారం దొరకలేదంటూ బాధపడటం రివాజు. దానికి కారణం మొదటినుంచీ, వారు అలాటి దృక్పథం అలవాటు చేసుకోవటమే.

నా తల్లిదికూడా చాలా మంచి ఆరోగ్యం. పదిమంది పిల్లల్నీ చాకచక్యంగా నేర్పుతో సాక కల్గింది. నా తల్లి తండ్రులు జబ్బు పడటం యెన్నడూ నే నెరుగను. నా తండ్రి 89 సంవత్సరాల వయస్సులోనూ, నా తల్లి 85 సంవత్సరాల వయస్సులోనూ మరణించారు. అంతకుముందు ఒక్కసారి మాత్రం వారికి జబ్బు చేసింది. బోస్టన్‌లో వారిద్దరి సమాధులూ *ఒకదాని ప్రక్కన ఒకటి నిర్మింపబడ్డాయి. ఆ సమాధులపై నే నిలా వ్రాయించాను.

జోసియాఫ్రాంక్లిన్ మరియు

ఆయన భార్య ఏ బి యా

ఇక్కడ ప్రశాంతంగా సమాధి చేయబడ్డారు.

ఈ దంపతులు 55 సంవత్సరాలు ప్రేమాభిమానాలతో సంసార జీవితం గడిపారు.

గొప్ప ఆస్తిగాని, లాభసాటి అయిన ఉద్యోగం గాని లేదు. నిర్విరామంగా శ్రమించి, సుఖప్రదంగా సంసారాన్ని నిర్వహించారు. భగవంతుని ఆశీస్సులు

వారికి లభించాయి. పదిమంది పిల్లలనూ, ఏడుగురు మనుమలనూ పెంచారు. ఆయన ధర్మపరుడు. ఆమె శీలవతి. వారి కట్టకడపటి కుమారుడు కడసారి ప్రేమ స్మృతిగా ఈ రాతిని నిర్మిస్తున్నాడు.

జె యఫ్—జననం 1655

మరణం 1774

ఎ. యఫ్—జననం 1667

మరణం 1752

♦ ♦ ♦ ♦

ఇంక అసలుకథకు వస్తాను. ఆవిధంగా నా తండ్రికి ్యాపారంలో సాయంచేస్తూ రెండుసంవత్సరాలు గడిపాను. ప్పటికి నావయస్సు పన్నెండు సంవత్సరాలు. అంతలో అన్న జాన్ వివాహం చేసుకుని, యిల్లువదిలి, రోడ్ ండ్‌లో స్థిరనివాసం ఏర్పాటు చేసుకున్నాడు. అంచేత శ్వతంగా, నా తండ్రికి వ్యాపారంలో సాయంచేస్తూ ఉండా న పరిస్థితి నాకు వచ్చింది. చివరకు మైనపువత్తులు అమ్మే శిలా జీవితం స్థిరపరచుకోవటం నాకు యిష్టంలేదు. ్యాపారంపై విరక్తి నాకు రోజురోజుకూ ఎక్కువౌతూ చ్చింది. నా అన్న జోసియా అంతకుముందే సముద్రం దకు పారిపోయాడు. దానికి నా తండ్రి చాలా చీకాకుపడ్డా నేనుకూడా, అలాగే సముద్రంమీదకు పారిపోతానేమో ఆయన భయపడుతూండేవాడు. అంచేత నాతో చాలా చిగా ఉంటున్నాడు. తరుచు, ఆయనతోపాటు నన్ను

కూడా షికారు తీసుకెళ్ళేవాడు. ఎలాగైనా నన్ను వ్యాపారంలో ఉంచితీరాలని ఆయన సంకల్పం. అలాఉండగా మా పెదతండ్రి బెంజిమన్‌కొడుకు శామ్యూల్ లండన్‌లో కమ్మరి వ్యాపారం ప్రారంభించి చివరకు బోస్టల్ జేరి, అక్కడ స్థిరపడి పోయాడు.

నా తండ్రి పని నేర్చుకోవటం కోసం నన్ను శామ్యూల్ దగ్గరకు పంపాడు. కాని అతగాడు పనినేర్పటానికి ప్రతిఫలం ఆసించటంచేత నాతండ్రికి కష్టం కలిగి నన్ను యింటికి పిలిపించాడు.

చిన్నతనంనుంచీ నాకుచదువంటే వల్లమాలిన ఆసక్తి. నాకు దొరికిన కొద్ది డబ్బుతో పుస్తకాలు కొనుక్కునేవాణ్ణి. మొదట 'జాన్ బునియన్' పుస్తకాలన్నీ కొన్నాను. అవి చదివాక అమ్మేసి, ఆ డబ్బుతో ఆర్ బర్టన్ యొక్క చారిత్రాత్మక గ్రంథాలు కొన్నాను. నా తండ్రి దగ్గరకూడా ఒక లైబ్రరీ ఉండేది. కాని అది చాలాచిన్నది. అందులోఉన్నవైనా, కేవలం ఆధ్యాత్మికగ్రంథాలు, అందులో చాలా నేను చదివినవే. బాగాచదివి ఎంతో విజ్ఞానాన్ని ఆర్జించాలని అర్రులు చాస్తున్న నాకు, సరైనగ్రంథాలు లభించకపోవటం వల్ల, ఆశాభంగమే కలిగింది. ఫ్లూటార్క్ రచనలు బాగా చదివాను. అవి నాకు చాలా ఉపయోగించాయి. ఆ తర్వాత డీఫో రచించిన 'ఎస్సేస్ ఆన్ ప్రాజెక్ట్' - డాక్టర్ మేథర్ రచించిన 'ఎస్సేస్ టు డు గుడ్' అనే గ్రంథాలు చదివాను. అవి నా మెదడుకు కొంత ఆలోచ నిచ్చాయి. తర్వాత జీవితంలో సంభవించిన అనేక సంఘటనలమీాద, ఆగ్రంథాల

ప్రభావం బాగా ప్రసరించింది. పుస్తకాలమీద వెర్రిగా నాకున్న శ్రద్ధాసక్తులు చూచి, నా తండ్రి నన్ను ప్రచురణ కర్తగా తయారుచేద్దా మనుకున్నాడు. దానికి తోడు 1771 లో నా అన్న జేమ్సు ఒక ప్రెస్‌తో బాస్టన్ జేరాడు. అక్కడ వ్యాపారం సాగించాలనే ఉద్దేశంతో, కొన్ని పరిచయలేఖలు కూడా తీసుకువచ్చాడు. ఈ వ్యాపారం నాకు బాగానచ్చింది. కాని సముద్రంమీదకు పోవాలనే కాంక్ష నన్ను యింకా వెనక్కు లాగుతూంది. అలాటి ఆలోచనల్ని అణిచివేయటానికే, నన్ను జేమ్సుకు అప్పగించారు. చివరకు నేను ఎగ్రిమెంటు మీద సంతకంచెయ్యక తప్పలేదు. దాని ప్రకారం— నాకు 21 సంవత్సరాల వయస్సు వచ్చేవరకూ, నా అన్న చేతిక్రింద పనిచేయాలన్నమాట.

అనతి కాలంలోనే - ప్రెస్ వ్యాపారంలో నేను బాగా అభివృద్ధి సాధించాను. జేమ్సుకు బాగా అక్కరకొచ్చాను. ఇప్పుడు నేను యింకా మంచి పుస్తకాలు కొనుక్కునే స్థితి లోకి వచ్చాను. అనేకమంది పుస్తకాలషాపులవారితో పరిచయం కలిగింది. వారిదగ్గర కావల్సినన్ని పుస్తకాలు చదువుకోటానికి తెచ్చుకునేవాణ్ణి. వెంటనే చదివేసి, నలగకుండా, జాగ్రత్తగా తిరిగి ఎవరివి వారికి అప్పగించేవాణ్ణి. ఒకోసారి సాయంత్రం తీసుకొన్న పుస్తకం, ప్రొద్దుటే యివ్వాల్సి వచ్చేది. అంచేత తెల్లవార్లూ కూర్చుని మరీ దాన్ని పూర్తిచేసేవాణ్ణి. కొన్ని రోజులయాక మిస్టర్ మాథ్యూ ఆదమ్స్ అనే వ్యాపారస్థుడు నాకు పరిచయం అయాడు. ఆయనకు చక్కటి లైబ్రరీఉంది. నేనంటే చాలా

అభిమానం కావటంచేత, నన్ను తన లైబ్రరీకి తీసుకువెళ్ళి, కావల్సిన పుస్తకాలు తీసుకోమన్నాడు. నేను సంతోషంతో పొంగిపోయాను. ఇప్పుడిప్పుడే నాకు కవిత్వంమీదకూడా అభిరుచి కల్గుతూంది. చిన్న చిన్న పద్యాలూ, పాటలూ అల్లుతున్నాను. జేమ్సు వాటిని చూసి, ఏనాటికైనా అభివృద్ధిలోకి రాగలవని, నన్ను ఎంతో ఉత్సాహపరిచాడు. 'ది లైట్‌హౌస్ ట్రాజడీ' అనే ఒక ఖండకావ్యం వ్రాశాను. వర్త్ లైక్ అనే ఒక కెప్టెన్ తన యిద్దరు కుమార్తెలతో సముద్రంలో చిక్కుకుని మునిగిపోయిన విషాధగాథ దాని కథాంశం. మరోటి నావికులు పాడుకునే పాట. ఆ కవిత్వం పెద్ద బాగుండకపోయినా, అచ్చువేసి అమ్ముకురమ్మని జేమ్సు నన్ను పట్టణంలోకి పంపాడు. మొదటిసారి బాగా అమ్మకం జరిగింది. ఇటీవల జరిగిన సంఘటన కథాంశం కావటంచేత, అది అందర్నీ ఆకర్షించింది. ఈ విజయంతో నాలో యత్కించిత్ గర్వం, పెల్లుబికింది. కాని నాతండ్రి నన్ను బాగా నిరుత్సాహపరిచాడు. కవులంతా అడుక్కుతినే బిచ్చగాళ్ళని ఆయన అభిప్రాయం. అంచేత నా ప్రయత్నం అంతటితో ఆగిపోయింది. బహుశః ఇది చాలా దురదృష్ట కరమైన విషయ మనుకుంటాను. కాని చక్కటి గద్యరచన జీవితంలో చాలా ఉపయోగపడింది. నా అభివృద్ధికి అది యెంతో ఉపకరించింది. గద్యరచనలో నే నెలా సమర్థుణ్ణయానో నీకు చెప్తా విను. పట్టణంలోనే, నాలాగా పుస్తకాలంటే బాగా శ్రద్ధగల మరో యువకుడు కనిపించాడు. అతని పేరు జాన్ కాలిన్సు. అతనితో నాకు బాగా పరిచయమైంది.

అనేక విషయాల్లో మాకు వాగ్వివాదాలు జరుగుతూండేవి. నిజానికి అలా వాగ్వివాదాలు పెంచుకోవటం మంచిఅలవాటు కాదు. సమాజంలో దానివల్ల మనం చాలామందికి దూరమై పోవచ్చు. మత సంబంధమైన వాగ్వివాదాలతో నిండిన నా లైబ్రరీలోని అనేక పుస్తకాలు చదవటంవల్ల, ఆ స్వభావం నాకుకూడా కొంతవరకూ అబ్బింది. ఎడిన్‌బర్గులో పుట్టి పెరిగినవాళ్ళూ, యూనివర్సిటీవాళ్ళూ, లాయర్లూ తప్ప తెలివిగల వాళ్ళెవరూ, అలా వాగ్వివాదాల్లోకి దిగరు. ఒకసారి స్త్రీ విద్యాభ్యాసం అవుసరమా కాదా అనే విషయంమీద నాకూ, కాలిన్స్‌కూ వివాదం చెలరేగింది. సృష్టి చేతనే స్త్రీలు బలహీనులనీ, శక్తి సామర్థ్యాలు వారికి తక్కువనీ – అతని వాదం. కేవలం వాదనకోసం నేను వ్యతిరేక పక్షం వహించాను. కాలిన్స్ నాకంటె ధారాళంగా మాట్లాడగలడు, భాషపైనా, పదజాలంపైనా బాగా పలుకుబడి కలవాడు. అతను చూపే కారణాలకంటే, అనర్గళమైన అతని వాగ్ధోరణివల్లనే నేను ఓడిపోయేవాణ్ణి. అలా మేం విడిపోయేవాళ్ళం. వివాదాంశం మాత్రం అసంపూర్ణంగా మిగిలిపోయేది. కొంతకాలం దాకా తిరిగి కలుసుకోకుండా ఉండేవాళ్ళం. అంతలో నా వాదనంతా నేను కాగితంమీద వ్రాసి క్రమబద్ధంగా ఫెయిర్ వ్రాసి, అతనికి పంపేవాణ్ణి. దానికి వెంటనే కాలిన్సు జవాబు వ్రాసేవాడు. అలా నాలుగైదుసార్లు మా యిద్దరిమధ్యా ఉత్తర ప్రత్యుత్తరాలు జరిగేవి. చివరికి అవి నా తండ్రికళ్ళ బడేవి. ఆయన వాటిని చదివి, అప్పటికి. ఏ వ్యాఖ్యానం

చేయకుండా, సమయం వచ్చినప్పుడు ఆయన అభిప్రాయం చెప్పేవారు. నా ప్రత్యర్థివలె గాక, నాకు వర్ణక్రమాల్లో ఎక్కువ తప్పులు దొర్లేవికావు. ప్రెస్‌లో పని చెయ్యటం వల్ల నాకు చేకూరినమేలు ఇది. కాని భావప్రకటనలోనూ, శైలిలోనూ, నేను చాలా వెనక పడ్డాను. కాలిన్సు ఆ విషయం అనేకసార్లు నాకు గుర్తుచేశాడు. అందులోని యదార్థం నే గ్రహించి—రచనలో పటుత్వాన్ని అభివృద్ధి చేసుకు తీరాలని-కంకణం కట్టుకున్నాను. ఈ సమయంలోనే స్పెక్టేటర్ చూశాను. దాన్ని కొని అనేకసార్లు చదివాను. నాకు ఎంతో ఉల్లాసాన్ని కలిగించింది. సాధ్యమైనంతవరకూ, అందులోని శైలిని అనుకరించా లనుకున్నాను. అందుకై సాధన మొదలుపెట్టాను. అందులోని పేజీల్లో కొన్ని ముఖ్యమైన ఆధారాలు వేసే వ్రాయటం, ఆ తర్వాత ఆ ఆధారాలను ముందు పెట్టుకుని, రచనంతా పూరించటం-దాన్ని మూలంతో పోల్చుకుని, తప్పులు దిద్దుకోవటం-సాధనలోని ప్రధానాంశాలు. అప్పుడు పదజాలం మీద, నాకు తగినంత పలుకుబడి లేదని గ్రహించాను. కావలసిన పదాలు ఉపయోగించటానికి, అనుకోగానే గుర్తుకొచ్చేవి కావు. కవిత్వం వ్రాయటానికి మొట్టమొదటి అంశం భాషమీద బాగా పలుకుబడి కలిగి ఉండటం. ఒంటరిగా కూర్చుని సాధన చేసే వాణ్ణి నా తండ్రితో కలిసి ఉన్నప్పుడు ప్రార్థన విషయంలో అశ్రద్ధచేయ నిచ్చేవాడు కాదు. అది మన కర్తవ్యమని, నామటుకు నాకూ తెలుసు. అయితేనేం? ఆచరణ మాత్రం సాగేదికాదు. పదహారు సంవత్సరాలప్పుడు టయన్ అనే

రచయిత వ్రాసిన ఒకానొక శాస్త్రగ్రంథాన్ని చూడటం తటస్థించింది. అందులో ఆయన, శాకాహారం మంచిదంటూ సిఫార్సు చేసాడు. అది నాకు నచ్చింది. నేను శాకాహారాన్ని భుజించటం మొదలుపెట్టాను. జేమ్సుకు అప్పటికి వివాహం కాకపోవటంచేత, మేమంతా కలసి, మరొకరి యింట్లో భోంచేస్తున్నాం. అక్కడ నా శాకాహార నియమం వారికి కొంత యిబ్బంది కలిగించింది. ట్రైరన్ గ్రంథంలో చెప్పినట్లు, బియ్యం వండటం, టమాటో కూర వండటం—మొదలైన విషయాలు కొన్ని నేర్చుకున్నాను. నా భోజనానికి, కర్చవుతున్నదాంట్లో, సగం డబ్బు యిస్తే స్వయంగా వండుకు తినగలనని జేమ్సును అడిగాను. అతడందు కంగీకరించాడు. దీనివల్ల నాకు సగం డబ్బు ఆదా అవుతుంది. దాంతో కావల్సిన పుస్తకాలు కొనుక్కోవచ్చు.

ఇప్పటికీ లెఖ్ఖల్లో నాకు ఏమాత్రం ప్రావీణ్యత రాలేదు. స్కూలులో రెండు మూడుసార్లు ఒక్క లెఖ్ఖల్లోనే తప్పాను. అంచేత కోకర్సుపుస్తకం తీసుకుని, స్వయంగా కృషి ప్రారంభించాను. అది కొంతవరకు తేలిగ్గానే ఉంది. ఆ తర్వాత సెల్లర్సు - షర్మ్లల యొక్క నౌకాయాన గ్రంథాలను పఠించాను. దాంతో జామెట్రీ కొంత బోధపడింది. లాకే యొక్క 'ఆన్ హ్యూమన్ అండర్ స్టాండింగ్' అనే గ్రంథాన్ని, పోర్టు రాయల్ వ్రాసిన 'ఆర్ట్ ఆఫ్ థింకింగ్' అనే గ్రంథాన్నీ చదివాను. భాషను అభివృద్ధిచేసుకుంటానికి గ్రీన్‌వుడ్ గ్రామర్‌కూడా అభ్యసించాను. షాఫ్ట్స్‌బరీ, కాలి

న్నల మతసిద్ధాంతాలు చదివాను. ఎన్నో సందేహాలూ, సమస్యలూ నాలో రేకెత్తినయ్. వారి వాదాలను సమర్థించ టానికి - వా రుపయోగించిన పద్ధతి నాకు బాగా నచ్చింది. దాన్ని నేను విజయవంతంగా అనుకరించటంచేత, వాద ప్రతి వాదాల్లో నాకంటె జ్ఞానవంతుల్నికూడా పడగొట్టగల శక్తి లభించింది. నిజంగా నేను చెప్పే కారణాల్లో ఏవిధమైన పటుత్వం లేకపోయినా, ప్రతి పక్షుల్ని ఇరకాటంలో పెట్టి చీకాకు కల్గించగల నేర్పు అబ్బింది. ఈ చాతుర్యాన్ని చాలా కాలం ఉపయోగించుకున్నాను. కాని క్రమేణా దాని మీద మోజు తగ్గి ఒదిలిపెట్టివేశాను. తర్వాత వివాదాలు పెంచుకోటంమీద నాకుగల శ్రద్ధాసక్తులు క్రమంగా క్షీణించి పోయాయి. భేదాభిప్రాయ ప్రకటన అత్యవసరమైన సమ యాల్లోమాత్రం చాలా సౌమ్యంగా, తూచి తూచి మాటలు వాడుతూ మాట్లాడేవాణ్ణి. ఆ విషయంలో నా అభిప్రాయం అలాఉంది - ఆ పరిస్థితుల్లో అలా అనుకోక తప్పటంలేదు - ఈ కారణాలనుబట్టి ఈ విధంగా ఊహించటం అసంగతం కాదనుకుంటాను -నేను గనుక పొరపాటుపడిఉండకపోతే ఇదే నిజం అనిపిస్తూంది. - ఇత్యాది అర్థాంతర న్యాసాలతో సంభాషణ సాగించడం అలవాటుచేసుకున్నాను. ఈ పద్ధతి చక్కటి ఫలితాలను యిచ్చింది. నా మార్గంలోకి ఎదుటి వారిని తేలికగా మళ్ళించగల్గుతున్నాను. అలా కాకుండా, ఎదుటివారిమీద మన స్వంత అభిప్రాయాలను బలవంతంగా రుద్దటానికి ప్రయత్నిస్తే, అందువల్ల పూర్తిగా వ్యతిరేకమైన ఫలితాలుమాత్రమే కల్గుతాయి. వ్యతిరేకపక్షం అతి సుల

భంగా ఏర్పడుతుంది. ఏ ఆశయాలతో మన మహోపన్యాసం ప్రారంభిస్తామో, అవన్నీ వమ్మైపోతాయి. నీవు చెప్పదల్చుకున్న విషయం సరైనదే కావచ్చు. కాని దాన్ని సమర్థించటానికి పడివాదాన్ని ఆధారంగా చేసుకుంటేమాత్రం నీకు అపజయం తప్పదు. అలాటి వాదాలవల్ల వారికి నీపైగల శ్రద్ధాసక్తులు నసించి, వ్యతిరేక భావం మొలకెత్తుతుంది. మరో విషయం, మరొకరు చేసే విమర్శ లేమీ చెవిని బెట్టకుండా నీ అభిప్రాయాలనే పట్టుకు ప్రాకులాడుతూ కూర్చుంటే– తెలివిగల పెద్దమనుష్యు లెవరూ నీజోలికి రారు; వారికి నీతో వివాదం పెంచుకోవలసిన అవసరంలేదుగనుక. అంచేత నీలోని తప్పులు శాశ్వతంగా తప్పులుగానే ఉండిపోయే ప్రమాదం సంభవిస్తుంది. అలాటి స్వభావం అలవాటు చేసుకుంటే, నీ శ్రోతల్ని నువ్వు ఆవంతకూడా ఆనందింపజేయలేవు.

1720–21 సంవత్సరంలో నా అన్న 'న్యూ ఇంగ్లండ్ కరెంట్' అనే పేరుతో ఒక వార్తాపత్రిక ప్రకటించటం మొదలుపెట్టాడు. అమెరికాలో అంతకుముందు 'బోస్టన్ న్యూస్‌లెటర్' అనే పేరుతో ఒక్క వార్తాపత్రిక మాత్రమే ఉంది. ఒక పేపరు ఎలాగో ఉందిగనక మరో పేపరు స్థాపిస్తే విజయవంతం కాదని, చాలామంది మిత్రులు ఆయన్ను నిరుత్సాహపరిచారు. వాళ్ళ దృష్టిలో అమెరికాకు ఒక పేపరు చాలునని! అయినప్పటికీ నా అన్న పేపరు ప్రారంభించాడు. అక్షరాలు కూర్చటం దగ్గరనుంచీ, అచ్చయిన ప్రతుల్ని అమ్మటందాకా, బాధ్యతంతా నామీదపడింది. నా అన్నకు

చాలామంది స్నేహితులున్నారు. వాళ్లు తరచుగా చిన్న చిన్న రచనలను మా పేరుకు పంపేవాళ్లు. వాటివల్ల పత్రికకు పేరూ, ప్రచారమూ లభించాయి. వారు తరచుగా మా పత్రికా కార్యాలయానికిరావటం, పిచ్చాపాటీ మాట్లాడి పోవటం జరుగుతూండేది. వాళ్ళు చేసిన రచనల్ని గురించీ, వాటిని మెచ్చుకున్న ప్రజల్ని గురించీ, రకరకాలుగా సాగుతున్నవారి సంభాషణ వింటుంటే, నాకు కూడా రచయితను కావాలనే కోరిక తెప్పరితలలు వేసేది. కాని యింకా నాకు ఆరిందాలా, పెద్ద పెద్ద రచనలు సాగించటానికి అవసరమయిన వయస్సు లేదయ్యె. నాదని తెలిస్తే, నా అన్న దాన్ని పేపర్లో ప్రకటించటానికి యిష్టపడక పోవచ్చు. అంచేత ఊరూ పేరూ లేకుండా, నేను చేసిన చిన్న చిన్న రచనలను ప్రెస్ గుమ్మానికి అర్ధరాత్రి అంటించి ఊరుకునేవాణ్ణి. తెల్లారి నా అన్న వాటిని చూడటం-స్నేహితులకు చూపటం, వారంతా దాని గుణగణాలను గురించి తర్జన భర్జనలు చేయటం జరుగుతూండేది. చివరకు వారంతా ఏకగ్రీవంగా నా రచనలను మెచ్చుకుని, రచయిత ఎవరై ఉంటారా అని ఆలోచనలో పడేవారు. ఇదంతా గమనిస్తున్న నాలో నూతనోత్సాహం వెల్లివిరిసేది. అలాగే అనేక రచనలు చేస్తూ, అర్ధరాత్రి ప్రెస్ గుమ్మానికి అంటిస్తూ, అచ్చయాక వాటిని గురించిన వ్యాఖ్యానాలు వింటూండేవాడిని. నా రచన లన్నింటినీ - చదివినవారు మెచ్చుకుంటున్నారు. కాని నా అన్నకు మాత్రం ఇలా అజ్ఞాతంగా ఉండి చేస్తున్న రచనలమీద అంత గౌరవం లేక పోయింది.

ఇది ఇలా వుండగా, నా అన్న నాపై చెలాయిస్తున్న అధికారం రోజు రోజుకూ ఎక్కువై పోతున్నది. నన్ను కేవలం చేతి క్రింద కుర్రాడిగా భావించి, తన్ను నాకు యజమానిగా భావించుకుని, నాచేత చాకిరీ చేయించేవాడు. ఇది నాకుచాలా అన్యాయంగా కనిపించింది. మా యిద్దరిమధ్యనూ చిన్న చిన్న వివాదాలు ప్రారంభమయ్యాయి. చివరకు మా తండ్రిదాకా వెళ్ళటం, ధర్మం నా పక్షాన ఉండటం చేతనో, లేక, నా వాదనా పటిమవల్లనో గాని, ఆయన నాకు అనుకూలంగా తీర్పు చెప్పటం జరిగేది. నా అన్న చాలా తొందరపాటు మనిషి. నన్ను అనేకసార్లు కొట్టేవాడు. అలాటి మనిషి చేతి క్రింద పని నేర్చుకోవటం కష్టమనిపించి, అక్కణ్ణుంచి పారిపోవటానికి మార్గాలు అన్వేషించ ప్రారంభించాను– కాని చివరి కది అనుకోనివిధంగా సంభవించింది.

ఒకానొక రాజకీయసంబంధమైనవ్యాసం మాపత్రికలో ప్రకటించబడింది. దాన్ని శాసన సభవారు అవమానంగా భావించి, నా అన్నమీద నేరం మోపి – స్పీకర్ విచారణ జరిపించాడు. నన్నుకూడా ఆ సందర్భంలో కౌన్సిల్ ముందు హాజరు కమ్మని ఆదేశించారు. నేను వెళ్ళానుగాని, వాళ్ళకి సంతృప్తికరంగా ఒక్కమాట కూడా చెప్పలేదు. యజమాని రహస్యాలు కాపాడవలసిన బాధ్యత నేను నిర్వర్తిస్తున్నా ననుకుని, చివరకు నన్ను ఒదిలివేశారు. కాని నా అన్నకు మాత్రం ఒక నెల ఖైదు వేశారు. నా అన్నకూ నాకూ ఎన్ని భేదాభిప్రాయాలున్నప్పటికీ – అతనికి శిక్ష పడినందుకు నేను చాలా బాధపడ్డాను. అప్పుడు పేపరు నడిపే భారం నామీద

పడింది. నేను ధైర్యంగా ప్రభుత్వ దమన నీతిని నిరసించాను. ఇందుకు నా అన్న తప్ప మరెవరూ సంతోషించలేదు. తెలివితేటల్ని వక్రమార్గాల్లోకి మళ్ళిస్తున్న మేధాసంపన్నుడ నని ఏకాంతం గ్రహించారు. నెలరోజులు జరిగిపోయింది. నా అన్నను ఖైదునుంచి విడుదల జేశారు. కాని ప్రభుత్వం ఒక కఠినమైన ఆజ్ఞ జారీ చేసింది.

"జేమ్సు ఫ్రాంక్లిన్ యికముందు ఎన్నడూ 'న్యూ ఇంగ్లాండ్ కరెంట్' అనే పత్రికను నడపకూడదు" అంటూ.

అందరం పత్రిక కార్యాలయ ప్రాంగణంలో సమావేశమై ఈ సమస్యను చర్చించి, కర్తవ్యాన్ని ఆలోచించాం. ఒక స్నేహితుడు పేరు మార్చి మళ్ళీ పత్రిక నడపమన్నాడు. కాని ముందు ముందు అందువల్ల సంభవించే విషమ పరిణామాలను ఊహించి, నా అన్న మరొక నిర్ణయం తీసుకున్నాడు. 'బెంజమిన్ ఫ్రాంక్లిన్ పేరుతో పత్రిక నడపటం మంచిది' అని ప్రకటించాడు. దాంతో ఇరవై ఒక్క - సంవత్సరాలు వచ్చేవరకూ, జేమ్సుదగ్గర పని నేర్చుకుంటానికి అంగీకరిస్తూ నేను వ్రాసిన అగ్రిమెంటు రద్దు చేసుకుని, రహస్యంగా మాలో మేము మరొక ఎగ్రిమెంటు వ్రాసుకున్నాం.

ఆరునెల్లపాటు పేపరు నా పేరుమీదనే బయటకొచ్చింది. నాకు ఈ అవకాశంతోలభించిన స్వాతంత్ర్యాన్ని స్థిరపరచుకోవాలని ఆశపుట్టింది. దాంతో జేమ్సుకూ నాకూ మళ్ళీ తీవ్రమైన భేదాభిప్రాయాలు పొడసూపినయ్. ఆ అవకాశాన్ని అలా స్వార్థంకోసం ఉపయోగించుకోవటం మంచిపనికాదు - కాని అలా జరిగింది. నేను జీవితంలో బుద్ధి

పూర్వకంగా చేసిన మొట్టమొదటి తప్పిదం అదే. కాని ఈ తప్పంతా నాదికాదు. జేమ్సు చాలా దుడుకుస్వభావంకల వాడు కావటంచేత, తరచుగా తనంత ఎదిగిన నన్ను కొట్టటం, తిట్టటం - తక్కువగా చూడటం- నన్నీపనికి ప్రేరేపించింది. ఆ తొందర స్వభావం మినహాయిస్తే, నా అన్న చాలా మంచివాడు. ఆ పరిస్థితుల్లో నా అన్నను వదిలి వెళ్ళిపోవాలని నేను నిశ్చయించుకున్నాను. ఈ విషయం కనిపెట్టి - ఆ పట్టణంలో మరెక్కడా నాకు ఉద్యోగం దొరక్కుండా తన పలుకుబడిని ఉపయోగించి ప్రయత్నించాడు. నేను అన్ని ముద్రణాలయాలకు, కాలికి బలపాలుకట్టుకుని తిరిగాను. శ్రమ మాత్రమే మిగిలింది. చివరకు న్యూయార్కు వెళ్దా మనుకున్నాను. మాకు దగ్గరలో ముద్రణాలయాలుగల పట్టణం అదే. అదీగాక బోస్టన్‌లో యింకా ఉండటం నాకు యిష్టం లేదు. నా అన్న కేసు సందర్భంలో - ప్రభుత్వ దృష్టిలో నేనప్పటికే నిందితుణ్ణయ్యాను. ఇంకా అక్కడేఉంటే ముందు ముందు చిక్కుల్లో పడవచ్చు. మత సంబంధమైన నా అభిప్రాయాలు చాలామంది పెద్దలకు నచ్చక, నన్ను నాస్తికునిగా భావిస్తూ పెద్దపెట్టున ప్రచారం సాగిస్తున్నారు. ఇప్పుడు నా తండ్రికూడా, జేమ్సుకే అనుకూలంగా ఉన్నాడు. కాని నేను యిల్లు వదిలి వెళ్ళటానికిమాత్రం ఆయన అంగీకరించడు. అంచేత, నా స్నేహితుడు కాలిన్స్ సాయంతో రహస్యంగా ప్రయాణం సాగించా. బయలుదేరే ముందు కొన్ని పుస్తకాలమ్మి కొంత డబ్బు పోగుజేసుకున్నాను. గాలి అనుకూలంగా వీయుటంచేత, మూడురోజుల్లో, మూడు

వందలమైళ్ళ దూరాన్ని అధిగమించి, న్యూయార్కు సుర క్షితంగా చేరుకున్నాను. పదిహేడు సంవత్సరాల తేతవయస్సులో - జేబులో ఉన్న కొద్ది పైకంతో - పూర్తిగా అపరిచితమైన ఆ నగరంలో అడుగుపెట్టాను. ఇప్పుడు సముద్రం మీదకు పోవాలనే కోరికకూడా నాకు కల్గటం లేదు. న్యూయార్క్‌లో మిస్టర్ విలియమ్ బెడ్‌ఫోర్డు అనే పెద్ద మనిషి, నాకు తక్షణం ఉద్యోగమిచ్చాడు. కాని కారణాంతరాలవల్ల, నా ఉద్యోగం ఊడిపోయింది. బెడ్‌ఫోర్డు నన్ను పిలిచి, "ఫిలడల్ఫియాలో నా కుమారుడు ఉన్నాడు. అతని చేతిక్రింద పనిచేసే అబ్బాయి అక్వీలా రోజు మరణించాడుట. నువ్వు గనుక వెళ్తే, అతడు నీకా ఉద్యోగం ఇయ్యవచ్చు" అని చెప్పాడు.

ఫిలడల్ఫియా ఇంక వందమైళ్ళ పైన ఉంది. అయినా ధైర్యంచేసి, పడవమీద బయలుదేరాను. మార్గమధ్యంలో ఒక అఖాతాన్ని దాటుతున్నప్పుడు, చిన్న తుఫాను చెలరేగింది. తెరచాపలన్నీ చినిగిపోయాయి. అది అలా ఉండగా, ఒక డచ్ ప్రయాణీకుడు వళ్ళు తెలియకుండా త్రాగి నీళ్ళల్లో పడ్డాడు. అతడు మునిగిపోతూండగా - నేను దూకి, అతన్ని పడవలోకి లాగగల్గాను. అతని జేబులో ఒక పుస్తకం తడిసిపోయింది. ఆ పుస్తకం ఆరబెట్టటానికి నేను తీశాను. అది బందియాన్ వ్రాసిన 'పిల్‌గ్రిమ్స్ ప్రోగ్రెస్' అనే పుస్తకం. అనేక భాషల్లోనికి అనువదించబడింది. బైబిలు మినహా - అంతకంటే బహుళ ప్రచారం పొందిన గ్రంథం లేదేమో! అందులో ఒక ప్రత్యేక శిల్పం ఉంది. కథతో పాత్రల సంభా

షణాలను మేళవించి, రసవత్తర ఘట్టాల్లో, రచయిత మన ముందు ప్రత్యక్షమై కథనం సాగించటం అందులోని ప్రత్యేకత. ఇలాంటి శిల్పం మొట్టమొదట హానెస్టు జాన్ రచనల్లో చూశాను. క్రూసో, మాల్‌ఫ్రాండర్స్, రెలిజియస్ కోర్టుషిప్, ఫామిలీ ఇన్‌స్ట్రక్టరు మొదలయిన రచనల్లో – డీఫో అదే శిల్పాన్ని అనుకరించాడు. అలా కొంత దూరం మా నౌక పయనించాక, మేం తీరప్రాంతం చేరుకున్నాం. కాని అదంతా కొండలతోనూ, బండలతోనూ నిండిఉండటం చేత దిగటానికి సాధ్యంకాని ప్రదేశం అని తెలుసుకున్నాం. అంచేత కొంచెం దూరంగానే నౌకకు లంగరువేసి, ఒడ్డున ఆ మనుషుల్ని సహాయంచేయమంటూ కేకలుపెట్టాం. కాని ఆ హోరులో ఒకరిమాటలు ఒకరికి వినిపించలేదు. వినిపించినా సాయంచేయటం అసంభవమని వారు ఊరుకొనిఉంటారు. వాళ్ళు కాసేపుచూసి, తిరిగివెళ్ళిపోయారు. చీకట్లుక్రమ్ముకుంటున్నాయి. తుఫాను గాలి యింకా ముమ్మరంగా–వీస్తూనే ఉంది. తుఫాను తగ్గటం కోసం ఎదురు చూడటం కంటె మాకు మరో కర్తవ్యం తోచలేదు. ప్రయాణ బడలిక తీర్చుకుంటానికి నౌకలో సాధ్యమైతే కాసేపు నిద్రపోవాలనుకుని అందరం కాబిన్‌లోకి జేరాం. మాతోపాటు త్రాగిపడివున్న డచ్ ప్రయాణీకుని గూడా తీసుకువెళ్ళాం. అతని దుస్తులు యింకా నీళ్లు కారుతూనే వున్నాయి. ఇంకా వాన హోరున కురుస్తూనే ఉంది. కాబిన్‌లోకి నీరు కారి మమ్మల్ని కూడా తడిపివేసింది. అలాగే చలికి వణుకుతూ రాత్రంతా నౌకలోనే గడిపాం. తెల్లవారింది. అప్పటికి ముప్పై గంటలు

నీటిమీద ఉండటంచేత అంజామ్ చేరటానికి తొందరపడ్తు న్నాం. ఉప్పునీటిమీద మేం ప్రయాణం చేస్తున్నాం. త్రాగటానికి మంచి నీరైపోయింది. సాయంత్ర మయేసరికి నాకు జ్వరమొచ్చినట్లయిపోయింది. ప్రక్కమీద వ్రాలి పోయాను. ఎక్కడో ఏదో గ్రంథంలో చల్లటి మంచినీరు కడుపు నిండా త్రాగితే జ్వరం తగ్గుతుందని చదివినట్టు గుర్తు. అలాగే త్రాగాను. రాత్రల్లా విపరీతంగా చెమటలు కారి, తెల్లవారుఝాము కల్లా జ్వరం జారిపోయింది. తెల్లవారింది. రేవులో దిగి- కాలినడకన ప్రయాణం సాగించాను. యాభై మైళ్ళు నడిచి బర్లింగ్‌టన్ జేరుకున్నాను. ఫిలడల్ఫియా చేరటానికి అక్కడే పడవ ఎక్కాలని చెప్పారు. ఆ రోజల్లా జోరున వాన కురుస్తూనే ఉంది. ప్రయాణ బడలికతో నేను పూర్తిగా అలిసిపోయాను. ఒక యింటిముందు ఆగాను. అది సామాన్య స్థితివంతులదిలా కనిపించింది. అక్కడ ఆ రాత్రి విశ్రాంతి తీసుకుంటానికి ఆశ్రయం లభించింది. ఇంటిలోని వారంతా, నన్ను అనుమానాస్పదంగా చూస్తూ, ప్రశ్న పరంపరలు కురిపించారు. నేను పారిపోయి వస్తున్న పని కుర్ర వాణ్ణని వాళ్ళ నమ్మకం. నాకు చాలా బాధ కలిగింది. అలాగే ఆ రాత్రి అక్కడ గడిపి, మర్నాడు శలవు తీసుకుని బయలుదేరాను. సాయంత్రానికి బ్రౌన్ అనే ఒక డాక్టర్ ఇం టికి జేరాను. ఆయన దయామయుడు కావటం చేత నన్ను ఆద రించి, ఆహ్వానించాడు. చాలా ఆప్యాయంగా మాట్లాడాడు నాకు సాహిత్యంలో ఉన్న పరిచయం తెలుసుకున్నాక, అత నికి నామీద యింకా గౌరవం పెరిగింది. యూరప్‌లో అత

నికి తెలియని పట్టణంగాని, ప్రాంతంగాని ఉన్నట్టు నాకు కని పించలేదు. ఆ తర్వాత అతను జీవించి ఉన్నంతకాలం మేం సన్నిహితులుగానే ఉన్నాం. బ్రౌన్ బాగా తెలివితేటలు కల వాడేగాని, నాస్తికుడు కావటంచేత, బైబిలును వికట కవి త్వంలో వ్రాశాడు. ఆ గ్రంథంలోని అనేక పవిత్రాంశా లను, హాస్యాస్పదంగా ఉల్లేఖించాడు. అతడలా వ్రాసినవి అచ్చుకాలేదు గాని అయితే చాలా విషమ పరిణామాలు సంభవించేవి. అలా బ్రౌన్ యింట్లో ఆ రాత్రి గడిపాను. మర్నాడుదయం బర్లింగ్‌టన్ జేరుకున్నాను. కాని, నేను వెళ్ళవలసిన పడవలన్నీ అప్పటికే వెళ్ళిపోయాయని తెలిసింది. మళ్ళీ మంగళవారం దాకా పడవలు రావు. ఆ రోజున శని వారం. ఈ మూడు రోజులూ ఎలా గడపటం?– ఒక వృద్ధు రాలి యింటికి వెళ్ళాను. కొంత డబ్బిచ్చి అక్కడే భోజనం చేసి, ఆవిడను సలహా అడిగాను. ఆ మూడు రోజులు తన యింట్లో వుండమని ఆహ్వానించింది. ప్రయాణపు బడలిక చేత బాగా అలిసిపోయిన నాకు, ఆహ్వానాన్ని అంగీకరించిక మరేం చెయ్యాలో తోచలేదు. నా గాథంతా విని, ఆ ఊళ్ళోనే ప్రెస్ వ్యాపారం పెట్టమని నన్ను ఆహ్వానించింది ఆ వృద్ధు రాలు. కాని ఆ వ్యాపారం స్థాపించటానికి ఎన్ని హంగులు కావాలో ఆమెకు తెలీదు. నన్ను చాలా మర్యాద చేసింది. మంగళవారం దాకా అక్కడే ఉండాలని నిశ్చయించు కున్నాను. ఆ సాయంత్రం షికారుగా నది గట్టువెంట నడు స్తుండగా, ఒక నౌక కనిపించింది. అది చాలా మంది ప్రయా ణీకులతో ఫిలడెల్ఫియా పోతూంది. వారి అనుమతిమీద

నేనుగూడా నౌక ఎక్కాను. ప్రయాణం సాగుతోంది. అర్థ రాత్రి అయాక, ఒక ప్రయాణీకునకు చేరవలసిన చోటును నౌక ఎప్పుడో దాటి వచ్చిందని అనుమానం వేసింది. నౌక గాఢాంధకార పరివృతమై ఉంది. ఎక్కడ వున్నామో, ఏ దిశలో గమిస్తున్నామో, ఎవరికీ అంతు చిక్కటం లేదు. అందుచేత యింక ముందుకు పోవటం మంచిది కాదని-ఆగి, తీరానికి జేరాం. అక్టోబర్ నెల కావటంచేత చలి కాచు కుంటానికి కొన్ని చితుకులు ఏరి చలిమంట వేసుకున్నాం. తెల్లవారేవరకూ అలాగే గడిపాం. మేం జేరింది కూపర్సు కయ్యప్రాంతమని అప్పుడు తెలిసింది. మళ్ళీ వెనక్కి తిరిగి ఆదివారం తొమ్మిది గంటలకు మాగమ్య స్థానం జేరు కున్నాం. నా పరిస్థితి అప్పుడేమీ బాగాలేదు. మాసిన ధూళి దూసరితమైన దుస్తులతో వాడిపోయిన ముఖంతో ఆ పట్టణం వెంట నడుస్తున్నాను. ఎక్కడ బస చెయ్యాలో అర్థంకాలేదు. నా దగ్గరవున్న పైకమల్లా ఒక డచ్చిడాలరూ, ఒక రాగి షిల్లింగు మాత్రమే. షిల్లింగు నౌక వాళ్ళకు యిచ్చాను. నేనుకూడా తెడ్డువేసి వారికి సాయం చేయటం చేత, నా దగ్గర డబ్బు తీసుకుంటానికి మొదట వారు నిరా కరించారు. కాని, నేను బలవంతంగా యిచ్చివేశాను. మనిషి ఎప్పుడూ భోగ భాగ్యాలు అనుభవిస్తున్నప్పుడు కంటె - బికారి జీవితం గడుపుతున్నప్పుడే త్యాగశీలుడై ఉంటాడు.

నేను అలా వీధులవెంట నడుస్తూ మార్కెట్ జేరు కున్నాను. హోటలు ఎక్కడ వుందో తెలుసుకుని, అక్క డకు వెళ్లాను. హోటలుకు వెళ్ళి, బిస్కట్లు కావాలని అడి

గాను. బోస్టన్‌లోని బిస్కట్లు గుర్తువచ్చాయి. కాని, అక్కడ దొరికిన బిస్కట్లు అంత బాగుండలేదు. మూడు పెన్నీలు ఖరీదుచేసే రొట్టె ఏదైనా యిమ్మన్నాను. అతగాడు మూడు పెద్ద రొట్టెలను యిచ్చాడు. ఒక్కటి మాత్రం అప్పుడు తిని, తక్కిన రెండూ చేత పుచ్చుకుని, మళ్ళీ వీధిలోకి నడిచాను. నాల్లో వీధిగుండా నడుస్తూ, ఒక యింటిని దాటుతుండగా, గుమ్మంలో నిలబడియున్న ఒక యువతి నా కళ్ళ బడింది. ఆమె భవిష్యత్తులో నాకు భార్య ఔతుందని, అప్పుడు నా కనిపించలేదు. ఆమె నాకేసి చూసింది. కాని నా దుస్తులు చాలా అసహ్యాకరంగా ఉన్నాయి. గిరుక్కున వెనక్కు తిరిగి, వాల్‌నట్ వీధిలో భాగమైన చస్‌నట్ వీధి చేరుకున్నాను. ఇంకా ముందుకు సాగి, తిరిగి తిరిగి, మళ్ళీ నేను బయలుదేరిన రేవు దగ్గరకే చేరాను. అక్కడ మరొక రొట్టె తిని కాసిని మంచినీళ్ళు త్రాగాను. మిగిలిన రొట్టెను నౌకలో ప్రయాణం చేస్తున్న ఒకానొక ప్రయాణీకురాలి బిడ్డకు ఇచ్చివేశాను. మళ్ళీ వీధుల వెంట గమ్యం మెరుగని గమనం సాగించాను, శుభ్రమైన దుస్తులు ధరించి, బాగా అలంకరించుకుని, కొందరు గుంపులు గుంపులుగా వీధి వెంట నడుస్తున్నారు. నేనుకూడా ఆ గుంపులో కలిసాను. వారంతా కలి - సిఒక సభా మంటపంలోకి వెళ్ళారు. నేనూ వెళ్ళాను. అందరూ ఆశీనులయ్యారు, నేను ఒక సీటులో కూర్చున్నాను. నాల్గు ప్రక్కలా ఒకసారి పరికించి చూసి, అక్కడే కూర్చుని, కళ్లు మూశాను. నిద్ర పట్టింది. సమావేశం సమాప్తమైపోయాక, ఒక బుద్ధిమంతుడు నా భుజం తట్టేవరకూ నాకు మెలుకువ

రాలేదు. ఆ సభామంటపమే ఫిలడల్ఫియాలో నేను మొట్ట మొదటి విశ్రాంతి తీసుకున్న గృహం. మళ్ళీ వీధిలోకి నడిచి, నది కేసి నడుస్తున్నాను. ఎదురైన వారి ముఖాల్లోకి సాభిప్రాయంగా చూస్తూ, ఒక క్వేకర్ కనిపించాడు. అతన్ని చూడగానే, నాకు చాలా సదభిప్రాయం కలిగింది. ఒక పర దేశికి నివాసం ఎక్కడ దొరుకుతుందని అతన్ని ప్రశ్నించాను. అతడొక భవనం కేసి చూసి, 'యిక్కడ లభించవచ్చు గాని, యిదేమంత గౌరవప్రదమైన చోటు కాదు' అని చెప్పాడు. అతడే నన్నొక విశ్రాంతి భవనానికి తీసుకు వెళ్ళాడు. అక్కడ నాకు మంచి భోజనం లభించింది. ఆ భవనం వాటర్సుస్ట్రీట్‌లో ఉంది. నేను భోజనం చేస్తున్నప్పుడు, చాలా మంది నా చుట్టూ జేరి నామీద ప్రశ్నల వర్షం కురిపించారు. నా వాలకం, నా వయస్సు చూసి యింట్లోంచి పారిపోయి వచ్చిన రకమని వ్యాఖ్యానించుకున్నారు. భోజనం కడుపు నిండా పడగానే, నిద్రాదేవి నన్ను ఆవహించసాగింది. నేను వెంటనే మంచంమీద వ్రాలిపోయి దుస్తులు విప్పకుండానే నిద్రపోయాను. సాయంత్రం ఆరుగంటలకు లేచి, భోంచేసి మళ్ళీ పడుకున్నాను. తెల్లవారేదాకా మెలుకువ రాలేదు.

మర్నాడు నేను ముస్తాబు చేసుకుని, ఆండ్రూ బెడ్ ఫోర్డు దగ్గరకు బయలుదేరాను. అతడే ప్రెస్ యజమాని– నేను అక్కడకు వెళ్ళేసరికి, బెడ్‌ఫోర్డు అక్కడే ఉన్నాడు. అతడు గుర్రంమీద ప్రయాణం చేసి, నా కంటె ముందే అక్కడకు చేరుకున్నాడు. నన్ను తన కొడుక్కు పరిచయం చేసి, ఉద్యోగం యిమ్మని సిఫార్సు చేసాడు. ఆండ్రూ బెడ్

నన్ను సాదరంగా ఆహ్వానించి, అతిథ్య మిచ్చాడు. కాని, అంతకుముందే వేరొకసకి ఉద్యోగం యివ్వటంచేత తానేమీ సహాయం చేయలేనన్నాడు. కాని ఊళ్ళో కొత్తగా పెట్టిన మరొక ప్రెస్‌వుంది. దాని యజమానిపేరు కైమర్. అక్కడ ప్రయత్నించటం మంచిదని నాకుసలహాయిచ్చాడు. నేను కైమర్ దగ్గరకు బయలుదేరాను. బ్రాడ్‌ఫోర్డుకూడా నాతోపాటువచ్చి, కైమర్‌కు నన్ను పరిచయంచేసి, వచ్చిన పని వివరించి చెప్పాడు. బ్రాడ్‌ఫోర్డుకు అంతకుముందు కైమర్‌తో ఎలాటి పరిచయమూ లేదు. కైమర్ కొన్ని అక్షరాలు నాచేత కూర్పించి పరీక్షచేసుకుని, నాపని విషయంలో తృప్తిపడి, తప్పకుండా ఉద్యోగం యిస్తానని వాగ్దానం చేశాడు. కాని - వెంటనే మాత్రం యివ్వలేనన్నాడు. ఆ తర్వాత పెద్దవాళ్ళిద్దరూ కబుర్లలోకి దిగారు. కైమర్‌కు బ్రాడ్‌ఫోర్డు ఎవరో తెలియకపోవటంచేత, తన వ్యాపార రహస్యాలన్నీ అనర్గళంగా ఉపన్యసించసాగాడు. పట్టణంలోని ప్రెస్‌వ్యాపారమంతా, కైవసం చేసుకుంటానికి తాను వేయబోతున్న పథకాలను వివరించాడు. బ్రాడ్‌ఫోర్డు మెల్లగా ఆ విషయాలన్నీ విని, నన్ను కైమర్ దగ్గరవదిలి వెళ్ళిపోయాడు. ఆ తర్వాత ప్రెస్‌వ్యాపారంలో తన ప్రత్యర్థి అయిన ఆండ్రూబ్రాడ్ ఫోర్డుకు, వృద్ధుడు సాక్షాత్తు జనకుడని తెలుసుకుని, కైమర్ నిశ్చేష్టుడయ్యాడు.

కైమర్ కూడా కొద్దోగొప్పో కవిత్వం వ్రాయగలడు. న్యాయానికి అతడు వ్రాస్తాడని అనకూడదు. ఎందుకంటే కాగితంమీద కలంపెట్టి వ్రాయటం అతని అనుభవం కాదు.

మనస్సులో అనుకోవటం, సరాసరి అచ్చు అక్షరాలను కూర్చివేయటం ఆయన అలవాటు. అక్కడ కొంతకాలం గడిపి, తిరిగి బ్రాడ్‌ఫోర్డు దగ్గరకు తిరిగి వచ్చాను. ప్రస్తుతానికి నాకొక చిన్నపని అప్పగించాడు. ఆయన యింట్లోనే భోంచేస్తూ, అక్కడే ఉంటూ రోజులు గడుపుతున్నాను. ఒకరోజున క్లైమర్ నాకోసం కబురుపంపాడు. ఒకానొకాయన ఒకానొక విషాద కావ్యాన్ని వ్రాశాడు. దాన్ని అచ్చువేసే అవకాశం క్లైమర్‌కు లభించింది. ఆ పని నాకు వప్పజెప్పాడు క్లైమర్.

ఆ పట్టణంలో ఉన్న రెండుముద్రణాలయాలు సరైనవి కావు. మొదటిప్రెస్ యజమాని బ్రాడ్‌ఫోర్డు నిరక్షరాస్యుడు. అచ్చుపని బొత్తిగా తెలీదు. క్లైమర్‌కు కొంచెం పాండిత్యం ఉన్నా అశ్రద్ధమనిషి. వ్యాపారానికి పనికివచ్చేవాడు కాదు. తనదగ్గర పనిచేస్తూ బ్రాఫోర్డు యింటిలో బసచేయటం క్లైమర్‌కు నచ్చలేదు. అతనికి ఒక యిల్లంటూ ఉందిగాని, అందులో ఫర్నిచరేమీ లేదు. అంచేత నన్ను వేరొక పొరుగింటిలో ఉంచటానికి ఏర్పాట్లు చేశాడు. ఆ విధంగా నేను మిష్టర్ రీడ్స్‌యింట్లో ప్రవేశించాను. అంతలో యింటిదగ్గరనుంచి నా బట్టలూ, కొద్దిగా సామానువచ్చింది. అంతకుముందు మాసిపోయిన దుస్తులతో బికారిలా తిరుగుతున్నప్పటికంటె – యిప్పుడు మిస్ రీడ్ దృష్టిలో గౌరవప్రదంగా కన్పించే అవకాశం నాకు కల్గింది. ఇప్పుడిప్పుడే, ఊళ్ళో కొందరు స్నేహితులతో పరిచయం లభించింది. వారికి కూడా సాహిత్యంలో ఇతోధికంగా శ్రద్ధాసక్తులున్నాయి.

సాయం సమయాల్లో వారితో కలిసి షికారులకు వెళ్ళేవాణ్ణి. కష్టించిపనిచెయ్యటంవల్ల ఆదాయంకూడా బాగానేవస్తూంది. అందులో కొంతమిగిల్చి మంచి పుస్తకాలు కొనుక్కునే వాణ్ణి. బోస్టన్ పట్టణాన్ని, గత జీవితాన్ని చాలావరకు మర్చిపోయాను. నా ఉనికి, బోస్టన్‌లో ఎవరికీ తెలియకుండా జాగ్రత్తలు తీసుకున్నాను. ఒక్క కాలిన్సుకు మాత్రం క్షేమ సమాచారాలు వ్రాస్తూండేవాణ్ణి. అలా రోజులు బాగానే దొర్లుకుపోతున్నాయి - కాని ఆకస్మికంగా సంభవించిన ఒక సంఘటనవల్ల అనుకున్నదానికంటే ముందే నేను బోస్టన్ పట్టణానికి వెళ్ళాల్సి వచ్చింది.

ఆ సంఘటన యిది:

నాకు రాబర్ట్ హోమ్సు అనే ఒక బావమరదిఉన్నాడు. బోస్టన్ - డిలవేర్ పట్టణాలమధ్య నడిచే ఒక చిన్న ఓడకు అతను యజమాని. అతడిప్పుడు ఫిలడల్ఫియాకు నలభై మైళ్ళ దూరంలో గల న్యూకాజిల్సు పట్టణంలో ఉంటూ, నా గురించి విని, తిరిగి యింటికిపొమ్మని సలహానిస్తూ, నాకు ఒక సుదీర్ఘమైన లేఖ వ్రాశాడు. నేను బోస్టన్ విడిచిరావటానికి కారణాలను వివరించి, శ్రమపడి సలహా యిచ్చినందుకు ధన్య వాదాలు తెలుపుతూ, తిరిగి యింటికి వెళ్ళదల్చుకోలేదని జవాబు వ్రాశాను. రాష్ట్రగవర్నర్ సర్ విలియం కీత్ అప్పుడు న్యూకాజిల్‌లోనే ఉన్నాడు. కెప్టెన్ హోమ్సు గవర్నర్ దగ్గరుండగా నా జవాబు ఆయనకందడం - కాక తాళీయంగా జరిగింది. ఆ అవకాశం వినియోగించుకుని కెప్టెన్ హోమ్సు, నా వ్యవహారమంతా చెప్పి - నా ఉత్త

రాన్ని ఆయనకు చూపించాడు. అంత చిన్నవయస్సులో అంత చక్కటి ఉత్తరం రాయటం చూసి, ఆశ్చర్యపోయి, 'ముందు ముందు బెంజిమన్ బాగా పైకివస్తాడుసుమా' అని ఆశీర్వదించాడుట. ఫిలడల్ఫియాలో సమర్థులైన ప్రచురణ కర్తలు లేకపోవటంచేత, నేనుగనుక అక్కడ స్వయంగా ప్రెస్ వ్యాపారం ప్రారంభిస్తే, బాగా వృద్ధిలోకి వస్తానని ఆయన సలహాయిస్తూ, తనకి సంబంధించినంత వరకూ, ప్రభుత్వం చెయ్యదగ్గ సాయమంతా చేస్తుందని హామీ యిచ్చాడు. ఆ తర్వాత యీ ఉదంతాన్ని బోస్టన్‌లో నా బావమరిది చెప్పాడు. ఒకరోజున కైమర్‌తోకలిసి ప్రెస్‌లో నేను పనిచేసుకుంటూఉండగా గవర్నరు, మరొక ఫ్రెంచి ఆఫీసర్‌తో కలిసి వస్తూండటం చూశాను. వారు సరాసరి వచ్చి, మా ప్రెస్ తలుపు తట్టారు. వారు తనకోసమే వచ్చి ఉంటారని నమ్మి కైమర్ పరుగు పరుగునపోయి, తలుపు తెరిచాడు. కాని గవర్నరు నా పేరు అడిగాడు. నన్ను చూసి సాదరంగా అభినందించి తనతోపాటు కొంత కాలం గడపటానికి, మద్యశాలకు రమ్మని ఆహ్వానించాడు. విషం త్రాగి చచ్చిపోతున్న పందిలా ముఖంపెట్టి అలాగే నిర్ఘాంత పోయి చూస్తున్నాడు కైమర్. గవర్నర్ అంతటి వ్యక్తి స్వయంగా, నన్ను వెతుక్కుంటూ ఎందుకురావలసివచ్చిందో- అతనికి అర్థంకాలేదు. ఏమైతేనేం, నేను గవర్నర్‌తోనూ, ఫ్రెంచి ఆఫీసర్‌తోనూ కలసి, మూడోవీధి మలుపులోవున్న ఒకమద్యశాలకువెళ్ళాను. తలాకాస్తమద్యం తాగుతూండగా నన్ను స్వంతంగా ప్రెస్ పెట్టమనీ, ప్రభుత్వానికి సంబంధిం

చిన వ్యాపారమంతా నా కిస్తాననీ ప్రోత్సహించాడు గవర్నరు. ఫ్రెంచి ఆఫీసర్ కూడా, తన ప్రభుత్వాని కవసరమైన అచ్చుపనులన్నీ, నాకే యిస్తానని వాగ్దానంచేశాడు. నాకు కూడా, స్వంతంగా ప్రెస్ పెట్టాలనే ఉత్సాహం కలుగుతూంది. కాని నా తండ్రి ఇందుకు అనుమతిస్తాడో లేదో అనే అనుమానం కల్గింది. ఈ విషయం విని గవర్నర్ నా తండ్రికి ఒక ఉత్తరం వ్రాస్తూ, అందులో నేను స్వయంగా వ్యాపారం ప్రారంభిస్తే, ఎంత వృద్ధిలోకి రావచ్చో వివరించాడు. ఆ ఉత్తరాన్ని నా కిచ్చాడు. అంచేత నా తండ్రితో సంప్రదించటానికి తిరిగి బోస్టన్ వెళ్ళటానికి నిశ్చయించుకున్నాను. అంతవరకూ – ఈ నిర్ణయం రహస్యంగానే ఉంచి, కైమరు దగ్గిర మామూలుగా పని ప్రారంభించాను. గవర్నరు తరుచు నన్ను భోజనానికి పిలవటం – అత్యంత ప్రేమాభిమానాలు ప్రదర్శించటం నేను చాలా గొప్ప గౌరవంగా భావించాను. 1724 ఏప్రియల్ నెల్లో ఒక చిన్నఓడ బోస్టన్‌కు బయలు దేరుతుందని తెలిసింది. స్నేహితులను చూడటానికి బోస్టన్ వెళ్ళదల్చుకున్నానని, కైమర్‌కుచెప్పి శలవుతీసుకున్నాను.

ఫిలడల్ఫియాలో ప్రెస్ వ్యాపారం ప్రారంభించటానికి బెంజిమన్‌కుచేయూతనిచ్చి ప్రోత్సహించమంటూ, గవర్నర్ నాతండ్రికి సిఫార్సు చేసిన లేఖను పుచ్చుకుని ఓడనెక్కాను. పదిహేను రోజులకు సురక్షితంగా బోస్టన్ నగరం జేరాను.

నన్ను అంత త్వరితంగా తిరిగి బోస్టన్‌కు తీసుకువచ్చిన సంఘటన అది.

ఆ ఏడు నెలలూ నేను ఎక్కడఉన్నానో – బోస్టన్‌లో ఎవరికీ తెలియకపోవటం చేత, ఆకస్మికంగా నేను అక్కడ

ప్రత్యక్షం కావటం అందరినీ ఆశ్చర్యచకితుల్ని చేసింది. నా అన్న ఒక్కడు తప్ప, యింట్లో వాళ్ళంతా, ఎంతో ఆనందించారు. నేను అన్నను చూడటానికి ప్రెస్‌కు బయలుదేరాను. క్రిందనుంచి పైవరకూ చక్కటి సూట్ వేసుకుని, ముంజేతికి గడియారం ధరించి వెళ్ళటంవల్ల నన్నుజూసి, నా అన్న ఒకింత ఆశ్చర్యం చెందినట్లు కనిపించాడు. అతని దగ్గర పనిచేసిన కాలంలో - నేనెన్నడూ అలాటి దుస్తులు ధరించలేదాయెను! నన్నుచూసి ముభావంగా ఆహ్వానించి క్లుప్తంగా రెండుముక్కలు మాట్లాడి మళ్ళీ తన పనిలో మునిగిపోయాడు. తక్కినవారంతా నాచుట్టూజేరి - నేను ఇన్నాళ్ళూ ఎక్కడుందీ, ఏం చేసిందీ, అక్కడిజీవితం ఎలా ఉందీ-అంటూ ప్రశ్నలవర్షం కురిపించారు. నేను ఫిలడల్ఫియాలోని, నా జీవితాన్ని వర్ణించి, అక్కడ నేను అనుభవించిన సౌఖ్యానందాలను వివరించాను. మళ్ళీ సాధ్యమైనంత త్వరలో అక్కడకు తిరిగి పోగోరుతున్నానని కూడా చెప్పాను. అందులో ఒకడు ఫిలడల్ఫియాలో మారకానికి ఏ ముపయోగిస్తారని ప్రశ్నించాడు. నేను జేబులోనుంచి, గుప్పెడు వెండి నాణెములు తీసి, చూపించాను. అందరూ వింతగా చూశారు. ఎందుకంటే బోస్టన్‌లో కాగితపు కరెన్సీ మాత్రమే అమల్లో ఉంది. నా అన్న జేమ్సు మాత్రం, నాతో చాలా ముభావంగా ఉంటున్నాడు. ఇదిచూసి, నా తల్లి అతణ్ణిపిలిచి "నాయనా! అన్నదమ్ములై జన్మించినందుకు అన్యోన్యంగా ఉంటూ, ఒకరినొకరు ఆదుకుంటూ ఉంటే నా జన్మ తరిస్తుంది." అని

హితవు చెప్పిందట. దానికి నాఅన్న కఠినంగా "వాడునన్ను అవమానించాడు. గనుక జన్మలో వాడిని క్షమించదల్చుకో లేదు" అని సమాధానం చెప్పాడుట! ఆ రోజే గవర్నరు వ్రాసియిచ్చిన ఉత్తరం నా తండ్రికి యిచ్చాను. ఆయన ఆశ్చర్యపోతూ దాన్ని తీసుకుని చదివాడు. కాని అప్పటికి ఏ విధమైన వ్యాఖ్యానమూ చేయలేదు. అంతలో కెప్టెన్ హోమ్సు బోస్టన్ రావటం తటస్థించింది. గవర్నర్ వ్రాసిన ఉత్తరాన్ని నా తండ్రి అతనికి చూపి, గవర్నరు ఎటువంటి మనిషని అడిగాడు. ఇంకా మైనారిటీ తీరని పసివాణ్ణి, అలా దేశంకాని దేశంలో వ్యాపారం పెట్టమని ప్రోత్సహించటంలో గవర్నరు చూపిన వివేకం ఆయనకు బోధపడలేదు. ఏమైనా, ఆయన ఈ ప్రయత్నాన్ని సమర్థించుకో దల్చుకోలేదు. వెంటనే గవర్నరుకు జవాబు వ్రాస్తూ "నా బిడ్డపై మీరు చూపిన ఆదరాభిమానాలకు ధన్యవాదాలు. కాని ఇంత చిన్నవయస్సులోఉన్న కుర్రవానిచేత అంత పెట్టుబడితో, దూరదేశంలో వ్యాపారం సాగించటం సాధ్యమైన విష యంగా నాకు కనిపించటం లేదు." అని వక్కాణించాడు.

నాకు బాగా ఆత్మీయుడైన స్నేహితుడు కాలిన్స్ అప్పుడు పోస్టాఫీసులో గుమాస్తాగా పనిచేస్తున్నాడు. నావిదేశ యాత్రకు సంబంధించిన అనుభవాలన్నీ అతనికి బాగా నచ్చి నయ్. తనుకూడా ఫిలడల్ఫియా రా దల్చుకున్నానని చెప్పి, నాకంటేముందే బయలుదేరాడు. ముందే న్యూయార్కు జేరి అక్కడ నా కోసం ఎదురు చూస్తుంటానని చెప్పాడు. నేను మాత్రం, వ్యాపార విషయంలో నా తండ్రి అంతిమ

నిర్ణయంకోసం ఉత్కంఠతో ఎదురుచూస్తున్నాను. నా తండ్రి తిరిగి, నా ప్రతిపాదనను వ్యతిరేకిస్తూ, కొంత వయస్సు వచ్చేవరకూ, అలాగే అందరికీ తల్లో నాలికలా ఉంటూ, ఉద్యోగంచేసి, కొంతడబ్బు కూడ బెట్టమనీ, ఆ తర్వాత యింకా అవసరమైన సాయం తాను చేస్తాననీ చెప్పాడు. నా అన్నకూ నాకూ శృతి కలియక పోవటం, ఫిలడల్ఫియాలో, నాకు వాతావరణం అనుకూలంగా ఉండటంచూసి, తిరిగి అక్కడకు వెళ్ళటానికి మాత్రం నా తండ్రి అంగీకరించాడు. మా అమ్మ నన్ను సాగనంపుతూ, ప్రేమ పురస్సరంగా కొన్ని బహుమతులు యిచ్చింది. నేను కొండంత ఆశతో అంతదూరం ప్రయాణంచేసి, బోస్టన్ వచ్చినందుకు నాకు లభించిన ప్రతిఫలం అది మాత్రమే. మళ్ళీ ఫిలడల్ఫియా బయలుదేరాను. కాని ఈసారి మాత్రం నా తల్లి తండ్రుల ఆశీస్సులు నాకు లభించాయి. రోడ్ ద్వీపంలో ఓడ ఆగినప్పుడు-అక్కడుంటున్న మరొక అన్న జాన్‌ను చూడటంకోసం న్యూఫోర్డులో ఓడ దిగాను. కొన్ని సంవత్సరాల క్రితం వివాహం చేసుకుని, అతనక్కడ స్థిరపడి పోయాడు. అతనికి నామీద ప్రత్యేకంగా ప్రేమాభిమానాలున్నాయి. పెన్సిల్వేనియాలో అతనికి, వెర్నన్ అనే స్నేహితుడు కొంతడబ్బు బాకీ పడ్డాడుట. దాన్ని వసూలు చేసి తనకు పంపమని చెప్పి, తదనుకూలంగా వెర్నన్‌కు ఒక లేఖ వ్రాసి యిచ్చాడు. కాని దీనివల్ల, ఆ తర్వాత కొంత యిబ్బంది కల్గింది. న్యూఫోర్డులో న్యూయార్కు వెళ్ళవలసిన ప్రయాణీకులు చాలామంది ఓడనెక్కారు. ముఖ్యంగా,

ఇద్దరు స్త్రీలు నన్ను ఆకర్షించారు. వారి ప్రక్కనే మరొక యువతి కూర్చునిఉంది. ఆమెకు చిన్న చిన్న పనులు కొన్ని చేసిపెట్టటంచేత, నామీద ఆమెకు మంచిఅభిప్రాయం ఏర్పడింది. ఆమె ప్రక్కనేకూర్చున్న, యిందాకటి ఇద్దరుస్త్రీలతో నేను చనువుగా మాట్లాడుతూ ఉండటంచూసి, ఆ యువతి నన్నుపిలిచి మందలించింది. "నీకు మరొక స్నేహితుడిక్కడ లేడుగనుక నేను చెప్తున్నాను. లోకాన్ని గురించీ, లోకుల్ని గురించీ నీకంతగా తెలిసినట్లు కనిపించటం లేదు. కుర్రతనంలో తేలికగా కాలు జారటానికి అనేక అవకాశాలు ఎదురౌతూ ఉంటాయి. ఆ యిద్దరూ, మంచి స్వభావంగల స్త్రీలుకారు. వాళ్ళ ప్రవర్తన నేను యిందాకటినుంచీ గమనిస్తున్నాను. వాళ్ళు నీకు పూర్తిగా అపరిచితులు. కేవలం నీ మంచికోరే స్నేహితురాలిగా నీకు సలహా యిస్తున్నాను. వాళ్ళకు సాధ్యమైనంత దూరంగా ఉండు. లేకపోతే చిక్కుల్లో పడతావు సుమా" అని హెచ్చరించింది.

మొదటి ఆ యిద్దరి స్త్రీలమీదా, నాకు ఏ విధమైన దురభిప్రాయం కలగలేదు. కాని క్వేకర్ చెప్పింది విని, వాళ్ళను సూక్ష్మంగా పరిశీలించాక, ఆమె చెప్పింది అక్షరాలా నిజం అనిపించింది. ఆ స్త్రీలు న్యూయార్కులో తమ బసకు తప్పకుండా రమ్మని నన్ను ఆహ్వానించారు. కాని క్వేకర్ యువతి సలహాను పాటించి నేను మాత్రం వెళ్ళలేదు. అందువల్ల మంచే జరిగింది. కెప్టెన్‌యొక్క వెండి సామాను కొంత పోవటం, ప్రయాణీకులందరి సామాన్లూ సోదా చేయగా, వారిదగ్గర అవి దొరకటం జరిగింది. కాబట్టి ఒక ప్రమాదంలోంచి నేను బయటపడ్డా నన్నమాట!

న్యూయార్క్ చేరగానే - అక్కడ నాకోసం ఎదురు చూస్తున్న నా స్నేహితుడు కాలిన్సును కలుసుకున్నాను. మేమిద్దరం చిన్ననాటినుంచీ, చాలా ఆత్మీయంగా కలిసి మెలిసి జీవించిన స్నేహితులం. ఒకే విధంగా ఆడుతూ, పాడుతూ, ఒకే పుస్తకాలు చదువుకుంటూ గడిపినవాళ్ళం. కాని చదువుకుంటానికి అతనికి లభించిన అవకాశం, నా కుండేది కాదు. లెఖ్ఖల్లో నాలా కాకుండా అతడు చాలా తెలివైనవాడు. అతని ధారణాశక్తి అద్భుతమయింది. బోస్టన్‌లో గడచిన నా జీవితంలో చాలా భాగం, అతని సాహచర్యంలోనే గడిపాను. అతడు చాలా కష్టజీవికూడా. అంచేత పెద్దలందరి మన్ననలకూ పాత్రుడయాడు. కాని నాకంటే ముందే న్యూయార్కు జేరటంచేత, అక్కడ బాగా త్రాగుడు అలవాటుచేసుకున్నాడు. రోజురోజుకూ ఆ దుర లవాటు అధికమౌతూంది. వళ్లు తెలియకుండా త్రాగి చాలా అసహ్యకరంగా ప్రవర్తించేవాడు. క్రమంగా జూదంకూడా ప్రారంభించాడు. జూదంలో డబ్బంతా పోగొట్టుకోనటమే గాక, కొంత మొత్తం బాకీపడ్డాడు. అతని అప్పు తీర్చవల సిన భారం నాపై బడింది. అది అంతటితో ఆగలేదు. ఫిల డల్ఫియాలో అతన్నికూడా నేనే పోషించవలసివచ్చింది. ఇది నాకు చాలా బాధాకరంగా పరిణమించింది. న్యూయార్క్‌లో ఉండగా, ఒక కెప్టెన్ద్వారా నా గురించి విని, గవర్నర్ బర్నెట్ నాకోసం కబురుపంపాడు. నేను వెళ్తూ, నాతోపాటు కాలిన్సును కూడా అక్కడకు తీసుకువెళ్ళాను. గవర్నర్ నన్ను ఆప్యాయంగా ఆహ్వానించి, తన పెద్ద లైబ్రరీని చూపాడు. సాహిత్యాన్ని గురించీ, రచయితల్ని

గురించీ, చాలావిషయాలు మాట్లాడుకున్నాం. నన్ను అభిమానించిన గవర్నర్లలో బట్లర్ రెండవవాడు. నా వంటి బీదవానికి అంతటి గౌరవం లభించటం బ్రహ్మానందమయింది. ఆ తర్వాత మేం ఫిలడల్ఫియా బయలుదేరాం.

మార్గమధ్యంలో నా అన్న జాన్ యిచ్చిన లేఖ చూసి, వెర్నన్ దగ్గర బాకీ డబ్బు వసూలు చేశాను. ఆ డబ్బే గనక లేకపోతే - మా ప్రయాణం సాగేదికాదు. కాలిన్స్ ఉద్యోగం సంపాదించటానికి ప్రయత్నాలు ప్రారంభించాడు. అనుమానాస్పదమైన అతని ప్రవర్తన గమనించటంచేత, ఎవరూ అతనికి ఉద్యోగం యివ్వటానికి యిష్టపడలేదు. అంచేత నా బసలోనే నా సంపాదనమీదే, అతను జీవించాల్సి వచ్చింది. నా దగ్గర వెర్నన్ యిచ్చిన బాకీ డబ్బుందని గ్రహించి-కాలిన్స్ తరచుగా నన్ను అప్పు అడిగి తీసుకునేవాడు. త్వరలోనే సర్దుతానంటూ, వ్యర్థ వాగ్దానాలు మాత్రం చేసేవాడు ఆ బాకీ డబ్బు కట్టవలసిన బాధ్యత నాది కావటంచేత, ఎలా కట్టాలీ-అనే సందిగ్ధావస్థ నా కెదురయింది. కాలిన్స్ త్రాగుడు మానలేదు. మానే ధోరణి కూడా కనిపించటంలేదు. ఈ విషయంలో మా యిద్దరికీ తీవ్రంగా ఘర్షణ జరుగుతూండేది. అందులో విపరీతంగా త్రాగి, వళ్ళు తెలియకుండా పడిపోయేవాడు. ఒకసారి కాలిన్సుతోనూ, యింకా పదిమంది స్నేహితులతోనూ కలిసి, నేను బోటు షికారుకు బయలుదేరాను. అందరితో పాటు కాలిన్సుకు కూడా తెడ్డు వేయవలసిన వంతువచ్చింది కాని మొరటుగా, నేను వెయ్యనంటూ కూర్చున్నాడు. నేను యింటికి వెళ్ళిపోదల్చుకున్నా నన్నాడు. దానిమీద

మాకు కొంతఘర్షణ జరిగింది. మేం కలియబడ్డాం. ఆ పోట్లాటలో అతడు నదిలో పడ్డాడు. కాలిన్సు మంచి యీతగాడని మా అందరికీ తెలుసు. అంచేత కంగారు పడ లేదు. అతడు బోటు దగ్గరకు ఈదుకుంటూ వచ్చినప్పుడల్లా మేం లోపలకు రానీకుండా, అడ్డు పడ్తున్నాం. "నువ్వు కూడా తెడ్డు వేయదల్చుకుంటే బోటులోకిరా" అనిచెప్పాం. అతడు చావటానికైనా అంగీకరించాడుగాని, తెడ్డు వెయ్య టానికి మాత్రం నిరాకరించాడు. చివరికి యీది యీది అతను బాగా అలిసిపోయాడు. అప్పుడు అతన్ని బయటకు తీసుకువచ్చాం. రేవులో ఒక వెస్టిండియా కెప్టెన్ మాకు యెదురయ్యాడు. బార్బడజ్‌లోని ఒక పెద్దమనిషి పిల్లలకు చదువు చెప్పటానికి ఒక ట్యూటరు కావాలంటూ, కాలి న్సును తనవెంట తీసుకుపోయాడు. కాలిన్స్ వెళ్ళిపోతూ, నా దగ్గర తీసుకున్న డబ్బు వెంటనే పంపుతానని వాగ్దానం చేశాడు. కాని ఆ తర్వాత అతన్ని గురించిన జాడలే నాకు తెలియలేదు.

వెర్నన్ దగ్గర తీసుకున్న డబ్బు అలా ఖర్చుపెట్టటం, జీవితంలో నేనుచేసిన మొట్టమొదటి పెద్ద తప్పిదం. వ్యాపారం చేయటానికి కావలసిన లౌకికజ్ఞానం, నాకింకా రాలేదని, నా తండ్రి చేసిన నిర్ణయం సరైనదే ననిపించింది. గవర్నర్ సర్ విలియంకు నా తండ్రి ఉత్తరం కొంత కష్టం కలిగించింది. నన్ను పిలిచి "నీ తండ్రి సాయం చేయకపోతేమానె నేను చేస్తాను. మంచి ప్రెస్ పెట్టటానికి కావలసిన సాధనసామాగ్రి అంతా ఒకజాబితా వ్రాసియ్యి. ఇంగ్లండునుంచి తెప్పిస్తాను. ఈ నగరంలో మంచిప్రెస్ ఉండటం ఎంతో అవుసరం. ఈ

వ్యాపారంలో నీకు తప్పకుండా విజయం లభిస్తుంది " అని చెప్పాడు.

గవర్నర్ అభిప్రాయం నాకు బాగా బోధపడింది. గవర్నర్ అంతటివ్యక్తి నా కింతటి సహాయం చేయబోతున్నాడనే విషయం - ఫిలడల్ఫియాలో ఎవరికీ చెప్పకుండా - నేను రహస్యంగా ఉంచాను. అలాచేసి ఉండకపోతే గవర్నర్ తరహా ఎరుగున్న స్నేహితుడెవరైనా నేనుచేస్తున్నది ఎంత పొరపాటని చెప్పిఉండేవాడో. గవర్నర్ ఎవరికైనా వాగ్దానాలివ్వటం ఎంతసులభమో, అవి కార్యరూపం దాల్చటం అంత కష్టం. ఆ విషయం ఆ తర్వాతగానీ నాకు తెలియలేదు. కాని నాదగ్గర వ్యర్థవాగ్దానాలు చేసి, మోసగించవలసిన అవసరం అతనికెందుకూ - అనుకున్నాను. సృష్టిలో ఆయన నా దృష్టిలో ఉత్తమోత్తమ మానవుల్లో ఒకడుగా కనిపించాడు. ప్రెస్ స్థాపించటానికి అవసరమైన సాధన సామాగ్రి అంతా సమగ్రంగా జాబితా వ్రాసి ఆయనకిచ్చాను. అంతా మొత్తం నూరుపౌన్ల స్టెర్లింగ్ విలువచేసేది. స్వయంగా నేనే యింగ్లండ్ వెళ్ళి మంచి సామాను ఎన్నుకొని తెచ్చుకోవటం తెలివైన పనంటూ సలహా యిచ్చాడు గవర్నర్. ఆ సలహా సబబైనదిగానే కనిపించటంచేత-నేనుకూడా లండన్ ప్రయాణానికి సిద్ధపడ్డాను. లండన్-ఫిలడల్ఫియాల మధ్య, సంవత్సరానికి ఒకసారి మాత్రమే ఓడ ప్రయాణం చేస్తూఉంటుంది. ఓడ బయలుదేరేదాకా నేనుకైమర్ దగ్గరే పనిచేస్తూ కాలిన్సు ఖర్చుచేసిన వెర్నన్ డబ్బును కూడబెట్టాలని నిర్ణయించుకున్నాను.

బోస్టన్ నుంచి నేను చేసిన మొదటి యాత్ర సంద ర్భంలో ఒక విషయం చెప్పటం మర్చిపోయా ననుకుంటూ. అప్పుడు నేను మాంసాహారం భుజించకూడదనే నియమాన్ని అనుసరిస్తున్నాను. కాని ఓడలోనివా రందరూ మాంసా హారులే. కాడ్ చేపలనుపట్టి - కూర వండుకున్నారు. మళ్ళీ మైరన్ తన గ్రంథంలో ఉల్లేఖించిన విషయాలను జ్ఞప్తికి తెచ్చుకున్నాను. ఎన్నడూ మన జోలికి రాకుండా - వాటి మానాన్న అవి నీటిలో ఏ మూలనో జీవించే - అమాయిక ప్రాణుల్ని ఆహారంకోసం పట్టి చంపటం-ఒకవిధమైన దారుణ హత్యాకాండగా నాకు కన్పించింది. కాని చిన్ననాటినుంచీ నాకు చేపమాంసమంటే ప్రత్యేకమైన అభిమానం. దానికి తోడు వేడి వేడి చేపమాంసంనుంచి వస్తున్న కమ్మని పరి మళం నా నోరు ఊరిపోతున్నది. నా నియమానికీ - అప్పటి కోరికకూ మధ్య కొంత ఘర్షణజరిగింది. చివరికి అందరితో పాటు చేపమాంసం తినటానికే నిర్ణయించుకున్నాను. ఇది విషయాంతరం.

కైమర్‌తో నేను మంచిగానే ఉంటున్నాను. నా ఆలోచనలను ఆవంతకూడా అతగాడు పసిగట్టలేదు. కైమ ర్‌కు ఏదో ఒక విషయాన్ని గురించి, ఏదో ఒక విధంగా, వాగ్వివాదం పెంచటం - చర్చించటం అలవాటు. నాకూ అదే అలవాటుకావటంచేత - ఇద్దరికీ బాగా శృతి కలిసింది. మా యిద్దరిమధ్య మా సంభాషణ బాగా చురుగ్గా సాగేది. వాగ్వివాదాల్లో ప్రతికక్షుల్ని పట్టికొట్టించటంలో నేను ప్రత్యేక ప్రజ్ఞ సాధించాను. ప్రస్తుతాంశానికి, ఏమాత్రం

సంబంధంలేనట్టు కన్పించే ప్రశ్నలు కొన్ని వేసేవాణ్ణి. కాని అవి చివరకు అసలు విషయానికే దారితీసి, క్రైమర్‌ను చిక్కుల్లో పెట్టేవి. చీకాకు చేసేవి. అలా క్రైమర్ నిరుత్తరు డైపోవటం నాకు గర్వకారణమయేది. నా శక్తి సామర్థ్యాల మీద కొంత విశ్వాసం ఏర్పడింది. క్రైమర్ కొన్ని కొత్త సిద్ధాంతాలు కనిపెట్టాడు. అవి లోకంలో ప్రచారం చేయాలని ఆయన సంకల్పం. అందుకు నా సహాయం అభ్యర్థించాడు. ఆయన సిద్ధాంతాలను ఖండించేవారినోళ్లు కట్టించటమే ఆ సహాయం. అందుకు ప్రాథమికచర్యగా తన సిద్ధాంతాలను ముందు నాకు వివరించి చెప్పసాగాడు. నేను ఓపిగ్గా విన్నాను. కాని అందులో కొన్ని నాకు అంగీకారయోగ్యంగా కన్పించలేదు. కొన్ని సవరణలు ప్రతిపాదించాను. క్రైమర్ వాటిని అంగీకరించాడు. తన తత్వానికి శాఖాహారం పడదంటూ ముందు కొంత మొరాయించాడు. కాని నేను పట్టుపట్టి అతనిచేత మాంసాహారం మాన్పించాను. నేనూ మానాను. ఒక పొరుగింటి యిల్లాలు మాకు వంట వండి తెచ్చిపెట్టేది. చాపలు - మాంసము మొదలైన వాటితో ప్రసక్తి లేకుండా నలభై రకాల కూరల్ని - వాటిని వండే విధానాల్ని ఆమెకు వివరించి చెప్పాను. ఈ శాఖాహార దీక్షలో నన్ను ఆకర్షించిన విషయం మరొకటుంది. ఇది చాలా చౌకవ్యవహారం. ఒక్కొక్కరికీ వారానికి ఎనిమిది పెన్నీలకంటె ఎక్కువ వ్యయం కాదు. అంచేత ఈ నియమం బాగా నచ్చింది. కాని క్రైమర్‌కుమాత్రం బొత్తిగా పడలేదు. పందిమాంసం - చేపమాంసం గుర్తుకు తెచ్చుకుని, అనవరతం గుటకలు మింగుతూఉండేవాడు.

ఇది ఇలా ఉండగా మిస్ రీడ్‌ను వివాహం చేసుకో వాలనే కాంక్ష, నాలో మొలకెత్తుతున్నది. అందుకు ప్రయ త్నాలు ప్రారంభించాను. ఆమెపై నాకు ఎనలేని గౌరవాభి మానాలు ఏర్పడ్డాయి. నాపై ఆమెకుకూడా అలాంటి అభి ప్రాయమే ఉందనుకునేవాణ్ని. కాని దూరతీరాలకు నేను ప్రయాణం చెయ్యబోతున్నాను. మా యిద్దరి జీవితాలూ యింకా పద్దెనిమిది వసంతాలనైనా చవిచూడలేదు. ఆ చిరు వయస్సులో వివాహమాడి, దూరదేశాలకు పోవటంకంటె- తిరిగివచ్చి వ్యాపారం మొదలుపెట్టాక, పెళ్ళిచేసుకోవటమే సుకరమైన సంగతంటూ మిస్ రీడ్ తల్లి సలహా యిచ్చింది. ఈ రోజుల్లోనే సాహిత్యంపై అంతో యింతో ఆసక్తిగల చార్లెస్ ఆస్‌బోరన్-జోసఫ్ వాట్సన్-జేమ్స్ రాల్ఫ్ మొద లైన యువకులు నాకు పరిచయమయ్యారు. మొదటి యిద్దరూ చార్లెస్ బ్రాడెన్‌లో గుమాస్తాలు. రాల్ఫ్ మాత్రం ఒకవర్త కుని దగ్గరపనిచేస్తున్నాడు. జోసెఫ్ వాట్సన్ మంచి వివేక శాలి. రాల్ఫ్ కాలిన్స్‌వలె, మతసంబంధమైనవిషయాలమీద బొత్తిగా నమ్మకం లేనివాడు. ఆస్‌బారన్ బాగా తెలివైన వాడు. నిర్మొహమాటి. స్నేహశీలుడు. కాని సారస్వత విష యాల్లో అతని విమర్శలకు అంతూ అవధీ ఉండదు. రాల్ఫ్ చాలా సూక్ష్మబుద్ధి గలవాడు. మంచివక్త. అంతకంటె అనర్గళంగా ముచ్చటగా మాట్లాడగల వ్యక్తిని నేను చూడ లేదు. అందరం కవిత్వం వ్రాయాలనే ఉబలాట గలవారమే కావటంచేత, తరచుగా ఆదివారాల్లో, పరిసరారణ్యప్రాంతా నికి షికారుపోయే వాళ్ళం. ఒకరు వ్రాసినవి ఒకరు చదివి వినిపించుకునే వాళ్ళం. రాల్ఫ్ కవిత్వంమీద మోజు ఎక్కు

వయింది ఏనాటికైనా, తానొక మహాకవి కాగలడని అతని నమ్మకం. గొప్ప గొప్ప కవులుకూడా ప్రారంభదశలో తన వలె తప్పులు చేశారు. తనూ చేస్తున్నాడు. కవిత్వానికి కావలసిన ఆర్ద్రహృదయమూ—స్పందనా నీకు లేవంటూ, ఆస్ బోరన్ అతణ్ణి నిరుత్సాహ పరిచాడు. నిక్షేపంగా వ్యాపారం చేసుకుని, నాలుగుడబ్బులు సంపాదించుకొమ్మని హితవు చెప్పాడు. నాఅభిప్రాయ మేమంటే–కేవలం భాషను వృద్ధిచేసుకోవాలనే ఆశయంతో ఎవరైనా కవిత్వాన్ని ఆరాధించవచ్చు. అభ్యంతరంలేదు. కాని అంతకు మించిన ఆశలుమాత్రం దానిపై పెట్టుకోకూడదు. ఆ తర్వాత కూడా అనేకసార్లు మేమంతా సమావేశాలు జరపటం, స్వీయ కవితాగానాలు చేసుకోవడం, ఒకరి తప్పులు ఒకరు దిద్దుకోవటం జరుగుతూంది. కేవలం భాషను వృద్ధిచేసుకోవటమే మా ప్రధానాశయం గనుక, కవిత్వ సాంప్రదాయాలనూ మేం పాటించవల్సుకోలేదు. ఒకరోజు రాల్ఫ్ తాను రచించిన ఒకఖండ కావ్యం తెచ్చి నాకు చదివి వినిపించాడు. అది చాలా ప్రతిభావంతమైన కవిత్వంలా నాకు కనిపించటం చేత, అది రచించినందుకు రాల్ఫ్‌కు అభినందన తెల్పాను. ఆ రోజు ఒకచిత్రం చేద్దామంటూ, రాల్ఫ్ "నేను రచించిన దేంట్లోనూ, ఆవంతకూడా ఆస్ బోరన్‌కు మంచికనిపించదు. కేవలం అసూయతో విమర్శలు చేస్తూ ఉంటాడు. నువ్వంటే అతనికిష్టంగనుక ఈ రచన నీదని చదివి వినిపించు. తీరుబడికాక, నేనేమీ వ్రాయలేదని చెప్తాను. అప్పుడు అత గాడి ధోరణి ఎలా ఉంటుందో చూద్దాం" అన్నాడు. నేనూ

అందుకు అంగీకరించాను. ఆ సాయంత్రం దాన్ని నా దస్త్రీలో ఎత్తివ్రాసి, తీసుకెళ్ళాను. మా సమావేశం ప్రారంభమైంది. వాట్సన్ తన రచన చదివి వినిపించాడు. అందులో గుణాలకంటే దోషాలే అధికంగా ఉన్నాయి. తర్వాత ఆస్బోరన్ చదివాడు. అది కొంత నయంగానే ఉంది. కాని అందులోని కొన్ని తప్పుల్ని రాల్ఫ్ విమర్శించాడు. అతను మాత్రం ఏమీ చదివి వినిపించలేదు. చివరకు నేను చదివాను. ఆస్ బోరన్, వాట్సన్ ఇద్దరూ నా కవిత్వం చాలా బాగుందంటూ పొగిడారు. రాల్ఫ్ మాత్రం కొన్ని చోట్ల బాగుండలేదని విమర్శించాడు. నేను నా రచనను సమర్థించుకున్నాను. ఆస్ బోరన్ కూడా నన్నే బలపరిచాడు. రాల్ఫ్‌కు విమర్శనా జ్ఞానం అణుమాత్రం కూడా లేదని తేల్చివేసి "ఓహోహో! ఫ్రాంక్లిన్ యింత చక్కగా కవిత్వం వ్రాస్తాడని ఎన్నడూ అనుకోలేదు. ఎంతశక్తి? ఎంత ఉద్రేకం? ఎటువంటి భావాలు? మాటల్లో అంత తెలివైన వాడుగా కనిపించడుగానీ, నివురుగప్పిన నిప్పులాంటివాడు. ఎంచక్కా వ్రాశాడు?" అంటూ నన్ను ఆకాశంలోకి విసిరివేశాడు. ఆ తర్వాత మేంచేసిన తమాషా విని ఆస్ బోరన్ నవ్వేశాడు.

ఈ సంఘటనతో కవిత్వాన్ని ఆరాధించాలనే కోరిక రాల్ఫ్‌కు పదింతలయింది. ఆతన్ని నిరుత్సాహ పరచడానికి చేయవలసిన ప్రయత్నమంతా చేశాను నేను. కాని అతను అంతమాత్రంతో మానే ఘటంకాదు. చివరకు అతడు మంచి గద్యరచయిత అయ్యాడు. కొన్ని సంవత్సరాలకు నా సమక్షంలోనే ఆతడు జీవితయాత్ర చాలించాడు. అటువంటి స్నేహితుణ్ణి కోల్పోయినందుకు చాలా విచారించాం.

ఆస్‌బోరన్ తర్వాత వెస్టిండీస్‌కు పోయి, న్యాయవాద వృత్తిలో ప్రవేశించి, పుష్కలంగా ఆర్జించాడు. కాని చిన్న వయసులోనే మృత్యువాత పడ్డాడు.

గవర్నర్ దగ్గరనుంచి తరచుగా ఆహ్వానాలువస్తూనే ఉన్నాయ్. అతని సహాయంతో నేను వ్యాపారం ప్రారంభించటం, అప్పుడే జరిగిపోయిన విషయమైనట్లే మాట్లాడేవాడు. తనస్నేహితుల కెందరికో పరిచయం చేశాడు. ప్రెస్ కొంటానికి కొంతడబ్బు నాకు అప్పుగా యిమ్మని చాలా మందికి ఆయన సిఫార్సులు చేశాడు. కాని, వాయిదాల వారీగా తిరగటం మినహా మరోఫలితం లభించలేదు.

ఇప్పుడు లండన్‌పోతున్న ఓడ సిద్ధంగాఉంది. ఆ విషయం చెప్పటానికి నేను గవర్నర్ దగ్గరకు వెళ్ళాను. కాని ఆయన దర్శనం లభించలేదు. గవర్నర్ కార్యదర్శి డాక్టర్ బాల్ మాత్రం బయటకొచ్చి శ్రీవారిప్పుడు చాలా జరూరైన రాచకార్యాల్లో మునిగిఉన్నారు గనుక చూడటానికి అవకాశం లేదనీ, న్యూకాజిల్‌లో కలుసుకుని, వాగ్దానం మేరకు సాయం చేస్తారనీ, సెలవిచ్చాడు. సరేనని బయలుదేరా. రాల్ఫ్‌కూడా నాతో వస్తానంటూ వెంబడించాడు. అతనప్పటికి వివాహం చేసుకుని ఒకబిడ్డనుకూడా కన్నాడు. కమీషన్ వ్యాపారం చేసుకుంటానికి లండన్ వస్తున్నానని నాతో చెప్పాడు. కాని అది కేవలం మిషమాత్రమేననీ, సంసారంమీద విరక్తి చెంది, అలా బయలుదేరాడనీ తర్వాత తెలిసింది. నా స్నేహితులందరి దగ్గరా శలవు పుచ్చు

కున్నాను. మిస్ రీడ్‌ను కలుసుకున్నాను. పరస్పరం అనేక వాగ్ధానాలు చేసుకున్నాం.

అలా ఓడమీద లండన్ బయలుదేరాను. న్యూకాజిల్‌లో ఓడకు లంగరు వేశారు. కాని యీసారికూడా గవర్నరు దర్శనం కాలేదు. ఆయన కార్యదర్శి వచ్చి-గవర్నర్‌గారు చాలా జరూరైన వ్యవహారాలలో క్షణం తీరిక లేకుండా ఉన్నారనీ-సిఫార్సు లేఖలను సరాసరి ఓడ దగ్గరకు పంపిస్తారనీ-చెప్పాడు. గవర్నర్‌గారు, వారి కార్యదర్శి ద్వారా నా ప్రయాణానికి శుభాకాంక్షలు కూడా అందజేశారు. నేను కొంచెం చీకాకుపడి ఓడకు తిరిగి వచ్చాను. గవర్నర్‌గారు చెయ్యబోయే సాయంమీద నా కింకా నమ్మకం కూడు కట్టుకునే వుంది.

మాతోపాటు ఫిలడల్ఫియాకు చెందిన 'మిస్టర్ ఆండ్రూహామిల్టన్' అనే పేరు ప్రఖ్యాతులు గడించిన న్యాయవాది ఒకడు-తన కుమారునితోపాటు ప్రయాణం చేస్తున్నాడు. 'మిస్టర్ డెన్‌హామ్' అనే ఒక క్వేకరు వ్యాపారస్తుడు, 'ఓనియల్ రస్సెల్' అనే ఒక ఇనుప వ్యాపారస్తుడూ కలిసి ఒక పెద్ద కాబిన్ తీసుకున్నారు. రాల్ఫ్‌తో నేను ఒక మూలగా ఒదిగి కూర్చుండవలసి వచ్చింది. మమ్మల్ని ఎవరూ గుర్తుపట్టలేదు. కాని పెద్ద ఫీజు లభించే ఒక కేసు రావటంచేత ఆండ్రూహామిల్టన్ కొడుకుతో కలిసి ఫిలడల్ఫియా వెళ్ళిపోయాడు. ఓడ బయలుదేరేముందు గవర్నర్ పంపిన 'కల్నల్ ఫ్రెంచ్' వచ్చి, నన్ను చాలా గౌరవించి-గవర్నర్ నాకని యిచ్చిన సామాన్లు-సిఫార్సు లేఖలూ ఓడ కెప్టెన్‌కు

అప్పజెప్పానని చెప్పాడు. గవర్నరుగారి సిఫారుస్సు ఉత్తరాలు జాగ్రత్తగా దగ్గరే ఉంచుకుంటం మంచిదనే అభిప్రాయంతో కెప్టెన్‌ను అడిగాను. అవన్నీ యింకా బోలెడు సామానుతో బాటు ఒక సంచిలో వేసి కట్టి దాచటం మూలాన వాటిని యిప్పుడు మళ్ళీ తీయటం సాధ్యపడదనీ, ఛానల్ చేరగానే తీసి ఒప్పజెపుతాననీ చెప్పాడు. గవర్నరుకూ మాకూ వున్న స్నేహసంబంధాలు గ్రహించి ఓడలోనివారంతా మమ్మల్ని గుర్తించారు. కొందరు క్యాబిన్‌లోకి ఆహ్వానించారు. క్యాబిన్‌లో చక్కటి స్నేహితులు దొరికారు ప్రయాణం చాలా సరదాగా సాగిపోతూంది. ఈ ప్రయాణంలో మిస్టర్ డెన్‌హామ్‌తో-నాకు మంచి పరిచయం ఏర్పడింది. ఆ స్నేహం స్నేహం అతను బ్రతికున్నంతకాలం కొనసాగింది. మా ఓడ ఛానల్‌లో ప్రవేశించింది. మాట ప్రకారం సామానులన్నీ విప్పి గవర్నరుగారు నా కిమ్మని పంపిన ఉత్తరాలను, నాకు స్వాధీనం చేశాడు కెప్టెన్. ఆ ఉత్తరాలన్నీ చిందరవందరై పోయి వున్నాయి. అందులో ఒకటి బాస్కెట్ అనే రాజు గారి ప్రెస్ యజమానికి వ్రాయబడింది. 1724 డిశంబరు 24వ తేదీన మేం సురక్షితంగా లండన్ జేరాం. గవర్నరు వ్రాసిన సిఫారుస్సు లేఖ పుచ్చుకొని ఒక ఆసామీ దగ్గరకు వెళ్ళాను. అతగాడు కనుబొమలు చిట్లించి "కైత్ అనే గవర్నరు యెవరో నాకు తెలీదు" అంటూ ఉత్తరం తెరిచాడు. చదివి "ఓ! ఇది రెడెల్స్‌డెన్ దగ్గరనుంచా ? సరిసరి! ఇతడు బ్రహ్మాండమైన మోసగాడని యీ మధ్యే తేలింది. వాడు రాసిన ఉత్తరం నేను చదవదల్చుకోలేదు" అంటూ గిరుక్కున వెనక్కు తిరిగి వెళ్ళిపోయాడు. ఆ తర్వాత గతం

నా ముఁదు మళ్ళీ ఒకసారి పసుగెత్తింది. గవర్నర్ ప్రవర్తన మొదటినుంచీ అనుమానాస్పదంగానే ఉందని అప్పుడు గ్రహించాను. జరిగిన కథంతా విన్నాక డెన్‌హామ్ పకాలున నవ్వి, గవర్నరు కైత్ యెంత పెద్దమనిషో నాకు వివరించి చెప్పాడు. అతడు శుద్ధ కోతలరాయుడనీ, మోసగాడనీ-యెవరూ ఏ విషయంలోనూ అతన్ని నమ్మరనీ-చెప్పాడు. అప్పుడింక ఏంచెయ్యాలో నాకు పాలుపోలేదు. చివరికి యెక్కడన్నా ఒక ప్రెస్‌లో ఉద్యోగం సంపాదించు కొమ్మని డెన్‌హామ్ సలహా యిచ్చాడు. లండన్‌లో పని బాగా నేర్చుకుంటే, అమెరికా వెళ్ళాక అది బాగా ఉప యోగిస్తుందంటూ నన్ను ప్రోత్సహించాడు. నాకు గత్యం తరం లేకపోయింది. గవర్నరు లండన్‌లో వారికీ వీరికీ

యిమ్మంటూ యిచ్చిన ఉత్తరాల్లో ఒక విషయం బయట పడింది. ఇందాక న్యూకాజిల్ వరకూ మాతో ఓడలో వచ్చిన ఫిలడల్ఫియా న్యాయవాది మిస్టరు ఆండ్రూ హామి ల్టన్‌పై, గవర్నరు ప్రభృతులు ఏదో కుట్రపన్నినట్లు గ్రహిం చాం. కాకతాళీయంగా మిస్టర్ డెన్‌హామ్, ఆ న్యాయ వాదికి స్నేహితుడై వుండటం తటస్థించింది. అనుమానాస్పద మైన ఆ లేఖను డెన్‌హామ్‌కు యిచ్చాను. అందుకతడు చాలా కృతజ్ఞత తెలిపాడు. ఆ లేఖలోని భోగట్టా ఆయనకు చాలా వుపయోగించింది. అప్పటినుంచీ, మేం ఇంకా స్నేహి తులమయ్యాం.

కాని గవర్నర్ ఇలా దిగజారిపోయి, నన్ను మోస గించాల్సిన అవుసరం ఎందుకువొచ్చిందో నా కర్థంకాలేదు.

నాలాంటి అన్నెం పున్నెం ఎరుగని యువకుణ్ణి చిక్కుల్లో ఎందుకు పెట్టాలీ అనుకున్నా౯. కాని అది అతని స్వభావం - లేదా అలవాటు. అందర్నీ సంతోషపెట్టాలని అతడి తాప త్రయం. అది సాధ్యంకాక ఏవో వెర్రి మొర్రి వాగ్దానాలు చేస్తూంటాడు. ఈ స్వభావం మినహా - అతడు మంచివా డనే చెప్పాలి. పరిపాలనాదక్షుడేగాక, చక్కటి రచయిత కూడా. అతని హయాంలోనే ఉపయోగకరమైన అనేక శాసనాలు అమలుజరుపబడ్డాయి.

రాల్ఫ - నేనూ విడదీయరాని స్నేహితులమయ్యాం. బ్రిటానియాలో ఇద్దరంకలిసి వారానికి మూడు షిల్లింగుల మూడు పెన్నీల అద్దెకు ఒక బస ఏర్పాటుచేసుకున్నాం. అంతకంటె ఎక్కువ అద్దె భరించగల స్థితిలో అప్పుడు లేం. రాల్ఫకు లండన్‌లో బంధువులున్నారు. కాని ఏమంత భాగ్యవంతులు కాకపోవటంచేత వారినుంచి ఏలాటిసాయమూ రాల్ఫకు లభించలేదు. తాను మళ్ళా ఫిలడల్ఫియా రాద ల్చుకోలేదనీ - లండన్‌లోనే ఉండిపోదల్చుకున్నాననీ-ఇప్పు డిప్పుడే తన అభిప్రాయం బయటపెడ్తున్నాడు. అతడు తనతో డబ్బేమీ తీసుకురాలేదు. తెచ్చిన కాస్తడబ్బూ ప్రయాణ ఖర్చులతో నిండుకుంది. నాదగ్గర అనేకసార్లు అప్పంటూ తీసుకుంటూ, ఉద్యోగంకోసం ప్రయత్నాలు ప్రారంభిం చాడు. మొట్టమొదట ఒక నాటకాల కంపెనీలో చేరదా మనుకున్నాడు - నటుడికి కావలసిన హావభావప్రకటనాది సర్వలక్షణాలూ తనలో పుష్కలంగా ఉన్నాయని, అతని స్వంత అభిప్రాయం. కాని ఆ నాటక కంపెనీ యజమాని

మాత్రం అతనితో ఏకీభవించక, నిర్మొహమాటంగా అలాంటివాటిజోలికి రావద్దని చెప్పివేశాడు. తర్వాత పేటర్ నోస్టర్‌లోని రాబర్ట్సు అనే పబ్లిషర్సును కలుసుకుని, స్పెక్టేటర్‌మాదిరి వారంవారం తాను కొంత వ్రాస్తానని చెప్పాడు. కాని రాబర్ట్సు అందుకు ఒప్పుకోలేదు. ఆతర్వాత అనేక ఉద్యోగాలకై అనేక విఫలయత్నాలు చేశాడు.

బార్త్‌లోం యూక్లోజ్‌లో ప్రసిద్ధిచెందిన పామర్సు ప్రెస్‌లో నాకు వెంటనే ఉద్యోగం దొరికింది. అక్కడ ఒక సంవత్సరం పనిచేశాను. బాగానే గడిచింది. కాని నా కష్టార్జితమంతా, రాల్ఫ్ నాటకాలు, వినోదాలూ చూడటానికి వినియోగించుకుంటున్నాడు. నేను తెచ్చుకున్న డబ్బంతా అయిపోయింది. రెక్కాడితేగాని డొక్కాడని పరిస్థితి వచ్చింది. రాల్ఫ్ తన భార్యాబిడ్డలను పూర్తిగా మరిచిపోయినట్టు కనిపించాడు. నేను లండన్ వచ్చాక మిస్ రీడ్‌కు ఒక్క ఉత్తరం మాత్రం వ్రాశాను, అదైనా నాకు తిరిగి రావటానికి చాలా ఆలస్యం పడ్తుందంటూ. నేను జీవితంలో చేసిన మరొక పెద్దపొరపాటు అది. జీవితం గనక తిరిగి పునరావృతం కావటమంటూ జరిగితే మొదట సరిదిద్దుకోవలసిన విషయం అది. పామర్‌లో నేను బాగానే పని చేస్తున్నాను. వాట్సన్ యొక్క 'రెలిజియన్ ఆఫ్ నేచర్' అనే గ్రంథానికి అప్పుడు రెండవకూర్పు చేస్తున్నాను. అతని సిద్ధాంతాలు కొన్ని నాకు నచ్చలేదు. ఒక విమర్శ వ్రాసి, "స్వేచ్ఛ - ఆవశ్యకత; సుఖదుఃఖములు" అనే శీర్షికతో నా స్నేహితుడు రాల్ఫ్‌కు అంకితమిస్తూ అచ్చువేశాను. నా కరపత్రం మిస్టర్

పామక్ కంటె బడింది. అందులోని అంశాలు చాలా అసహ్యకరంగా ఉన్నాయంటూ అతడు గ్రహించినప్పటికీ నన్ను కొంత తెలివి తేటలుగల యువకునిగా గుర్తించాడు. ఈ కరపత్రం ప్రకటించటం నేను చేసిన మరొకపొరపాటు.

నేను లిటిల్ బ్రిటన్‌లో బసచేస్తున్నాను. మా బస నానుకొనే ఒక పుస్తకాలషాపుంది. దాని యజమాని విల్ కాక్సుతో నాకుపరిచయమైంది. అతనిదగ్గర అసంఖ్యాకంగా పుస్తకాలున్నాయి. ఏ షరతులో నాకిప్పుడు జ్ఞప్తికి రావటం లేదు గాని కొన్నిషరతులమీద ఆయన నాకు కావలసిన పుస్తకాలు చదువుకుంటానికి యివ్వటానికి అంగీకరించాడు. ఈ అవకాశం నాకు చాలా ఉపయోగపడింది.

నేను ప్రకటించిన కరపత్రం, లైన్స్ అనే సర్జన్ చేతిలో పడింది. ఆయన 'ది ఇన్‌ఫాలిబులిటీ ఆఫ్ హ్యూమన్ జడ్జిమెంట్' అనే గ్రంథాన్ని రచించాడు. దాని ఫలితంగా మా యిద్దరికీ పరిచయం ఏర్పడింది. తరచు తన యింటికి నన్ను ఆహ్వానించేవాడు. మేం అనేకవిషయాలపై చర్చలు జరుపుకునేవాళ్ళం. ఆ తర్వాత 'ఫేబిల్ ఆఫ్ ది బీస్' రచయిత డాక్టర్ మ్యాండ్ విల్లీకి నన్ను పరిచయంచేశాడు. అతడు ఒక క్లబ్ స్థాపించాడు. దాని కతడే జీవం. ఉత్సాహాన్ని కలిగించే స్నేహితుడు. బాట్సన్ కాఫీహౌస్‌లో డాక్టర్ టింబర్‌టన్‌కు కూడా నన్ను లైన్స్ పరిచయం చేశాడు. సర్ ఇసాక్ న్యూటన్‌కు వీలుదొరికినప్పుడు నన్ను పరిచయం చేస్తానని డాక్టర్ టింబర్‌టన్ వాగ్దానంచేశాడు. ఆ అవకాశం కోసం నేను ఉత్కంఠతో ఎదురుచూస్తు

న్నాను. కాని అది వాగ్దానంగానే ఉండిపోయింది. నాతో పాటు కొన్ని చిత్రమైన వస్తువుల్ని నేను లండన్ తీసుక వచ్చాను. నిప్పులో వేసినా కాలని ఫస్సు అందులో ఒకటి. సర్ హాన్స్ స్లోనికి అలాటి వస్తువులంటే చాలా మోజు కావటం చేత, నా దగ్గరకొచ్చి నా యాజ్ బెస్టాస్ ఫస్సు యిమ్మని అడిగాడు. నేను యిచ్చాను. దానికి పుష్కలంగా నాకు ప్రతిఫలం ముట్టింది.

మేం బసచేస్తున్నయింటిలోనే ఒక స్త్రీ నివసిస్తున్నది. ఆమె దొరసానులకు టోపీలు కుట్టి జీవిస్తున్నది. బహుశా క్లాయిస్టర్సులో ఆమెకు ఒక కొట్టు ఉండి ఉండవచ్చు. ఎప్పుడూ హుషారుగా మాట్లాడుతూ నవ్వుతూ ప్రేలుతూ ఉండేది. రాల్ఫ్‌కు ఆమెతో పరిచయం ఏర్పడింది. సాయం సమయాల్లో నాటకాలూ అవీ ఆమెకు చదివి వినిపిస్తూ ఉండే వాడు. వారు క్రమంగా ఆత్మీయులయారు. మరొక బస తీసుకుని యిద్దరూ అక్కడకు వెళ్ళిపోయారు. అక్కడ యిద్దరూ కలిసి కొంతకాలం ఉన్నారు. కాని ఆర్థికమైన యిబ్బందులు వారిని చుట్టుముట్టాయి. రాల్ఫ్‌కు సంపాదన లేదు ఆమెకు ఒక పాపకూడా ఉంది. ఆమె స్వల్పాదా యంతో – సంసారం సాగటంలేదు. లండన్‌నుంచి వెళ్ళిపోయి ఎక్కడన్నా పల్లెప్రాంతలో స్కూలుమాస్టరీ ఉద్యోగం సంపాదించాలని నిర్ణయించుకున్నాడు. అందుకు కావలసిన అర్హత తనకుఉందని అతనికి తెలుసు. మంచి వ్రాయసకాడు లెఖ్కల్లో పరిపూర్ణమైన ప్రజ్ఞ ఉన్నవాడు. కాని ఆ వృత్తి తనవంటివాడు చేయుదగిందిగా అతనికి కనిపించలేదు. కాని

అప్పటి కంతకంటె గత్యంతరం లేదు. భవిష్యత్‌లో తాను గొప్పవాడయాక, కావాలనుకుంటే పేరు మార్చుకోవాలనుకున్నాడు. ఒకానొకప్పుడు తా నింత నీచమైనఉద్యోగం చేసినట్లు ఎవరికీ తెలియకూడదు. ఏమైతేనేం రాల్ఫ్ లండన్ వదిలి బెర్క్‌షైరులోని ఒక చిన్న గ్రామానికి ప్రయాణం కట్టాడు. వారానికి ఆరు పెన్నీల స్వల్పజీతానికి, అక్కడ పదిమంది పిల్లలకు పాఠాలు చెప్పుకుంటూ జీవిస్తున్నాడు. అక్కడకు జేరగానే నా కొక లేఖ వ్రాశాడు. అందులో – తాను దూరంగా ఉండటంచేత 'మిస్ టి......' పరిరక్షణా భారాన్ని స్వీకరించమంటూ నాకు సిఫార్సు చేశాడు. ఆ తర్వాతకూడా తరుచుగా నాకు వ్రాస్తుండేవాడు. తా నొక గొప్ప ఐతిహాసిక కావ్యం వ్రాస్తున్నాడట! అందులోని ఆణిముత్యాల్లాంటి భాగాల్ని కొన్ని నాకు మచ్చు కని పంపించి, నా అభిప్రాయం అర్థించాడు. నేను చదివాను. అలాటి ప్రయత్నాలు మానుకొమ్మని రాల్ఫ్‌కు సలహాయిచ్చాను. కాని అతడిప్రయత్నాన్ని నేను విరమింపచెయ్యలేకపోయాను. అంతలో యంగ్ వ్రాసిన ఒక వ్యంగ్యరచన నా కళ్ళల్లో పడింది. సారస్వతాన్ని జీవితలక్ష్యంగా నమ్ముకుని, ఆరాధిస్తూ దానివల్ల ఏదో సాధించివేయగలమనే నమ్మకంతో కలలు కనేవారికి, చివరకు కలిగే దారుణ ఆశాభంగాలను, ఆ రచన నిరూపిస్తోంది. దాన్ని నేను రాల్ఫ్‌కు పంపాను. కాని నా శ్రమ వృథాఅయింది. నిత్యం టపాలో దస్త్రాలకొద్దీ, కవిత్వం దిగుమతి ఔతూనేఉంది. ఇది ఇలాఉండగా, 'మిస్ టి...' పరిస్థితి బాగా దిగజారిపోయింది. ఆమె వ్యాపారం నీరసించింది. తరచుగా నాకోసం కబుర్లుపెడ్తూ తృణమో...

ఘణమో అప్పుతీసుకుంటూ ఉండేది. ఆమెమీద నాకు మోజుకలిగింది. తదితర నైతికబంధా లేమీ అడ్డంరాలేదు. ఆ స్థితిలో నా అవసరం ఆమెకు చాలా ఉంది. ఈ అవకాశాన్ని ఆధారంగా, ఆమెకు దగ్గర కావటానికి ప్రయత్నించాను. కాని ఆమె తోకత్రొక్కిన త్రాచులా ఎదురుతిరిగి, రాల్ఫ్‌కు ఈ సమాచారమంతా వ్రాసింది. ఈ సంఘటనతో మా యిద్దరిమధ్యనూ అధిగమించ సాధ్యంగాని అగాధం ఏర్పడింది. అతడు నాకు చాలా డబ్బు బాకీపడ్డాడు. ఆ తర్వాత లండన్ వచ్చాడు. కాని నా డబ్బుమాత్రం చెల్లించ లేదు. చెల్లించే స్థితిలో లేడు. అంతే! రాల్ఫ్‌తో స్నేహం విచ్ఛిన్నంకావటం – ఒక విధంగా నాకు బరువు దించుకున్నట్లయింది.

ఇప్పుడు నేను ఆలోచిస్తున్న విషయం ఒక్కటే. ఎక్కువ డబ్బు సంపాదించాలి. అంచేతనే, పామర్స్‌ను వదిలి లింకన్స్ ఇన్‌ఫీల్డులోగల వాట్స్ అనే మరొక పెద్ద ప్రెస్‌లో ప్రవేశించాను. నేను లండన్‌లో వున్నంతకాలం అక్కడే వున్నాను. అమెరికాలో వుండగా శారీరక పరిశ్రమ నాకు కొంత అలవాటయింది. నా ఆరోగ్యం కాపాడుకుంటానికి అది అవసరమని గ్రహించి, వాట్స్‌లో జేరగానే పని ప్రారంభించాను. నాతోపాటు మరో యాభైమంది అక్కడ పని చేస్తున్నారు. వారంతా విపరీతంగా బీరు త్రాగుతారు. నేను మంచినీరు మాత్రం త్రాగేవాణ్ణి. వాళ్ళు రెండు చేతులూ కలిపినా మోయలేని బరువులను, నేను ఒక్కచేత్తో సునాయాసంగా మోసుకుని వెళ్ళేవాణ్ణి. అదిచూసి అందరూ

ఆశ్చర్యపోయి నాకు 'వాటర్ అమెరికన్' అని నామకరణం చేశారు.

ప్రెస్ కార్మికుల్ని సప్లయి చేసే ఒక ఆసామీ ఉండే వాడు. అతడు భోంచేసేముందు ఒక పింట్-భోజనంతో ఒక పింట్-భోజనం అయాక ఒక పింట్ - సాయింత్రం ఆరుగంట లకు ఒక పింట్ - రాత్రి పడుకోబోయేముందు ఒక పింట్- ఇలా త్రాగుతూనే ఉండేవాడు. ఈ దురలవాటు అక్కడ బాగా వ్యాపించింది. ఎంత ఎక్కువ త్రాగితే అంత బాగా పని చెయ్యగలమని వారి అంచనా. అంత ఖరీదైన ఒక పింట్ బీరులోకంటె - ఒక పెన్నీ ఖరీదుచేసే ఒక రొట్టె తిని గుక్కెడు నీళ్ళు త్రాగితే ఎక్కువ శక్తి వస్తుందని చెప్పి- వాళ్ళను నమ్మించటానికి ప్రయత్నించేవాణ్ణి. అలా త్రాగి త్రాగి శనివారం అయేసరికి నాలుగైదు షిల్లింగులు బాకీ పడేవారు. అంచేత వాళ్ళు శాశ్వతంగా దైన్యాన్ని అనుభ విస్తూనే వుంటారు. నా కలాటి బాదరబందీ లేకపోవటంచేత చాలా పొదుపు చేయగలిగేవాణ్ని. అంచేత నన్ను తక్కిన వారంధరూ అంటరానివానిగా భావించి వెలివేశారు. నేను కూర్చిన అక్షరాలను కలిపివెయ్యటం - పేజీలు తారుమారు చేయటం - ఇలాంటి పనులు చేస్తూ నన్ను ఏడిపించటానికి ప్రయత్నించేవారు. నేను ఒక్క నిమిషం గదిలోంచి ఏమరితే చాలు, చేసిన పనంతా నానా పాడుచేసి, ఏమీ ఎరగనట్టు వెళ్ళిపోయేవారు. దాని నష్టం నేను భరించవలసి వచ్చేది. రోజూ కలిసి పని చేయవలసిన తోటి కార్మికులతో విరోధం పెంచుకుంటంవల్ల ప్రయోజనం లేదని గ్రహించాను. ఘోర

పాటు సరిదిద్దుకున్నాను. క్రమంగా, అందరినీ మంచి చేసుకో గలగటమేగాక - కొంత పలుకుబడి కూడా సంపాదించాను. ప్రెస్ పనిలో కొన్ని ఉపయోగకరమైన మార్పులు సూచించాను. అది అందరూ ఆమోదించారు కూడా !

ఆ విధంగా రోజులు బాగానే గడుస్తున్నాయి.

లిటిల్ బ్రిటన్‌లో నా బస దూరమై పోవటంచేత డ్యూక్ వీధిలో రోమిష్ చర్చికి ఎదురుగా మరొక బస ఏర్పాటు చేసుకున్నాను. ఆ బస ఒక విధవ స్త్రీది. ఒక కూతురు, పనిమనిషి, యింకా ఆ యింట్లో ఉండే వ్యక్తులు. నేను యిదివరకు అద్దెకుండి వచ్చిన యింటి యజమానులను, నా ప్రవర్తనలు ఎటువంటివో-అడిగి తెలుసుకున్న తరువాత కాని, నా కిల్లు యివ్వటానికి ఆమె సాహసించలేదు. వారానికి మూడు షిల్లింగుల ఆరుపెన్నీలు. బాగా తక్కువ అద్దె. ఆ మాట ఆమే అంది. మొగమనిషంటూ ఒకడు యింట్లో ఉంటే కొంత రక్షణగా ఉంటుందనే ఆశతో - నన్ను ఆహ్వానించింది. ఆమె ప్రొటెస్టెంట్ మతానికి చెందిన కుటుంబంలో జన్మించింది. కాని వివాహ మయ్యాక భర్తతో పాటు కాథలిక్ మతాన్ని స్వీకరించింది. అనవరతం, భర్తను తలుచుకుంటూ, ఉంటుంది. రెండవ చార్లెస్ నాటినుంచి, అనేక కథలూ, సమాచారాలు, ఆమె ప్రత్యక్షంగా చూసినట్టే వర్ణిస్తూ ఉంటుంది. ఆవిడ కాలు కొంచెం అవిటిది. అంచేత సాధారణంగా గదిలోంచి బయటకురాదు. నేనంటే ఆమెకు మంచి అభిప్రాయం ఏర్పడింది. సాయంసమయాల్లో తరచుగా నన్ను పిలిపించేది. పిచ్చాపాటి మాట్లాడుకునే

వాళ్ళం. ఎన్నడూ ఏ విషయంలోనూ, ఆమెకు బాధ కలిగించే విధంగా ప్రవర్తించలేదు. అందుచేత నన్ను ఒదిలిపెట్టటం ఆమెకు యిష్టంగా ఉండేదికాదు. నేను పని చేసేచోటికి చాలా దగ్గరగా రెండు షిల్లింగుల అద్దెకు ఒక బసదొరికింది. అక్కడకు వెళ్ళిపోదామని నేను అనుకున్నాను. కాని ఆమె అందుకు అంగీకరించక, అద్దె తగ్గించి, తన యింట్లోనే ఉండమని బతిమిలాడింది. ఆ తర్వాత ఒక షిల్లింగ్ ఆరుపెన్నీలు అద్దెమాత్రమే చెల్లిస్తూ లండన్‌లో ఉన్నన్నాళ్ళూ అక్కడే ఉన్నాను.

ఆ యింటి ఆవరణలోనే ఒకపంచలో ఒక వృద్ధురాలు నివసిస్తున్నది. ప్రపంచంతో తనకేమీ సంబంధం లేనట్టు జీవించేది. ఆ నిర్లిప్తతా భావంచూస్తే నాకు ఆశ్చర్యం వేసింది. ఆమె కథ ఏమిటో తెలుసుకోవాలనే ఉత్కంఠ నాకు కలిగింది. మాయింటి యజమానురాలిని అడిగాను. ఆమె చెప్పింది.

ఆ కథ ఇది

ఆవిడ రోమన్ కాథలిక్ మతస్థురాలు. క్రైస్తవమత ప్రచారానికి చిన్ననాడే విదేశాలకు పంపబడింది. కాని ఆ దేశప్రభుత్వం అందుకు అభ్యంతరం చెప్పటంజేత-ఆమె యింగ్లండు తిరిగి రావలసి వచ్చింది ఆమె సన్యాసినిగా జీవించటానికి నిర్ణయించుకుంది. కాని ఇంగ్లండులో అటువంటి స్త్రీ సన్యాసులమఠం లేదు. ఆ పరిస్థితుల్లో సాధ్యమైనంత వరకూ - తనప్రతిజ్ఞ పాలించాలని నిర్ణయించుకుంది. ఆమె చాలా శ్రీమంతురాలు. ఎంతో ఆస్తి ఉంది. కాని

జీవించటానికి అవుసరమైన కొద్దిఆస్తిని మాత్రం ఉంచుకుని తక్కినదంతా దానధర్మాలకు ఖర్చుచేసింది. మిగుల్చుకున్న ఆస్తిమీద సాలీనా పన్నెండుపౌనులు మాత్రం ఆదాయం వచ్చేది. అందులోకూడా అధికభాగాన్ని బీదసాదలకూ, దానధర్మాలకూ వెచ్చించేది. అతిచౌక అయిన అపక్వాహారం భుజించేది అలా ఆ పంచలో ఒకరిప్రశక్తి రాకుండా చాలా సంవత్సరాలుగా ఉంటూంది. ఆమె అక్కడ ఉండటానికి ఎవరూ ఎన్నడూ అభ్యంతరం చెప్పలేదు. పైపెచ్చు ఆమె సమక్షంలో ఉండటం వల్ల తమకెంతో పుణ్యమని భావించేవారు. ఆమెను చూడాలనిపించింది. ఒకసారి వెళ్లాను. మందహాస వదనంతో మర్యాదగా ఆహ్వానించింది. గదిలో పెద్దసామాను లేదు. చాలా శుభ్రంగా కడిగిన ముత్యంలా ఉంది. కూర్చుంటానికి ఒకస్టూలు వేసింది. దానిమీద కూర్చుని, గది నాలుగుమూలలూ పరికించిచూశాను. గోడ మీద సెయింట్ వెరోనికా చిత్రపటం ఒకటి కనిపించింది. అందులో రుధిరసిక్తమైన ఏసుదేవుని తేజస్వరూపం ప్రతిబింబిస్తూంది. ఆమె దాన్నిగురించిన కథంతా గంభీరమైన కంఠస్వరంతో చెప్పింది. ఆమె వదనం కొంచెం పాలిపోయినట్టు కన్పించినా ఆమె పరిపూర్ణమైన ఆరోగ్యాన్ని అనుభవిస్తున్నది.

అతి స్వల్పమైన ఆదాయంతో ఆరోగ్యకరమైన జీవితం నిశ్చయంగా గడపవచ్చు. ఆ విషయం నిరూపించటానికే నే నీ కథ చెప్పాను.

వాట్స్ ప్రెస్‌లో వైగేట్ అనే మేధాసంపన్నుడైన ఒక యువకుని నేను కల్సుకున్నాను. అతను బాగా చదువు కున్నవాడు. శ్రీమంతులైన బంధువులున్నవాడు. సాహిత్యా నికి జీవితంలో కొంత విలువ యివ్వాలని నమ్మినవాడు. అతనికి నేను ఈత నేర్పాను. అతని స్నేహితునకు కూడా నేర్పాను. ఆ సందర్భంలో చెల్సీ నుంచి బ్లాక్ ఫ్రెయిర్ దాకా, రకరకాల సాములు చేస్తూ ఈదుకుంటూ వచ్చాను. ఈత నాకు చిన్ననాటినుంచీ యిష్టమైన క్రీడ. థావెనాట్స్ పద్ధతులు కొన్ని నేర్చుకున్నాను. స్వానుభవంతో కొన్ని చేర్చాను. మంచి ఈతకాణ్ణయి, ఆ అవకాశం వినియోగించుకుని, నా ప్రతిభ అంతా ప్రదర్శించాను. చూసినవారంతా ఆశ్చర్యానందాలతో మునిగి పోయారు. ఈ సంఘటనతో వైగేట్ నా కింకా స్నేహితుడయ్యాడు. ఏదో వ్యాపారం చేసుకుంటూ యూరప్ అంతా పర్యటిద్దామని అత డొక సూచన చేశాడు. నేను కూడా అందుకు మొగ్గు చూపాను. కాని మిస్టర్ డెన్‌హామ్ ఈ విషయం విని, నన్ను చాలా నిరుత్సాహపరిచాడు. సాధ్యమైనంత త్వరగా పెన్సిల్వేనియా జేరమని సలహాయిచ్చాడు.

మిస్టర్ డెన్‌హామ్ ప్రత్యేక వ్యక్తిత్వంగల మనిషి. మొదట బ్రిస్టల్‌లో వ్యాపారం ప్రారంభించాడు. కాని అప్పులపాలై అమెరికా చేరుకున్నాడు. అక్కడ మరొక వ్యాపారం ప్రారంభించాడు. దశ తిరిగింది. లక్షలు గడించాడు. నాతోపాటు ఓడలో లండన్ వచ్చాడు. ఇప్పుడు మళ్ళీ ఫిలడల్ఫియా వెళ్ళిపోతున్నాడు. తనకు ఉత్తరాలూ, లెఖ్ఖలూ వ్రాయటానికీ, వ్యాపారంలో సాయంచేయటానికీ

నన్ను తనదగ్గర గుమాస్తాగా చేరమని ఆహ్వానించాడు. సముద్రవ్యాపారంలో కొంత అనుభవం వచ్చాక, కొంత వ్యాపారం నాచేత స్వయంగా చేయిస్తాననీ, అది నేను బాగా నిర్వహిస్తే మంచి ప్రతిఫలం ముట్టచెప్తాననీ, వాగ్దానం చేశాడు. నేను వెంటనే దాన్ని అంగీకరించాను. పెన్సిల్వేనియాలో నా గత జీవితం తల్చుకున్న కొద్దీ—నాకు లండన్‌పై విరక్తి కల్గుతూంది. మిష్టర్ డెన్‌హామ్ నాకు సాలీనా యాభై పౌన్ల జీతం ఏర్పాటుచేశాడు. ఇది నే నప్పుడు సంపాదిస్తున్న జీతంకంటే తక్కువే. అయినా ముందుముందు పైకి వచ్చే అవకాశాలను ఆలోచించి, కొత్త ఉద్యోగంలో చేరాను.

మిష్టర్ డెన్‌హామ్‌తో కలిసి వర్తకులమధ్య తిరుగుతూ, సరుకులు కొంటూ - బంగీలుగా కట్టిస్తూ - వాటిని రేవుకు జేర్పిస్తూ - కొద్దిరోజులు గడిపాను. ఆ తర్వాత కొద్దిరోజులు విశ్రాంతి లభించింది. ఒకరోజున సర్ విలియం వైంథామ్ అనే వ్యక్తి నాకు కబురుపెట్టాడు. ఆయన చాలా పేరు ప్రఖ్యాతులు గలవాడు. నేనంతకు ముందే ఆయన పేరు విన్నాను. అంతటివ్యక్తి నాకు కబురుపెట్టటంవిని మొదట ఆశ్చర్యపోయాను. అసలు విషయం ఇది. నేను చెల్సీనుండి బ్లాక్‌ఫెయిర్ వరకూ, గొప్ప ఫీట్సుచేస్తూ ఈదుకొని వచ్చినట్టు ఆయనకెలాగో తెల్సింది. అతని కిద్దరు కుమారులున్నారు. వారు సముద్రయానం చెయ్యబోతున్నారు. ఆ ప్రయాణానికి ముందే - వారికి నా దగ్గర ఈత నేర్పించాలని ఆయన సంకల్పం. అందుకే నన్ను ఆహ్వానించాడు. నేను ఆ

ఆహ్వానాన్ని అంగీకరించలేకపోయాను. త్వరలో లండన్ వదిలిపోవాల్సి వచ్చిందాయెను! కాని నాకొక ఊహ వచ్చింది. లండన్‌లోనే ఉండి స్విమ్మింగ్ స్కూలు పెడితే బోలెడు డబ్బు చేసుకోవచ్చేమో - అని. ఈ సర్ విలియం వైంధామ్ కొడుకే చాలా చాలా రోజులు పోయాక - ఎరల్ ఆఫ్ ఎగ్రిమోంట్‌గా ప్రసిద్ధుడయ్యాడు. ముందు ముందు ఆయన్ను గురించి వింటాం.

అలా లండన్‌లో పద్ధెనిమిది నెలలున్నాను. వ్యాపారపు పనులయ్యాక, నాటకాలు చూస్తూ, పుస్తకాలు చదువుకుంటూ కాలక్షేపం చేశాను. నా మిత్రుడు రాల్ఫ్ నాకు బాకీపడిన పైకం యిస్తాడనే ఆశ ఏనాడో అంతరించింది. అతడు నాకు ఇరవైఏడు పౌనులు యివ్వాలి. నా చిన్న సంపాదనకది పెద్దమొత్తమే. న్యాయానికి అతనంటే నాకు చాలా గౌరవం ఉంది. అతనివల్ల నాకు పెద్ద అదృష్టమేమీ కలుగకపోయినా — అతని సాహచర్యమూ సంభాషణా నాకు కొంత ఉపయోగించినమాట నిజం. 1726 జూలై 23 వ తేదీన - గ్రేవ్‌సెండ్‌లో మేం ఓడకు తెరచాపనెత్తాం. ఆ ప్రయాణంలో చిన్నచిన్న సంఘటనలు చాలా జరిగాయి. ఆ వివరాలన్నీ నాజర్నల్‌లో వ్రాశాను. అన్నిటికంటె ముఖ్యమైన విషయం - ఆ ప్రయాణంలో నేను తయారుచేసిన ఒక పథకం భవిష్యత్ జీవితంలో నా ప్రవర్తనను సరిదిద్దటానికి అది చాలా ఉపయోగపడింది.

అక్టోబరు 11 వ తేదీన మేం ఫిలడల్ఫియా చేరుకున్నాం. అక్కడిపరిస్థితుల్లో కొన్నిమార్పులు కనిపించాయి.

గవర్నర్ కీత్ ఇప్పుడు ఉత్త కీత్ అయాడు. మేజర్ గార్డన్ అతణ్ణి పదవిలోంచి తొలిగించివేశాడు. ఇప్పుడు కేవలం సాదావ్యక్తిగా వీధులవెంట తిరగటం నే చూశాను. నన్నుచూసి, సిగ్గుపడి, తలవంచుకుని వెళ్ళి పోయాడు. మరో ముఖ్యమైన మార్పు జరిగింది. మిస్ రీడ్ తన స్నేహితురాండ్ర బోధనలు విని-రోజర్ అనేవ్యక్తిని పెళ్ళి చేసుకుంది. అతనికి అంతకుముందే ఒకభార్య ఉంది. అంచేత అతనితో రమించటానికి ఆమె అంగీకరించలేదు. రోజర్ మంచిపనివాడే. కానీ వివేకశూన్యుడు. చివరకు అప్పులపాలై 1726 - 27 ప్రాంతంలో వెస్టిండీస్‌కు పారి పోయాడు. ఆ తర్వాత అక్కడే మట్టిలో కలిసి పోయాడు.

కైమర్ ప్రెస్‌ను బాగా వృద్ధిచేశాడు. సరికొత్త సాధనసామాగ్రి చాలా తెప్పించాడు. ఎక్కువమంది పని వాళ్ళను పెట్టాడు. వ్యాపారం బాగా జోరుగా సాగుతున్నట్టు కనిపించింది.

వాటర్స్ వీధిలో డెన్‌హామ్ ఒకకొట్టు అద్దెకు తీసు కున్నాడు. అక్కడే మా సరుకులన్నీదించి వ్యాపారం ప్రారం భించాం. అనతికాలంలోనే వ్యాపారంలోని లోతుపాతులు గ్రహించి నిపుణత సాధించాను. డెన్‌హామ్ నన్ను పితృ భావంతో చూసేవాడు. ఆయనపైగూడా నాకు భక్తిగౌర వాలుండేవి. రోజులు హాయిగా గడిచిపోతున్నాయి. ఆ పరి స్థితి చాలాకాలం సాగవలసిందే కాని - 1726 ఫిబ్రవరి నెలా రంభంలో ఇద్దరికీ జబ్బుచేసింది. నేను ప్లూరసీతో ఛాలా

బాధ పడ్డాను. తిరిగి కోలుకునేసరికి చాలా కష్టమైంది. జెన్ హామ్ వ్యాధిమాత్రం ముదిరి ముదిరి అతని ప్రాణాలు తీసింది.

దాంతో నా ఉద్యోగం ఊడిపోయింది. ఇప్పుడు ఫిలడల్ఫియాలోనే మకాం చేసిఉన్న నా బావమరిది హామ్ను మళ్ళీ ప్రెస్‌లో జేరమని నాకు సలహా యిచ్చాడు. ఎక్కువ జీతం యిస్తానంటూ కైమర్ ఆశకూడా పెట్టాడు. తన ప్రెస్ వ్యాపారమంతానిర్వహించమంటూ నన్ను ఆహ్వానించాడు. లండన్‌లో అతని భార్యవల్లనూ, యింకా కొందరు స్నేహితుల వల్లను, అతని దుష్ప్రవర్తన ఎలాంటిదో వినిఉండటం చేత, మళ్ళీఅతనిదగ్గర పనిచెయ్యటానికి, నా మనస్సు అంగీకరించలేదు. మళ్ళీ ఎవరో ఒకవర్తకుని దగ్గరే ఉద్యోగం చేయాలను కున్నాను. కాని అందుకు కావలసిన ప్రయత్నాలు మాత్రం చేయలేదు.

మళ్ళీ కైమర్ దగ్గరే జేరాను. ఆ ప్రెస్‌లో పని చేస్తున్న వ్యక్తుల్లో హూంగ్ మెరిడిత్ ఒకడు. అతనివయస్సు ముప్ఫై సంవత్సరాలుంటుంది. మంచి పరిశీలనాశక్తి, తెలివితేటలూ కలవాడు. కాని త్రాగుడుకు బానిసైపోయాడు. రెండోవ్యక్తి పేరు స్టెఫెన్‌పాట్స్. బాగా పెద్దవాడు. మొదటినుంచీ అదేవృత్తిలో జీవించినవాడు. చమత్కారంగా మాట్లాడే ప్రజ్ఞగలవాడు. పనివాడే గాని బద్ధకస్తుడు. వీళ్ళందరినీ చాలా తక్కువ జీతాలకే కుదుర్చుకున్నాడు. కైమర్. వారుగనుక పనిలో అభివృద్ధినిసాధిస్తే, ప్రతి మూడు నెల్లకూ ఒక షిల్లింగ్ చొప్పున జీతం వృద్ధిచేస్తానంటూ వాగ్దానం చేశాడుట. ఆ ఆశతోనే వారు అంతతక్కువ జీతంతో పని

చెయ్యటానికి అంగీకరించాను. మెరిడిత్ ప్రెస్‌లో పనిచేసే వాడు. పాట్స్ పుస్తకాలు బైండుచేసేవాడు. తక్కిన వారికి పని నేర్పటంకూడా పాట్స్ చెయ్యవలసిన విధి. కాని అతనికి పని వచ్చా రాదా అనేది అనుమానం. జాన్ ఒక ఓడలో పనిచేసేవాడు. నాలుగేళ్ళపాటు పనిచెయ్యటానికి అతన్ని తీసుకొచ్చాడు క్రైమర్. జార్జివెబ్ అనే ఆక్స్‌ఫర్డ్ పండితుడు కూడా ఒకడు ప్రెస్‌లో పనిచేస్తున్నాడు. డేవిడ్ హారీ అనే ఒక పల్లెటూరి కుర్రాడు పని నేర్చుకుంటూ ఉంటున్నాడు.

క్రైమర్ నాకు అంత ఎక్కువజీతంలో ఉద్యోగం యివ్వటానికి ఒక కారణం ఉంది. పని ఏమాత్రం చేతకాని వీళ్ళందరినీ నాదగ్గర తర్ఫీదు చేయించా లనుకున్నాడు. వాళ్ళందరూ బాగా తయారైనాక, క్రైమర్‌కు యింకనాతో అవుసరం ఉండదు. అయినా నేను సంకోచించకుండా, సంతో షంతో ఉద్యోగంలో జేరాను. చెల్లాచెదురై ఉన్న ప్రెస్ వ్యవహారాలన్నీ ఒక క్రమంలో పెట్టాను. పనివాళ్ళందరికీ-తర్ఫీదు యిస్తూ, మెరుగుపరిచాను. అందరిలో ముఖ్యంగా ఆక్స్‌ఫర్డ్ పండితుణ్ని చూస్తే నాకు జాలివేసేది. అంత పెద్ద చదువు చదివి చివరికీ కూలి పని చేస్తున్నాడు. అతనికి పద్ధెనిమిది సంవత్సరాలకంటె ఎక్కువ వయస్సు ఉండదు. ఒకరోజున అతనికథంతా విన్నాను.

అది ఇది:

అతడు గ్లవ్‌సెస్టర్‌లో జన్మించాడు. అక్కడే గ్రామర్ స్కూల్లో ప్రాథమికవిద్య అభ్యసించాడు. అక్కడ చాలా అభివృద్ధి సాధించేడు. నాటకప్రదర్శనాల్లో పాల్గొన్నాడు,

విట్రీక్లబ్‌లో జేరాడు. గద్యంలోనూ, పద్యంలోనూ కొన్ని రచనలు చేశాడు. అందులో చాలా గ్లవ్‌సెస్టర్‌లోని పత్రికల్లో ప్రకటించబడినయ్. ఆ తర్వాత ఉన్నత విద్యాభ్యాసానికి ఆక్స్‌ఫర్డ్‌కు వెళ్ళాడు. అక్కడ ఒక సంవత్సరం ఉన్నాడు. కాని ఏదో అసంతృప్తి అతనిలో జనించింది. లండన్‌లోని విషయాలన్నీ చూశాడు. చివరకు ఆటగాడయ్యాడు. పదిహేను గినీల అలవెన్సు లభించింది. దాంతో లండన్‌లో అడుగుపెట్టాడు. వెంటనే చెడ్డస్నేహితులు కొందరు అతన్ని వల్లో వేసుకుని, ఆ కాస్తడబ్బూ కరిగించివేశారు. చివరికి రోజులు ఎలా గడవాలో తెలియని స్థితి వచ్చింది. ఆకలితో వీధులవెంట తిరిగాడు. ఏంచేయాలో, ఎక్కడకు వెళ్ళాలో అర్థంకాలేదు. అమెరికాలో తక్షణం ఉద్యోగాలు దొరుకుతాయంటూ క్రింప్ ప్రకటన చూశాడు. వెంటనే ఒడంబడికమీద సంతకంపెట్టి, ఓడనెక్కి అమెరికా వచ్చేశాడు. అతడు మంచిస్వభావం గలవాడు. చమత్కారంగా, సజీవంగా మాట్లాడుతాడు. కాని వల్లమాలిన అశ్రద్ధ మనిషి. ఆలోచన బొత్తిగా లేదు.

అందులో జాన్, అనతికాలంలోనే పారిపోయాడు. తక్కినవారితో నాకుచాలా బాగానే గడిచింది. అందరూ నన్ను గౌరవించేవారు. కైమర్‌కంటె, నేయిరెట్లు అధికంగా నాకు పనితెలుసునని వారు అర్థంచేసుకున్నారు. రోజూ వారికి పనినేర్పుతూనే ఉన్నాను. మేం శనివారాల్లో పని చేసేవాళ్ళం కాదు. అంచేత వారానికి రెండురోజులు నాకు చదువుకుంటానికి తీరిక లభించేది. నగరంలోని మేధావంతు

లనేకమందితో నాకు గల పరిచయం ఎక్కువౌతోంది. క్రైమర్ కూడా నన్ను ఎంతో గౌరవంగా – ఎంతో మర్యాదతో చూసేవాడు. ఇప్పుడు నాకు చాలాహాయిగా ఉంది. ఒక వెర్షన్ అప్పుమాత్రం చికాకు కలిగిస్తూంది. అతడు నన్నెన్నడూ బాధించలేదు. ఆర్థికంగా నా పరిస్థితిలో మెరుగు కనిపించక పోవటంచేత – అప్పటికి నేను ఆ బాకీని తీర్చలేకపోయాను.

మా ప్రెస్‌లో తగినంత సాధన సామాగ్రిలేదు. అదంతా అమెరికాలో దొరికేదికాదు. అంచేత కొంతవరకూ, తెలివితేట లుపయోగించి, కొన్ని లోటుపాట్లు సరిదిద్దాను. ఇంక తయారుచేయటం దగ్గరనుంచీ, సరుకులకొట్లు చూసుకోవటందాకా, సమస్తమైనపనులూ చేసిపెట్టేవాణ్ణి.

నేనెంత శ్రమించి పనిచేస్తున్నా, నా ప్రాముఖ్యత అక్కడ రోజురోజుకూ సిరసించి పోతున్నదని తెలుసుకున్నాను. అందరూ పనిపాటలు బాగా తెలుసుకుని, నిపుణత సాధించారు. నాకు రెండోసారి జీతం చెల్లించాల్సి వచ్చినప్పుడు – క్రైమర్ చాలా పెద్దమొత్తం, తన శక్తికి మించింది యిస్తున్నట్టు గొణగటం ప్రారంభించాడు. నన్ను జీతం తగ్గించుకొమ్మని సూచించాడు. నాపై అంతవరకూ చూపిస్తున్న గౌరవ మర్యాదలను క్రమంగా తగ్గించివేస్తున్నాడు. తరచుగా ఏదో చిన్నతప్పులు వెతికి పట్టుకుంటూ– అధికారస్వరంతో కఠినంగా మందలిస్తూ ఉన్నాడు. ఏ క్షణంలోనైనా దారం తెగిపోయేటట్టు కనిపించింది. కాని నేనుచాలా ఓపిగ్గా రోజులు నెట్టుకొస్తున్నాను. అతని పరి

స్థితులే అతని ప్రవర్తనకు కారణమనుకున్నాను. చివరకు మా బంధం తెంచివేసే సంఘటన ఒకటి జరిగింది.

ఒకరోజున వీధిలో ఏదో గల్లంతు వినిపిస్తూంది. ఏమిటో అనే ఉత్కంఠతో నేను కిటికీలోంచి తొంగి చూశాను. అప్పుడు కైమర్ అక్కడే ఉన్నాడు. నేనుతొంగి చూడటం చూశాడు. ఆగ్రహావేశంతో పని చూసుకోక, ఎందుకలా తొంగిచూస్తూ కూర్చోవటమంటూ కేకలు పెట్టాడు. ఆ కేకలు అందరూ విన్నారు. అతను అన్నందు కంటె - అందరూ విన్నందుకే ఎక్కువ బాధపడ్డాను. అతడు ప్రెస్‌లోకి వచ్చాడు. వస్తూనే కేకలుపెట్టాడు. నేనూ ఊరుకోలేదు. ఘర్షణ తీవ్రంగానే జరిగింది. మూడు నెల్లలో నా ఉద్యోగం తీసివేస్తానంటూ నోటీసు యిచ్చాడు. అంత వరకూ అనవసరమని నేనప్పుడే బయటకునడిచాను. నడుస్తూ నడుస్తూ, నా సామానంతా ఆనక నా బసకు తెమ్మని, మెరిడిత్‌కు చెప్పాను. అలాగే ఆ సాయంకాలం మెరిడిత్ సామానంతా తెచ్చి నాకు ఒప్పగించాడు. నామీద ఎంతో గౌరవభావం వ్యక్తపరిచాడు. నేను వచ్చినా, కానక్కడే ఉండటం బాధగా ఉందన్నాడు. అయినా అంతకంటె ఏం చేయలేడు. నేను తిరిగి స్వగ్రామం వచ్చేద్దామనుకుంటున్నా. అలాటి ఆలోచన పెట్టుకోవద్దన్నాడు. కైమర్ అప్పులో మునిగిపోతున్నాడు. డబ్బుతొందర కొద్దీ లాభం లేకుండానే అవీ ఇవీ అమ్మేస్తున్నాడు. దేనికీ లెక్కా జమా ఉండటం లేదు. అంచేత అతడు దివాలా తీయవచ్చు - అందువల్ల

నాకు లాభం కలుగుతుంది-అని చెప్పాడు మెరిడిత్. నాకు డబ్బు కావాలంటే సర్దుతానన్నాడు. నేను వద్దన్నాను.

మెరిడిత్ మరోమాట చెప్పాడు. తన తండ్రికి నా మీద చాలా గొప్ప అభిప్రాయం ఉందట. తనతో కలసి జాయింట్ వ్యాపారం సాగించదల్చుకుంటే తనతండ్రి కావలసిన పెట్టుబడి పెట్టటాని కంగీకరిస్తాడుట.

మెరిడిత్ ఇంకా ఇలా అన్నాడు "వసంతకాలంలో క్రైమర్ దగ్గర నా ఉద్యోగం అయిపోతుంది. ఆ లోపల మనం లండన్‌నుంచి అచ్చుయంత్రాన్నీ సాధనసామాగ్రినీ తెచ్చుకోవచ్చు. నాకు తెలివితేటలున్నాయి కాని పనివాణ్ణి కాదు నీవు అంగీకరిస్తే నీ నిపుణత్వం, నా సాధన సంపత్తి కలిపి - మనం వ్యాపారం సాగించవచ్చు. లాభాలు చెరిసగం తీసుకుందాం."

ఈ ప్రతిపాదన అంగీకార యోగ్యంగానే ఉంది. అతని తండ్రికూడా ఇందుకు అంగీకరించాడు. ఆయన మరొకందుకు సంతోషించాడు. తనకొడుకు త్రాగుడుకు బానిసై పోతున్నాడని ఆయనకు తెలుసు. నావంటి స్నేహితుడు దొరికితే కొంత బాగుపడుతాడేమో - అని ఆయన ఆశ. కావలసిన సాధన సామాగ్రి జాబితా వ్రాసి యిచ్చాను. అవి లండన్‌నుంచి వచ్చేవరకూ - ఈ విషయాన్ని రహస్యంగా ఉంచాలని నిర్ణయించుకున్నాం. ఈలోగా దొరికితే మరో ప్రెస్‌లో ఉద్యోగం చేద్దామనుకున్నా. కాని నాకుఉద్యోగం దొరకలేదు. అంచేత కొన్నాళ్ళు ఖాళీగానే ఉండాల్సి వచ్చింది.

అంతలో కైమర్ నాకు మళ్ళీ తనదగ్గర పనిచెయ్య మంటూ ఒక ఆహ్వానం పంపాడు. దానికి ఒక కారణం ఉంది. న్యూజెర్సీలో కొంత కాగితపు కరెన్సీ అచ్చువేయటానికి ఆర్డరు లభించింది. కాని నా సహాయం లేకుండా కైమర్ ఆ పని చేయలేడు. ఆ పరిస్థితిలో వచ్చిన ఆర్డరు బ్రాడ్ ఫోర్డు చేతుల్లోకి పోయినా పోవచ్చు. అంచేత నిజమైన స్నేహితులు ఏదో చిన్నసంఘర్షణ జరిగినంత మాత్రంచేత విడిపోకూడదని, ఏదో తొందరపాటువల్ల అలాటి ప్రమాదం జరిగిందని వివరిస్తూ నన్ను తిరిగి రమ్మని ఆహ్వానించాడు. మెరిడిత్ ఆహ్వానం అంగీకరించమని నన్ను ఒత్తిడిచేశాడు. దానివల్ల తనుకూడా కొంత పని నేర్చుకోవచ్చునని అతని ఆశ. ఏమైతేనేం కైమర్ ఆహ్వానాన్ని నేను అంగీకరించాను. కొంత కాలం బాగానే జరిగిపోయింది. మేము బర్లింగ్టన్ పోయి సంతృప్తికరంగా పని నిర్వహించాం. దానివల్ల మునిగిపోతూన్న కైమర్‌ను ఒడ్డు చేర్చేటంత లాభం వచ్చింది.

బర్లింగ్టన్‌లో నేను అనేక రాష్ట్ర ప్రముఖుల్ని కలుసుకున్నాను. వారిలో చాలామంది అచ్చుపని జరిగేటప్పుడు పరీక్షించటంకోసం అస్సెంబ్లీచేత నియమించబడ్డ వారు. అంచేతవారు వంతులవారీగా ప్రెస్‌లో కూర్చునేవారు. వారు సాధారణంగా కొందరు స్నేహితులతో వచ్చేవారు. కైమర్‌కంటె నేను ఎక్కువ చదువుకున్నవాడినికావటంచేత వారు నన్నే ఎక్కువగా గౌరవించేవారు. వారు తమయిండ్లకు నన్ను ఆహ్వానించి అనేకమంది స్నేహితులకు పరిచయం

చేశారు. ఎంతో గౌరవించారు. కైమరు యజమానిలయి నప్పటికీ అతన్ని పూర్తిగా అశ్రద్ధచేశారు. నిజానికి కైమరు స్వరూపం అలాటిది. లౌకికజ్ఞానంలేక, మొరటుగా ఎదుటి వాళ్ళను ఖండించటం అతని కలవాటు. చాలా చీకాకుగా ఉంటాడు. మత సంబంధమైన విషయాల్లో పట్టుదల చూపె ట్టినా, శుచీ శుభ్రం తెలీదు.

అక్కడ మేం మూడు నెల్లున్నాం. ఆ కాలంలో రాష్ట్ర కార్యదర్శి అయిన శామ్యూల్ బస్టిల్, సర్వే జనరల్ అయిన ఈసాక్ డీకౌ, జడ్జి యలెన్, ఈసాక్ పియర్సన్, జోసెఫ్ కూపరు ప్రభృతులతో నాకు పరిచయమయింది. ఈసాక్ డీకౌ చాలా చురుకైనవాడు. కాయకష్టం చేస్తూ జీవితం ప్రారంభించాడుట. వయస్సు ముదిరాక చదువు సంధ్యలు మొదలెట్టి సర్వే నేర్చుకొని, నేటికి ఈ స్థితిలోకి రాగలిగాడు. ఇప్పుడు బోలెడుఆస్తి సంపాదించాడు. "నువ్వు త్వరలో ఫిలడల్ఫియాలో వ్యాపారం ప్రారంభించి బాగా వృద్ధిలోకి వస్తా" వంటూ జ్యోతిష్యం చెప్పాడు. నేను స్వయంగా వ్యాపారం ప్రారంభించబోతున్నాననే విషయం అప్పటి కతనికి ఆవంతకూడా తెలియదు. ఈ స్నేహితు లందరూ ముందు ముందు చాలా ఉపయోగపడ్డారు. జీవి తాంతంవరకు వారికి నాపైగల గౌరవాభిమానాలు చెక్కు చెదరలేదు.

నేను బహిరంగంగా స్వంత వ్యాపారం ప్రారంభించే ముందు, నైతికసిద్ధాంతాన్ని గురించి, నాకారోజుల్లో ఎలాంటి అభిప్రాయాలుండేవో చెప్తాను. నా భవిష్యత్ జీవి

తాన్ని రూపొందించటంలో వేటి ప్రభావం ఎంతవరకు ప్రస రించిందో నువ్వు చూడ్డువుగాని. మొట్టమొదటినుంచి నా తల్లిదండ్రులు పవిత్రమైన జీవితానికి నన్నలవాటు చేశారు. కాని నాకు పదిహేను సంవత్సరాలైనా రాకముందే మతాన్నిగురించి అనేక సందేహాలూ, సమస్యలూ నా పసి హృదయంలో రేకెత్తినయ్. అనేకపుస్తకాల్లో ఆవిషయాలు వివాదాస్పదంగా ఉల్లేఖించబడ్డాయి. 'డీ ఇజమ్' ను వ్యతి రేకించే కొన్నిపుస్తకాలు నాచేతిలో పడినయ్. బాయిల్ యొక్క ఉపన్యాసాలలోని సారాంశమంతా అందులో కని పించింది. అవి పాఠకులకు ఏ అభిప్రాయాన్ని కలిగించాల్నని ఉద్దేశింపబడ్డాయో, అందుకు పూర్తిగా వ్యతిరేకమైన అభి ప్రాయం నాకు కలిగింది. అందులో వ్యతిరేక విమర్శకులకు అనుకూలమైన డైయిస్టస్ సిద్ధాంతాల్ని కొన్నిటిని పొందు పరిచారు. వాటిపై చేయబడిన విమర్శలలోకంటె ఆసిద్ధాం తాలలోనే ఎక్కువ కటుత్వమున్నట్లు నాకు కనిపించింది. ఒక్కమాటలో నేను పదహారు అణాల డీయస్టుగా మారి పోయాను.

కాలిన్స్, రాల్ఫ్, కిత్ లు నా యెడల ప్రవర్తిం చిన విధానం, నేను వెర్నర్, మిస్ రీడ్ లయెడ ప్రవర్తించిన పద్ధతీ ఈ సిద్ధాంతం దృష్టిలో చాలాతప్పుగా కనిపించినయ్. ఈ విషయాలు ఆలోచించినప్పుడు నాకు చాలా కష్టంగా ఉంటుంది. ఈ సిద్ధాంతం యదార్థమైనదైతే కావచ్చు. కాని ఉపయోగకారి మాత్రం కాదు. నేను లండన్ లో ప్రకటించిన కరపత్రంలో, డ్రైడక్ యొక్క ఈ క్రింది మాట లున్నాయి.

"సృష్టిలో ఏదీ అసత్యం కాదు. అంతా సత్యం - దృష్టి మాంద్యం గల మానవుడు దగ్గరలో కనిపించే విషయాలనే చూడ గలడు - ఆ పైన గల అసలు సత్యాన్ని మాత్రం గ్రహించ లేడు.......... ..

అంతులేని విజ్ఞానసంపన్నుడని, మహాశక్తివంతుడని, భగవానున్నికి ఆపాదింపబడిన విశేషణాలను గుర్తుకుతెచ్చుకున్నప్పుడు; ప్రపంచంలో ఏదీ తప్పుఅనేది లేదనీ, మంచి చెడ్డల మధ్యగల తారతమ్యం కేవలం ఒక భ్రమమాత్రమే ననీ తెలుస్తుంది.

అప్పుడది చాలా తెలివైన ఆలోచన అని అనుకున్నాను. కాని ఇప్పుడది పొరపాటని తెలుసుకున్నాను. జీవితము సుఖప్రదంగా సాగటానికి-మనిషికి మనిషికీ మధ్య నమ్మకము, నైతికబంధమూ, సత్యవాక్కు అవసరమని నేనిప్పుడు నమ్ముతున్నాను. జీవితాంతం వరకూ, ఆచరించటానికి కొన్ని నిర్ణయాలను చేసుకొని వాటిని నా జర్నల్ బుక్కులో పొందుపరుచుకున్నాను. బైబిలుకు నే నెన్నడూ ఎక్కువ ప్రాముఖ్యత ఇయ్యలేదు. (ఆ పవిత్ర గ్రంథంలో నిషేధింపబడిన విషయములన్నీ చెడ్డవి కాకపోవచ్చు.) నిర్దేశింపబడిన విషయాలన్నీ మంచివి కాకపోవచ్చు. కాని కొన్ని నిషేధింపబడినా, కొన్ని నిర్దేశింపబడినా మానవ కళ్యాణాన్ని పరమావధిగా ఉంచుకొని మాత్రమే అది జరిగిన దనే అభిప్రాయం నాకేర్పడింది. ఈ అభిప్రాయంతో భగ

వంతుని దయతో లేదా కాకతాళీయంగా సంభవించిన అనేక అనుకూల పరిస్థితులతో, జీవితంలో అత్యంత ప్రమాదకర మైన యవ్వనదశను సురక్షితంగా నే నధిగమించాను. ప్రపంచంలో జీవితాన్ని ప్రారంభించటాని కవసరమైన శీలం నాకు లభించింది. దానికి సక్రమమైన విలువనిచ్చి సుస్థిరపరుచుకోవాలని నిర్ణయించుకున్నాను.

మేం ఫిలడల్ఫియా వచ్చేసరికి లండన్‌నుంచి రావలసిన సాధన సామాగ్రి వచ్చిఉంది. వెంటనే క్రైమర్‌తో వ్యవహారాలన్నీ ఫైసలు చేసుకున్నాం. మార్కెట్ దగ్గర సంవత్సరానికి యిరవై పౌన్ల అద్దెకు ఒకయిల్లు తీసుకున్నాం. ఇంకా పొదుపుచేయటానికి అందులో కొంతభాగాన్ని గాడ్‌ఫ్రే అనే గాజు వర్తకునికి అద్దెకిచ్చాం. అతనింట్లోనే భోజనాలు ఏర్పాటు చేసుకున్నాం. మేము ప్రెస్‌ని సర్దుకుంటున్నామో లేదో జార్జిహౌస్ అనే స్నేహితుడు ఒక పల్లెటూరి మనిషిని వెంటబెట్టుకొని వచ్చాడు. ఆ వ్యక్తి ప్రెస్‌కోసం వెతుక్కుంటున్నాడు. అప్పటికి మా దగ్గరఉన్న డబ్బంతా ఖర్చయిపోయింది. అనుకోకుండా ఆ పల్లెటూరి పెద్దమనిషివద్ద అయిదు షిల్లింగులు లభించటం మాకు పరమానందమైంది. వ్యాపారంలో అదే మా మొదటి సంపాదన. జార్జిహౌస్‌కు నేను చాలా కృతజ్ఞత తెలిపాను. అప్పటినుంచీ జీవితాన్ని అప్పుడే ప్రారంభించే యువకులకి ప్రోత్సాహం యివ్వటానికి నేను ఎక్కువగా సిద్ధపడుతూ వచ్చాను. కాని ఎవరూ అభివృద్ధి చెందటం సహించలేని కాకుల్లాటిమనుషులు లోకంలో ఎప్పుడూ ఉంటారు. ఫిలడల్ఫియాలో నివసిస్తున్న

'శామ్యూల్ మైకేల్' అనే పెద్దమనిషి అలాంటి వారిలో ఒకడు. వయసులో పెద్దవాడే. కొంత పేరుకూడా సంపాదించాడు. అంతకుముందు నా కతనితో పరిచయం లేదు. ఒక రోజున తలుపుతట్టి ప్రెస్‌లో ప్రవేశించి "కొత్తగా ప్రెస్‌ను స్థాపించిన కుర్రాడివి నీవేనా" అంటూ ఆరాతీశాడు. ఔనని జవాబు చెప్పాను. ప్రెస్ వ్యాపారం చాలావ్యయ ప్రయాసలతో కూడినదని, ఫిలడల్ఫియాలో అలాటివ్యాపారం ప్రారంభించటం పూర్తిగా దురదృష్టకరమైన విషయమని, నాకు నష్టంరాక తప్పదనీ హెచ్చరించాడు. ఇలా వ్యాపారం ప్రారంభించి పాడైపోయిన వారినిగురించీ, త్వరలో పాడవబోయే వారినిగురించీ, వివరాలన్నీ ఒప్పజెప్పి నా మనసు పాడుచేశాడు గాని అతడు వెళ్ళలేదు. ఆ క్షణంలో నేను చేసినపని పొరపాటే ననిపించింది. ఈ పెద్దమనిషి ఈ నగరంలోనే చాలాకాలంగా ఉంటున్నాడు. కాని ఈ నగరం ఎలాగో పాడైపోతుందనే నమ్మకంతో యిల్లుమాత్రం కొంటూనికి సాహసించలేదు. బేరాలుమాత్రం సాగించటం; మళ్ళీ విరమించటం జరుగుతూనే ఉంది. చివరికి తానొకప్పుడు బేరంచేసిన అదే ఇంటిని అయిదురెట్లు డబ్బు వెచ్చించి అతడు కొనుక్కోవటం నే కళ్ళారా చూశాను.

ఇంతకుముందే నేనొక విషయం చెప్పాలి. గడిచిన ఆకురాలు కాలంలో నేను 'జుంటో' అను పేరుగల క్లబ్బు జేరాను. అందులోనే - నాకు చాలామంది మేధావులతో పరిచయం ఏర్పడింది. ప్రతి శుక్రవారం సాయంసమయాల్లో మేం కలుసుకునేవాళ్ళం. క్లబ్బులోని ప్రతిసభ్యుడూ ప్రతి

సమావేశంలోనూ నైతిక, రాజకీయ, తాత్విక విషయాల్లో ఏదో ఒక ప్రశ్న వెయ్యాలని, దాన్ని తక్కినవారు చర్చించాలనీ నేను ఒకనిబంధన పెట్టాను. ప్రతి సభ్యుడూ మూడు నెల్ల కొకసారి తనకిష్టమైన దేదో ఒక విషయంమీద ఒక వ్యాసాన్ని వ్రాసుకొచ్చి చదవాలని కూడా సూచించాను. మా చర్చలన్నీ నిష్కపటంగా విజ్ఞాన సముపార్జనాదృష్టితో అధ్యక్షుని సూచనల ప్రకారం సాగాలని నిర్ణయించబడింది. విజయాన్ని సాధించాలనే పట్టుదలగానీ, వివాదాన్ని పెంచాలనే ఆసక్తిగానీ పూర్తిగా గర్హింపబడింది.

ఈ నిబంధనల్ని అధిగమించిన వారిని చిన్న చిన్న జరిమానాలతో సరిదిద్దటం జరిగేది.

మా క్లబ్బులో మొట్టమొదటి సభ్యుడు జోసెఫ్ బ్రియంట్ నల్. సరళస్వభావంగల స్నేహపాత్రుడు. సాహిత్యమంటే అత్యంత శ్రద్ధాసక్తులు గలవాడు. కాస్తో కూస్తో వ్రాయగలడు.

రెండో వ్యక్తి థామస్ గాడ్ ఫ్రే స్వయంగా గణిత శాస్త్రం నేర్చుకుని అందులో గొప్పవాడయ్యాడు. ఇప్పుడు హేడ్ లే క్వాడ్ రెంట్ అని పిలవబడేది అతనే కనిపెట్టాడు. అతనిగొడవ తప్ప మరింకో విషయం తెలియదు. అంచేత అతని సాహచర్యాన్ని ఎక్కువకాలం భరించలేం. నలుగురం కూర్చుని పిచ్చాపాటీ మాట్లాడుకుంటున్నప్పుడు – ప్రతి మాటా ఖచ్చితంగా ఉండాలంటూ వెనక్కులాగేవాడు. సంభాషణ సాగనిచ్చేవాడు కాదు. కాని త్వరలోనే – అతను మమ్మల్ని వదిలి వెళ్ళిపోయాడు.

తరువాత వ్యక్తి నికొలస్ స్కాల్, సర్వేయరు. తదుపరి సర్వేయరు జనరల్ అయ్యాడు. పుస్తకాలంటే ప్రాణం. కొన్ని పద్యాలుకూడా కూర్చాడు.

విలియమ్ పార్సన్స్, చెప్పులుకుట్టి జీవించే కుటుంబంలో జన్మించినా, బాగా చదివి గణితశాస్త్రంలో కొంత వరకూ ప్రజ్ఞా ప్రాభవాలు గడించాడు. తరువాత అతడుకూడా సర్వేయర్ జనరల్ అయ్యాడు.

విలియం మాగ్రిడ్జి బాగా నిపుణతగల మెకానిక్. తెలివైనవాడు.

రాబర్ట్ గ్రేస్ శ్రీమంతుడు. చమత్కారి - దయా హృదయుడు, స్నేహశీలుడు.

చివరివ్యక్తి విలియంకోల్ మన్. అప్పుడు ఒకవర్తకుడి దగ్గర గుమాస్తాగా ఉండేవాడు. అంతమేధావంతునీ, సహృదయునీ, శీలవంతునీ, నే నెన్నడూ చూడలేదు. ఆ తర్వాత వ్యాపారంచేసి బాగా సంపాదించాడు. చివరకు మా రాష్ట్రంలో న్యాయమూర్తి అయ్యాడు. మా స్నేహం చెక్కు-చెదరకుండా, అతను జీవించినంతకాలం ఉంది. అతని నల భయ్యోవపడిలోనే మరణించాడు. అంతవరకూ మాక్లబ్ సజీవంగానే నిల్చిఉంది. రాష్ట్రమంతటిలోకి రాజకీయ, నైతిక, తాత్విక విషయాల్లో ప్రధాన కేంద్రంగా వినుతికెక్కింది.

మాలో మేం ప్రతివారం వేసుకునే ప్రశ్నలు-జరుపుకునే చర్చలు - మాకెంతో ఉపయోగించాయి. అనేకవిషయాలు చదివి తెలుసుకునే అవకాశం కలిగింది. చక్కటి

సంభాషణ సాగించేవిధానం అలవడింది. క్లబ్ లో మేం ఏర్పరుచుకున్న నియమాలవల్ల, మాలో మాకు ఒకరికి విసుగు కలిగే ప్రమాదం ఏర్పడలేదు. అంచేతనే ఆక్లబ్ అంతకాలం జేగీయమానంగా సాగింది. దీన్నిగురించి ముందు ముందు చాలాసార్లు ముచ్చటించాల్సిన అవుసరం కల్గుతుంది.

నేను ఈ కథంతా ఎందుకు చెప్తున్నానంటే ఇందులోని ప్రతిఒక్కరూ మాకు కొంతపనిని సిఫార్సుచేసేవారు. ముఖ్యంగా బ్రయింట్ నల్, క్వాకర్సుదగ్గరనుంచి నల్లభైషీట్ల చరిత్ర అచ్చువేయటానికి తెచ్చిపెట్టాడు. తక్కిందిక్రైమర్ దగ్గర అచ్చయింది. ఇందులో మాకు ప్రతిఫలం తక్కువ ముట్టటంచేత, చాలా కష్టపడాల్సివచ్చింది. నేను రోజుకొక షీటుచొప్పున కూర్చేవాణ్ణి. మెరిడిత్ దాన్ని అచ్చువేసేవాడు. ఒకసారి రాత్రి 11 గంటలు దాటేది. తక్కిన స్నేహితులు పంపిన చిన్నచిన్న పనులవల్ల ఇంకా ఆలస్యమయేది. కాని నేనుమాత్రం షీటు పూర్తి చేయకుండా పడుకునేవాణ్ణికాదు. ఒకరోజున అంతా కూర్చుకొని, వెళ్ళిపోదామనుకుంటున్నాను. కాని ప్రమాదవశాత్తూ, అందులో కొంత విచ్చిపోయింది. నేను తెల్లవార్లూ మేలుకొని మళ్ళీ పనంతా చేసుకున్నాకగాని పడుకోలేదు. మేమిలా కష్టించడం చూసిన వారందరికీ మామీద చాలా సదభిప్రాయం కలుగుతూంది. ముఖ్యంగా అప్పటికే ఊళ్ళో రెండుప్రెస్ లుండటంచేత మా ప్రెస్ వ్యాపారంసాగదనే సాధారణ అభిప్రాయానికి విరుద్ధంగా వర్తకులందరికీ, మా భవిష్యత్ మీద నమ్మకం కలుగుతూంది. అందులో డాక్టర్ బెయిర్డ్ అనే పెద్దమనిషి

యిలా అన్నాడట. "ఫ్రాంక్లిన్ యొక్క పనితనం మరెక్కడా నేను చూడలేదు. నేను అర్ధరాత్రి క్లబ్ నుంచి యింటికి వెళ్ళేటప్పుడు కూడా అతడు పనిచేస్తూఉంటాడు. మళ్ళీ యిరుగుపొరుగువారు లేవకముందే, ఉదయమే పనిలో కని పిస్తూంటాడు."

ఈ విధంగా మాకు కొంత పేరు వస్తూంది. ఇది ఆత్మ స్తుతిగా కనిపించినా నే నెంతగా శ్రమించి పనిచేశానో చెప్ప టానికి కారణం, దాన్ని చదివే నా భవిష్య త్తరాలవారు ఈ సుగుణంలోని ఉపయోగం గ్రహించటానికి వీలుపడు తుందిగనుక.

జార్జి వెబ్ నా దగ్గరకు ఉద్యోగం కావా లంటూ వచ్చాడు. అతనికి మేం ఉద్యోగం చూపెట్టలేకపోయాం. ఆ సందర్భంలో తెలివితక్కువగా నే నొక రహస్యం అతనికి చెప్పాను. ముందు ముందు ఒక వార్తాపత్రికను స్థాపించబో తున్నా మనేది ఆ రహస్యం. అప్పుడు తప్పకుండా ఉద్యోగం చూపెట్టగలనని చెప్పాను. అప్పుడు నగరంలో ఒకే ఒక వార్తాపత్రిక బ్రాడ్ ఫోర్డుచేత ప్రకటించబడుతున్నది. ఏ రక మైన వినోదమూ, విజ్ఞాన విలువలూ లేకపోయినా అతనికి లాభం వస్తూనేవుంది. అంచేత యింతకంటె బాగా నడిపే సమర్థతగల నేను, దానిమీద చాలా ఆశపెట్టుకున్నాను. మంచిపత్రికకు ఎప్పుడూ ప్రోత్సాహం లభిస్తూనే ఉంటుందని నేను భావించాను. ఈ విషయ మెవరికీ చెప్పవద్దని, నేను వెబ్ ని కోరాను. కాని అతగాడు యీ విషయం చల్లగా కైమర్ కు చేరవేశాడు. కైమర్ హుటాహుటిని తానే

స్వయంగా వార్తాపత్రిక స్థాపించటానికి సన్నాహాలు చేస్తూ, అందులో వెబ్ కు ఉద్యోగ మిచ్చాడు. కాని దీన్ని నేను అవమానంగా భావించాను. అప్పటికి నేను పత్రిక స్థాపించక పోవటంచేత బ్రాడ్ ఫోర్డు పేపర్లో 'బిజీ బాడీ' అనే పేరుతో కొన్ని వినోదకరమైనరచనలు సాగించాను. దాంతో ప్రజల యొక్క దృష్టి ఆ పేపరుమీదపడింది. ఇది కైమర్ కు కొంత నిరుత్సాహం కలిగించింది. ఏమైనా అతడు పేపరు ప్రకటిం చటం ప్రారంభించాడు. అక్షరాలా తొంభైమంది చందా దార్లుమాత్రం చేరారు. చివరికి దాన్ని నాకు యిచ్చివేయా లని నిర్ణయించుకున్నాడు. కొంతకాలం దాంతోనే గడపా లనుకొని వెంటనే స్వాధీనంచేసుకున్నాను. అది క్రమంగా వృద్ధిచెంది కొన్ని సంవత్సరాల్లో, నాకు విపరీతమైన లాభా లను తెచ్చిపెట్టింది.

ఈ విషయం నేను ముచ్చటించేటప్పుడు ఏకవచన ప్రయోగం చేయటానికి కారణం, వ్యాపారనిర్వహణమంతా పూర్తిగా నా అధీనంలో ఉండటమే! మెరిడిత్ కు ఏ పనీ చేతకాదు.

మేం మొదట అచ్చువేసినపత్రిక చాలా ముచ్చటగా వెలువడింది. అంతకు ముందు రాష్ట్రంలో ఏ పత్రికా అంత ముచ్చటగా ప్రకటించబడ లేదు. అప్పుడు గవర్నర్ 'బర్నెట్'కూ 'మసాచూసెట్స్' అసెంబ్లీకీ మధ్య చెలరే గిన వివాదంగురించి నేను కొన్ని ఉద్రిక్తకరమైన వ్యాఖ్యా నాలను పత్రికలో ప్రకటించాను. అవి అందరినీ ఆకర్షించి నయ్. కొద్దివారాల్లోనే మా చందాదార్ల సంఖ్య పెరిగింది.

ఆ తర్వాతకూడా ఈ ఉదాహరణనే అనుసరించాం. చందాదార్ల సంఖ్య ఇంకా పెరుగుతూనేవుంది. కాస్తోకూస్తో వ్రాయటం నేర్చుకోవటంవల్ల నాకు కలిగిన మొదటి ఫలిత మది. కొంత రాతకోతలు తెలిసిన నాలాంటివ్యక్తి, వార్తా పత్రిక నడపటంవల్ల, కొందరు ప్రముఖులు సంతోషించి, నన్ను ప్రోత్సహించా లనుకున్నారు. బ్రాడ్ ఫోర్డు ఇంకా బయటి అచ్చుపనులు చేస్తూనేఉన్నాడు. హౌస్ వారు గవ ర్నరుకు పంపిన సందేశం అతడు తప్పుల బొంతగా అచ్చు వేసి అందరికీ పంపించాడు. దాన్ని మేం సవరించి ముచ్చ టగా అచ్చువేసి అందరికీపంపాం. ఆ రెంటికీగల తారతమ్యం వారు బాగా తెలుసుకున్నారు. హౌస్‌లో మమ్మల్ని అభి మానించేవారు ఇంకా స్నేహితులయ్యారు. తరువాత సంవత్సరానికి వారి ప్రచురణకర్తలుగా మమ్మల్ని ఎన్ను కున్నారు.

హౌస్‌లోని నా స్నేహితులలో 'మిస్టర్ హామిల్టన్' ను నే నెప్పుడూ మరిచిపోలేను. అతడప్పుడే ఇంగ్లండు నుంచి తిరిగివచ్చి అందులో స్థానం సంపాదించాడు. అతడు మర ణించేవరకూ ఆఅభిమానం అలాగేనిలిచింది. ఈసమయంలో 'మిస్టర్ వెర్నన్' తన కివ్వాల్సిన బాకీమాట గుర్తుచేశాడు. కాని ఒత్తిడి చెయ్యలేదు. అతనికినేను కొంతవ్యవధినిమ్మంటూ ఉత్తరం వ్రాశాను. దాని కతనంగీకరించాడు. తరువాత నేను వడ్డీతో సహా బాకీఅంతా చెల్లించి, అంతకాల మాగినందుకు కృతజ్ఞతలు తెలుపుకున్నాను.

కాని యిప్పుడు నేను ఎన్నడూ అనుకోని చిక్కును

ఎదుర్కోవలసి వచ్చింది. మా ప్రెస్‌కి పెట్టుబడిపెట్టిన మెరిడిత్ తండ్రి, నూరుపౌన్లుమాత్రమే చెల్లించాడు. మరోనూరు పౌన్లు ఆ వ్యాపారస్థునికి బాకీపడ్డాడు. అతడు సహనం కోల్పోయి మా మీద చర్యతీసుకున్నాడు. మేం బెయిల్ తీసుకొన్నాం. కాని సకాలంలో అప్పుగనక తీర్చలేకపోతే న్యాయమూర్తి తీర్పు అమలు జరుగుతుంది. అలాంటి సమయంలో అప్పుతీర్చటం కోసం సగానికి సగం ధరకు ప్రెస్‌ను అమ్మవలసి రావచ్చు. దాంతో మాతోపాటు, మా భవిష్యత్‌లు కూడా, నేలమట్టమై పోవచ్చు.

ఈ క్లిష్టసమయంలో నిజమైన స్నేహితులిద్దరు సాయపడ్డారు. వారిని నేనెన్నడూ మర్చిపోలేదు. ఇకముందుకూడా మర్చిపోలేను. వారిద్దరు ఒకరికి తెలియకుండా ఒకరు నా దగ్గరకు వచ్చారు. అప్పు మొత్తమంతా తీర్చివేయగలమని వాగ్దానం చేశారు. మెరిడిత్ త్రాగుతూ తందనాలాడుతూ, వీధులెంట తిరుగుతూ, ప్రెస్‌ను అపఖ్యాతి పాలుచేస్తున్నాడు గనుక అతనితో తెగతెంపులు చేసుకొమ్మని వారు నాకు సలహాయిచ్చారు. ఆ యిద్దరి స్నేహితుల పేర్లూ చెప్తాను. అందులో ఒకని పేరు 'విలియంకోల్‌మన్'. రెండోవ్యక్తి 'రాబర్ట్‌గ్రేస్'. మెరిడిత్‌తో తెగతెంపులు చేసుకోవటం సాధ్యం కాదని చెప్పాను. అతను నాకుచేసిన సహాయానికి నేను చాలా కృతజ్ఞత చూపెట్టాలి. అతను అంతఅక్రమంగా ప్రవర్తించినప్పుడు మాత్రమే తెగతెంపులు చేసుకునేప్రసక్తి వస్తుంది. ఆ విధంగా కొంతకాలం పరిస్థితులు ప్రశాంతంగా నడిచినయ్. నేను ఒకరోజున మెరిడిత్‌తో ఇలా అన్నాను.

"మన జాయింటు వ్యాపారంలో నీవు వహిస్తున్న పాత్ర నీ తండ్రి కంతగా నచ్చకపోవచ్చు. నాతో కలిసి ఉండటంచేత కావలసిన పెట్టుబడి పెట్టటానికి ఆయన సందేహించవచ్చు. అదేగనక నిజమైతే నేను నీతో తెగతెంపులు చేసుకొని బయటకు వెళ్ళిపో దల్చుకున్నాను."

దాని కతడు ఈ విధంగా సమాధానం చెప్పాడు. "అలాటిదేమీ లేదు. నా తండ్రి చాలా ఆశాభంగం చెందాడు. వాస్తవంగా నిస్సహాయస్థితిలో ఉన్నాడు. ఆయన్ను ఇంకా బాధపెట్టటం నాకు యిష్టంలేక పోయింది. ఈ వ్యాపారానికి నేను తగినవాణ్ణి కాదని తెలుసుకున్నాను. పల్లెపట్టుల్లో వ్యవసాయం చేసుకోవలసినవాణ్ణి పట్టణానికి ఎగ బడటంవల్ల పెద్ద పొరపాటే జరిగింది. ముప్ఫైఏళ్ళ వయ స్సులో కొత్తవ్యాపారం నేర్చుకోవా లనుకోవటం, తెలివి తక్కువనే తేలిపోయింది. మావాళ్ళంతా 'నార్తకరోలినా' కు పోతున్నారు. అక్కడ భూములు చౌకగా దొరుకుతున్నా యట. నేను అక్కడకు పోయి వ్యవసాయం చేసుకోవాలను కుంటున్నాను. ఇక్కడ నీకు సాయంచేయటానికి చాలామంది స్నేహితులున్నారు. మన కంపెనీయొక్క అప్పులు నీవు తీసుకో - నా తండ్రిపెట్టుబడి పెట్టిన నూరుపౌన్లు తిరిగి వాపస్ చెయ్యి - నేను చేసిన చిల్లర అప్పులన్నీ తీర్చు. నా కొక ముప్ఫైపౌన్లు మాత్రం ఇయ్యి-మనం కలిసిచేసుకొన్న ఒడంబడికనురద్దుచేసి, అంతా నీచేతుల్లోపెట్టి వెళ్ళిపోతాను.

ఈ ప్రతిపాదన్ను నేను అంగీకరించాను. ఈ షరతు లన్నీ వ్రాసుకొని సీలువేసి దాచుకున్నాం. అతడు కోరింది

వెంటనే యిచ్చాను. వెంటనే అతడు 'కరోలినా' వెళ్ళిపోయాడు. ఆ తర్వాత సంవత్సరం అక్కడి దేశాన్ని శీతోష్ణ స్థితుల్నీ, నేలతీరుల్నీ గురించి రెండు సుదీర్ఘమైన లేఖలు వ్రాసి నాకు పంపాడు. వాటిని నేను పత్రికలో ప్రకటించాను. అవి అందరూ చదివి మెచ్చుకొన్నారు.

మెరిడిత్ వెళ్ళిపోగానే నేనుతిరిగి నా యిద్దరు స్నేహితులను కలుసుకున్నాను. ఏ ఒక్కరినీ నిరుత్సాహ పరచటం నా అభిప్రాయం కాదుకాబట్టి నాకు కావలసిన మొత్తాన్ని ఇద్దరి దగ్గరా చెరిసగం తీసుకున్నాను. కంపెనీ అప్పులు తీర్చి, పార్టనర్‌షిప్ రద్దయిందని ప్రకటించి, నా పేరు మీదగా వ్యాపారం ప్రారంభించాను. బహుశా యిది 1729 ప్రాంతాల్లో అయినట్లు గుర్తు.

ఈ సమయంలో కాగితపు కరెన్సీ ఇంకా కావాలంటూ రాష్ట్రంలో ఆందోళన బయలుదేరింది. అప్పటికి రాష్ట్రమొత్తంమీద పదిహేనువేల పౌన్ల కరెన్సీ మాత్రమే మారకంలో ఉంది. శ్రీమంతులుమాత్ర మిందుకు వ్యతిరేకించారు. న్యూఇంగ్లండులో వలె పెట్టుబడిదార్లకు ఆశాభంగం కలిగిస్తూ, దానివిలువ తగ్గిపోవచ్చునని వారిభయం; ఈ విషయాన్ని మేం మా 'జుంటో' క్లబ్‌లో చర్చించాం. 1723లో వేసిన కాగితపు కరెన్సీవల్ల వ్యాపారమూ, ఉద్యోగాలూ, పెరిగిన విషయాన్ని జ్ఞప్తికి తెస్తూ, నేను దీని కనుకూలంగా వాదించాను.

మా చర్చలవల్ల ఈ విషయం నాకు బాగా గ్రాహ్యమయింది. "కాగితపు కరెన్సీయొక్క స్వభావమూ, దాని

ఆవశ్యకత" అనే శీర్షికతో ఊరూపేరూ లేకుండా ఒక కరపత్రం అచ్చువేశాను. సాధారణ ప్రజానీకం దాన్ని శ్రద్ధగా చదివి మెచ్చుకున్నారు. శ్రీమంతులు గర్హించారు. కాని నా కరపత్రానికి జవాబుగా మరో కరపత్రం వ్రాయగల వారెవ్వరూ వారిలో లేరు. చివరికి హౌస్‌లో ఎక్కువమంది దీని కనుకూలంగా ఓటుచేశారు. నేనుచేసిన సేవను గణించి కొందరు స్నేహితులు ఆ కరెన్సీ అచ్చువేసే అవకాశం నాకు కలిగేటట్లు చేశారు. వ్రాయటం నేర్చుకోవటం వల్ల గలిగిన మరో ఉపయోగం ఇది.

ఆ తర్వాత కాగితపు కరెన్సీ యొక్క ఉపయోగం అందరూ గ్రహించారు. అందు గురించిన వివాదాలు చెలరేగటంలేదు. క్రమంగా అనతికాలంలో యాభై అయిదు వేల పౌన్ల కరెన్సీ అమల్లోకి తేబడింది. 1739 లో అది ఎనభై వేల పౌన్లవరకూ పెరిగింది. యుద్ధకాలంలో మూడువందల యాభై వేల పౌన్లవరకూ పెరిగింది. కాని పేపరు కరెన్సీ ఒక హద్దునుదాటి పెరగటం మంచిదికాదని ఇప్పుడనుకుంటున్నాను.

అంతలో నా స్నేహితుడు, 'హామిల్టన్' ద్వారా న్యూకాజిల్ కాగితపు కరెన్సీ అచ్చువేసే పనికూడా నాకు లభించింది. అదిచాలా లాభసాటి అయిన అవకాశం. ఆ ప్రభుత్వంయొక్క శాసనాలు, ఓట్లు అచ్చువేసే పనికూడా నాకు లభించేటట్లు చేశాడు. నేను ఆ వ్యాపారం చేసినంత కాలం నా చేతుల్లోంచి ఆ పని దాటిపోలేదు.

నే నిప్పుడు చిన్న స్టేషనరీషాపు పెట్టాను. అందులో చాప్‌మన్ పుస్తకాలుకూడా పెట్టాను. లండన్‌లో నాకు

తెలిసిన వైట్‌మాష్ అనే కంపోజిటరు ఇప్పుడు నాదగ్గరకు వచ్చి పనిచేస్తున్నాడు. 'అక్విలారాజ్' కుమారుడు పని నేర్చుకుంటానికి నాదగ్గర ఉంటున్నాడు.

ఇప్పుడు నేను క్రమంగా ప్రెస్‌కోసం చేసిన అప్పులు తీర్చివేస్తున్నాను. వ్యాపారంలో పలుకుబడినీ, శీలాన్నీ కాపాడుకోవటం కోసం కొన్ని జాగ్రత్తలు తీసుకున్నాను. ఊసుపోక అర్థంలేని కబుర్లలోకి దిగేవ్యక్తులున్నచోటికి పోయే వాణ్ణి కాదు. వేటకికాని, చేపలు పట్టటానికిగాని వెళ్ళేవాణ్ణి కాదు. ఎటుతిరిగీకొన్ని సమయాల్లో ఏదో చదువుకుంటూ పని మీద అశ్రద్ధ చూపటం జరిగేది. క్రమంగా నావ్యాపారం మూడుపువ్వులూ, ఆరుకాయలు అయివృద్ధిచెందుతూంది. ఈ లోగా కైమర్ యొక్క పరిస్థితి పూర్తిగా పాడైపోయింది. అప్పుల్లోంచి బయటపడటానికి తనప్రెస్‌ను అమ్ముకోవాల్సి వచ్చింది. ఆ తర్వాత 'బార్బడజ్' వెళ్ళి అక్కడ అతిదైన్య మైన పరిస్థితుల్లో కొన్నాళ్ళు జీవించాడు.

అతడిదగ్గర పనినేర్చుకొన్న 'డేవిడ్ హారీ' ఆ సాధన సామాగ్రినంతా కొనుక్కొని, తానే వ్యాపారాన్ని ప్రారంభించాడు. హారీకి సమర్థులైన స్నేహితులుండటం చేత, వ్యాపారంలో నన్నుదాటిపోయే అవకాశాలు కనిపించినయ్. అంచేత జాయింట్‌గా వ్యాపారం చేద్దామని అతనికి ప్రతి పాదించాను. అతడు చాలాగర్విష్టి. పెద్దమనిషిలా విలువైన దుస్తులు ధరించటం, అతివ్యయంతో ఆడంబరంగా జీవించటం, విలాసాలకోసం విదేశాలలో తిరిగి వ్యాపారంపై అశ్రద్ధ వహించటం, వీటితో అతడుకూడా అప్పులపాలై వ్యాపారం

లేక ఏం చెయ్యాలో తోచక, క్రైమర్ మార్గాన్నే అనుస రించి, ప్రెస్‌తో సహా 'బార్బడజ్' జేరుకున్నాడు. అక్కడ తన పూర్వపు యజమాని క్రైమర్‌కు తాను ఉద్యోగ మిచ్చాడు. ఇద్దరూ తరుచు పోట్లాడుకునేవాళ్ళు. చివరకు ప్రెస్‌ను ఒక ఆసామీకి తెగనమ్మి, హారీ పెన్సిల్వేనియా వెళ్ళిపోయాడు. ఆ ఆసామి క్రైమర్‌ను ఉద్యోగంలో చేర్చు కున్నాడు. కాని ఆ తర్వాత కొద్దిసంవత్సరాలలోనే అతడు మరణించాడు.

ఇక ఫిలడల్ఫియాలో బ్రాడ్‌ఫోర్డు మినహా ప్రెస్ వ్యాపారంలో నాకు ప్రతికక్షి లేకపోయాడు. బ్రాడ్‌ఫోర్డు శ్రీమంతుడు. వ్యాపారంమీద అతనికి తగినంత పట్టుదలలేదు. పోస్టాఫీసు అతనిచేతుల్లో ఉండటంచేత వార్తలు అతనికి తొందరగా వస్తాయని అందరూ నమ్మేవారు. ప్రకటనలు కూడా అతని పేషరుకే ఎక్కువ వచ్చేవి. వాటివల్ల అతనికి పుష్కలంగా లాభం వస్తూన్నది.

ఇంకా నేను గాడ్‌ఫ్రే యింట్లోనే భోంచేస్తున్నాను. నేను ఉంటున్న గృహంలోనే కొంతభాగంలో భార్యాపిల్లల్తో నివసిస్తూ అందులోనే అతడు కొట్టుకూడా పెట్టుకున్నాడు. అతడు తనపనిలో కంటె గణితశాస్త్రాన్ని చదవటంలోనే ఎక్కువ కాలాన్ని వినియోగించేవాడు. గాడ్‌ఫ్రే భార్య నాకో సంబంధం చూసింది. మా యిద్దర్నీ సమావేశపరచ టానికి ప్రయత్నించేది. వృద్ధజంబుకాలు నన్ను తరచుగా విందులకు పిలుస్తూ మా యిద్దరిని ఏకాంతంగా వదిలిపోతూ అన్నివిధాల ప్రోత్సహించారు. గాడ్‌ఫ్రే భార్య రాయబారం

నడిపింది. నాకుగల నూరుపౌన్ల అప్పు పెండ్లికూతురు తరఫు వారు తీర్చాలని షరతుపెట్టాను. కాని అంతసొమ్ము యివ్వ టానికి వారు అశక్తతను వ్యక్తపరిచారు. ఇల్లు తనఖాపెట్టి అప్పుతెచ్చి యివ్వవచ్చని నేను సూచించాను. దానికి సమా ధానంగా వారు నా సంబంధమే అక్కర్లేదని కబురుపంపారు. బ్రాడ్‌ఫోర్డు ప్రెస్‌వ్యాపారం లాభదాయకమైంది కాదని వారికి చెప్పాడుట. ముందు కైజర్, ఆ తర్వాత హారీ ఏ విధంగా దివాలాతీశారో అదేవిధంగా నేనుకూడా దివాలా తియ్యబోతున్నానట. అంచేత నాకు పిల్లనివ్వటం మంచిది. కాదనే నిర్ణయానికి వారు వచ్చారుట. ఆ తర్వాత, ఆరా తీయగా ఈ భోగట్టా తెలిసింది.

ఈ వ్యవహారంతో పెళ్ళినిగురించి ఆలోచించవలసిన అవుసరం నాకు కలిగింది. నాలుగుమూలలా వెతికి కొందర్ని పరిచయం చేసుకున్నాను. కాని ప్రెస్‌వ్యాపారంమీద ఎవ రికీ ఉన్నతమైన అభిప్రాయం లేకపోవటంచేత, డబ్బు తెచ్చే భార్య లభించటం అసంభవమని తెలుసుకున్నాను. ఒకవేళ అటువంటిది సంభవించినా ఆమె మరే విషయంలోనూ సానుకూలమైందిగా ఉండదు. ఈ కాలంలో నన్ను నేను అదుపులో పెట్టుకోలేని యవ్వనోద్రేకం తక్కువరకపు స్త్రీల కేసికూడా నన్ను పరుగెత్తించేది. దానివల్ల అనేక కష్టాలతో పాటు శరీర ఆరోగ్యం చెడే ప్రమాదంకూడా సంభవించవల సింది. కాని అదృష్టవశాన ఆ గండం గడిచింది. మిస్ రీడ్ కుటుంబంతో కేవలం స్నేహప్రాయంగా నేను ఉత్తరప్రత్యు త్తరాలు జరుపుతున్నాను. వారికి నాపై మొదట ఏర్పడిన

గౌరవాభిప్రాయం ఇప్పటికీ నిలిచిఉంది. తరచుగా నన్ను వారింటికి ఆహ్వానించి అనేక కుటుంబసమస్యలు చర్చించే వారు. నేను చేతనైనసాయంచేసేవాణ్ణి. మిస్ రీడ్‌ను చూస్తే నాకు జాలివేసేది. ఆ దురదృష్టకరమైన స్థితిలో క్రుంగిపోయి ఏకాంతాన్ని కోరుతూ ఆమె కాలం గడుపుతున్నది. నేను లండన్‌లో ఉన్నప్పుడు చేసిన అశ్రద్ధ, ఆమె దురదృష్టానికి కారణమని అనిపించేది. కాని నేను లండన్ బయలుదేరక ముందు వివాహం జరుగకుండా, అడ్డుపడినందుకు తప్పంతా తనదేనని ఆమెతల్లి కుమిలిపోయేది. మా పరస్పర ప్రేమాభిమానాలు తిరిగి మొలకెత్తినయ్. అతగాడికి మరొకభార్య ఉండటంచేత ఆమె వివాహం న్యాయంగా చెల్లదు. కాని అతని మొదటిభార్య లండన్‌లో ఉండటంచేత ఆ విషయాన్ని నిరూపించటం అంత తేలికకాదు. అతగాడు మరణించినట్లు ఒక వార్త అందింది. కాని అది నిర్ధారణకాలేదు. అతడు అనేక అప్పులుచేసిపోయాడు. అతని స్థానంలో వచ్చినవ్యక్తి వాటిని తీర్చాలి. ఇన్ని ప్రతిబంధకాలు మా కలయికకు అడ్డునిలిచి ఉన్నాయి. అయినప్పటికీ మేం సాహసించాం. 1730 సెప్టెంబరు 1వ తేదీన ఆమెను నేను భార్యగా స్వీకరించాను. మేం ఊహించిన కష్టాలేమీ మాకు ఎదురుకాలేదు. ఆమె నాకు అనుకూలవతిఅయిన అర్ధాంగి అని నిరూపించుకుంది. మే మిద్దరం కలసి మెలసి ఒకరి సుఖంకోసం ఒకరొకరు జీవిస్తూ కాలం గడిపాం.

ఆ విధంగా నేను జీవితంలోచేసిన ఒక పెద్ద తప్పును సరిదిద్దుకున్నాను.

ఈ సమయంలో సత్రంలో కాకుండా, మిస్టర్ గ్రీన్ ప్రత్యేకించిన ఒక గదిలో మా క్లబ్ సమావేశాలు జరుపుకుంటున్నాము. మా చర్చలసందర్భంలో అనేకపుస్తకాలు మేం చూడవలసి ఉండటంచేత - అందరి పుస్తకాలను ఒకేచోట జేర్చిఉంచితే, అది అందరికీ లాభదాయకంగా ఉంటుందని నిర్ణయించుకున్నాం. వెంటనే గదిలో కొంత భాగం మేమందరం పుస్తకాలను తెచ్చి పేర్చివేశాం. కాని మే మనుకున్నన్ని పుస్తకాలుమటుకు రాలేదు. ఆ పద్ధతి కొంత ఉపయోగించినా వాటిని జాగ్రత్తపరచటం కష్టమై చివరికి ఎవరి పుస్తకాలను వారు తీసుకుపోయారు.

ఇప్పుడు నేను పదిమందికి సంబంధించిన ఒక బహిరంగ కార్యక్రమం మొదలుపెట్టాను. ఒక గ్రంథాలయం స్థాపించాలని నా కోరిక. జుంటోలోని నా స్నేహితుల సహాయంతో యాభై మంది చందాదారులను సంపాదించాను. ప్రతిసభ్యుడు మొదట జేరేటప్పుడు నలభై షిల్లింగులు, ఆ తరువాత సాలీనా పది షిల్లింగుల చొప్పున చెల్లించాలి. క్రమంగా చందాదారుల సంఖ్య నూరువరకు పెరిగింది. నా రుత్తరఅమెరికాలోని గ్రంథాలయాలన్నిటికీ ఇది తలమానికమైనది. దిన దినాభివృద్ధి చెందుతూనే ఉంది. ఈ గ్రంథాలయాలు సామాన్య ప్రజాజీవితాన్నికూడా బాగా మెరుగుపరచినయ్. ఇతర దేశాలలోని పెద్దమనుష్యులకంటె మనదేశంలోని సామాన్య వ్యాపారులు, రైతులు చక్కగా మాట్లాడకల్గుతున్నారు. కాలనీలన్నిటిలోను వారి వారి హక్కులను పరిరక్షించుకోవటంకోసం జరుపుతున్న ఉద్యమానికి ఈ గ్రంథా

లయాల ఉనికి కొంత దోహదమిచ్చినది. ఇంతవరకూ నేను వ్రాసినదంతా - చాలావరకు నా కుటుంబానికీ - నాకూ సంబంధించింది. అంచేత అనుకున్నంతగా అందరికీ దీనివల్ల ప్రయోజనం కలగకపోవచ్చు. ఇక వ్రాయబోయేదాంట్లో అందరికీ సంబంధించే విషయాలే ఎక్కువగా ఉన్నాయి ఇది వ్రాయమని ప్రేరేపిస్తూ కొందరు మిత్రులు వ్రాసిన లేఖల్లో రెంటిని యిక్కడ పొందుపరుస్తాను.

ఈ క్రింది ఉత్తరం నేను ప్యారిస్‌లో ఉండగా అందింది. కొన్ని నా జీవితసంఘటనలను మిస్టర్ ఎబిల్ జేమ్సు ఇందులో ఉల్లేఖించాడు.

"ప్రియమైన - గౌరవనీయమైన మిత్రుడా !

నేను అనేకసార్లు నీకు జాబు వ్రాయాలని అనుకుంటూ వచ్చాను. కాని, ఈ లేఖ బ్రిటిష్‌వారి చేతిలో చిక్కి ఎవరో ఒక బుద్ధిమంతుడు ఇందులోని భాగాలను అచ్చు వేస్తాడనే భయంతో ఇంతవరకు నీకు లేఖ వ్రాయటం జరగలేదు. కొంతకాలం క్రితం నీదస్తూరీతో వ్రాయబడిన ఇరువదిమూడు షీట్లు నాకు దొరికినవి. అవి నీ కుమారుని ఉద్దేశించి వ్రాయబడినవి. నీ వంశచరిత్ర 1730 వరకు నీ జీవితములోని కొన్ని సంఘటనలు అందు ఉల్లేఖించబడినవి. దీనితోపాటు దాని ప్రతినికూడా పొందుపరచి పంపుచున్నాను. తరువాత భాగం కూడా నీవు పూర్తిచేసి ఉన్నచో ఈ రెంటిని కలపవచ్చును. పూర్తిచేయనిచో ఇంకా జాగుచేయక పూర్తిచేయగలవని ఆశిస్తున్నాను. పెద్దలు చెప్పినట్లు జీవితము అశాశ్వితం. నీవు ఆ విధముగా వ్రాసిపోయిన చరిత్ర కొద్దిమందికి

మాత్రమే గాక లక్షలాది మందికి ఉపయోగపడు తుంది. ఆలాంటి రచనలు యువకుల మనస్సులమీద ఎంతో ప్రభావాన్ని కలిగి వారి భవితవ్యాలను తీర్చిదిద్ద టంలో ప్రముఖపాత్ర వహించగలవు. రచయితవలే తాను కూడా ఉన్నత జీవితలక్ష్యాలను సాధించాలని ప్రతి యువ కుడూ కొంత ప్రయత్నించవచ్చు. నీ స్వీయచరిత్ర ప్రచు రింప బడినచో అది వేలాది యువకులకు మిక్కిలి ఉపయోగ కరమైన విజ్ఞానభాండంగా రూపొందుతుందని భావిస్తున్నాను. జీవితపు తొలిరోజులలో నీవు చేసిన శ్రమ, చూపిన ఓర్పు ఆదర్శప్రాయమనటంలో సందేహమేమీ లేదు. అమెరికన్ యువకులలో శ్రమించాలనే ఉత్సాహము, ఓర్పు, ఉన్నత లక్ష్యాలు ప్రబోధించగల శక్తి నేడు సజీవులై యున్న ఏ మహావ్యక్తులకంటెను నీలో అధికంగా ప్రవర్తిల్లుతున్నదని నేను నమ్ముతున్నాను. అయితే నీ స్వీయచరిత్ర కేవలము ఆ ప్రయోజనానికితప్ప మరెందుకు పనికిరాదని నేనుచెప్పటం లేదు. అన్నిటికంటె ముఖ్యంగా దాని ప్రాముఖ్యం ఆ విష యంలో ప్రస్ఫుటంగా కనిపిస్తుందని మాత్రమే నేను చెప్తున్నాను."

ఈ ఉత్తరాన్ని నేను మరొక మిత్రునికి చూపగా - అత డీవిధంగా ఒక సుదీర్ఘమైన లేఖ వ్రాశాడు. బెంజమిన్ వాగ్హాన్ వ్రాసిన లేఖ ఇది:

ప్యారిస్, జనవరి 31, 1783

"ప్రియమైన అయ్యా! మీ తొలిజీవితంలోని ముఖ్య ఘట్టములను మీరు స్వయముగా వ్రాసిన పుటలలో చదివి

తెలిసికోన్నాను. దీనిని పూర్తిచేసి ప్రచురించటం ఎంతో ఉపయుక్తమని నేను భావిస్తున్నాను. దానికి కారణం వివరిస్తాను. కొంతకాలంనుంచి నేను మీకు లేఖ వ్రాయటానికి అనేకవిషయాలు అడ్డుపడినయ్. ఇప్పుడు కొంతవిశ్రాంతి లభించటంచేత నేను దీనిని వ్రాయటానికి పూనుకొన్నాను. ఇది మీకు ఎంతవరకు ఉపయోగిస్తుందో నాకు తెలియదు. కనీసము ఈ రూపములో నా అభిప్రాయాలను కొంత క్రమపరచుకొని గ్రాహ్యము చేసుకోదల్చుకున్నాను. నేను వ్రాసే పద్ధతి మీలాంటి స్వభావంగల వ్యక్తులకు కొంత కష్టం కలిగించ వచ్చు. కాని మీ యంత గొప్పవ్యక్తికి ఎలా వ్రాయాలో అలాగే వ్రాయదల్చుకొన్నాను. అలాంటి ఘనమైన వ్యక్తికి నేను ఈ విధంగా వ్రాసేవాడిని ఈ క్రింది ఉద్దేశాలతో నేను మీ జీవితచరిత్రను ప్రస్తుతిస్తాను. మీ చరిత్ర చాలా ఘనమైనదవటంచేత మీరు వ్రాయకపోయినా మరెవరయినా ప్రయత్నం చేయవచ్చు. అలాంటిపరిస్థితుల్లో మీ స్వీయచరిత్ర వ్రాయటంవల్ల ఎంతమంచి కలుగుతుందో అంతచెడ్డ కలిగే ప్రమాదం యేర్పడవచ్చు. అంతేగాక మీ చరిత్ర వల్ల మీ దేశపు నాటిపరిస్థితులు తెలిసికొంటానికి అవకాశం కలుగుతుంది. దీనివల్ల సాంప్రదాయం కలిగిన ఉత్తమ వ్యక్తులు మీ దేశంలో స్థిరనివాసం కల్పించుకుంటానికి ఆహ్వానించవచ్చు. ఈ విషయంలో మీ చరిత్రకంటే ఎక్కువ ప్రచారం యివ్వగలిగేది ఉందని నేను అనుకోవటం లేదు. మీ జీవితంలోని సంఘటనలన్నీ అప్పుడే అభివృద్ధి చెందుతున్న ప్రజాకోటి చరిత్రకు సంబంధం కలిగినవి. ఈ విష

యంలో మానవ స్వభావాన్ని సంఘాన్ని నిర్ణయించి పరి శీలించే ఏ వ్యక్తికి సేజర్, టేసిటస్‌ల రచనలకంటే మీ వే ఎక్కువ శ్రద్ధాసక్తులు కలిగిస్తాయనుకుంటా.

మీ జీవితపు ఒరవడిలో ఎందరో మహావ్యక్తులు ఉద్భ వించబోతున్నారు. మీరు ప్రకటించాలనుకుంటున్న 'ఆర్ట ఆఫ్ వర్ట్యూ' కూడా చాలా ఉపయుక్తమైన గ్రంథం. జీవిత సౌఖ్యాన్ని అంతిమలక్ష్యంగా పెట్టుకుని - వ్యక్తిగత శీలాన్ని తీర్చిదిద్దుకుంటానికే, అది ఉద్దేశింపబడింది. గనుక ఈ రెండు గ్రంథాలు, స్వయంపోషకమైన వ్యక్తిత్వాభి వృద్ధికి ఎంతో దోహదం చేయగలవు. పాఠశాలల్లో అమ లులోనున్న విద్యావిధానం సరిఅయింది కాదు. మీ పద్ధతి- సరళంగా, సూటిగా ఉంది. వ్యక్తిగత శీలంమీద వయసు ముదిరినతర్వాత ప్రసరించిన ప్రభావం చాలా బలహీనంగా ఉంటుంది. మనజీవితంలో ముఖ్యమైన ఆకాంక్షలూ, ఆద ర్శాలూ యౌవనదశలోనే మొలకలెత్తుతయ్.

ఈ సంధికాలంలోనే, మన భవితవ్యాలు మార్గాలు వెతుక్కుంటాయి. వైవాహిక జీవితానికి ప్రారంభం జరుగు తుంది. యౌవనదశలో జీవితం అతిముఖ్యమైన మలుపును దాటవలసిఉంది. యువకులనుబట్టే వ్యక్తి శీలంగాని, జాతి శీలంగాని, నిర్ణయించబడేది. నిజానికి జీవితానికి అదే నిజ మైన ప్రారంభం -మీ జీవితం - ఒక తెలివైనవ్యక్తియొక్క అభివృద్ధిని చెపుతుంది. తెలివైన వారంతా మీ నుంచి చాలా నేర్చుకుంటారు. ఈ సమయంలో మనజాతి అంధ కారంలో ఉంది. ఇందులోంచి వెలుగుచూపి, బయటకు

తీయగలిగినవారు కావాలి. ఈ పరిస్థితుల్లో ఎందరు తంద్రు లకూ, బిడ్డలకూ, విజ్ఞానజ్యోతులు ఎంత ఆవశ్యకమో వేరే చెప్పనవసరంలేదు. మీలాంటి మేధావంతులందర్నీ ఈ విష యంలో ఆహ్వానించవలసిన అవుసరం ఎంతైనా ఉంది. యుద్ధ వీరులూ, రాజకీయవేత్తలూ జాతియెడల ఎంత క్రూరంగా ప్రవర్తించటానికైనా వీలుంది.

మీ వ్యక్తిగతజీవితానికి సంబంధించిన కొన్ని చిన్న చిన్న సంఘటనలుకూడా ఎంతో ఉపయోగపడేవే. సాధా రణ విషయాల్లో జీవితాన్ని సరిదిద్దుకునే విధానమే యిప్పుడు మనకు కావాలి. ఇలాటి పరిస్థితులను మీరెలా ఎదుర్కొ న్నారో తెలుసుకోవాలనే ఉత్కంఠ ఎవరికయినా కలుగుతుంది.

కొందరు గుడ్డిగా స్వధర్మాన్ని ఆచరించుకుంటూ పోతారు. ఇతరులు పిచ్చిగా ప్రవర్తిస్తారు. కొందరు దుర్మా ర్గులు చేయటంలో నేర్పు చూపిస్తారు. కాని మీ జీవితం అలాటిది కాదు. మీ జీవితంలో - సిగ్గుపడవలసిన విషయ మేదీ లేదనుకుంటాను. ఒక మార్గంలేకుండా, ఎవరూ ఏ గమ్యాన్నీ జేరలేరు. మీరు ఒకమార్గాన్ని నిర్మించుకుని, అభివృద్ధిని సాధించారు. మరో విషయ మేమంటే, ఏ వ్యక్తి అయినా, ప్రపంచ రంగస్థలంపై కనిపించటానికి తనకాలం వచ్చేదాకా నిరీక్షించటంకద్దు. మొదట సంభవించిన విష యాన్ని అనుసరించే, తక్కిన విషయాలుకూడా రూపొందు తాయి. అన్నిటినీ సరిదిద్దుకొని, ఎవరయినా జీవితాన్ని రూపొందించుకోవాలి. మీజీవితంలోని చాలా సంఘటనలు-

సంతోశంగానే సాగిపోతూ మీకు తృప్తినీ, ఆనందాన్నీ యిచ్చాయిగాని, బాధనూ, పశ్చాత్తాపాన్నీ కాదు. అందుకనే మీ జీవితం ఆదర్శప్రాయమైంది. బీదతనంలో కూడా ఘనమైనజీవితాన్ని గడపటం అందరికీ సాధ్యంకాదు.

మీ జీవితచరిత్ర చాలా ఉపయుక్తమైన గ్రంథమౌతుందని నేను అభిప్రాయపడటానికి మరొక కారణం వివరిస్తాను. జాతి నాయకులమని చెప్పుకునే కొందరు ఖూనీకోరుల జీవితాలతో మీ జీవితాన్ని పోల్చుకుని, తారతమ్యాన్ని గ్రహించటానికి, ప్రజలకు అవకాశంకలుగుతుంది. మిమ్మల్ని అనుసరించి, మరికొందరు గొప్పవ్యక్తులుగూడా తమ తమ జీవితచరిత్రలు వ్రాయటానికి ముందుకురావచ్చు. లేదా ఒకరికి చెప్పతగ్గ అర్హతగల జీవితాన్ని గడపటానికి ప్రయత్నించవచ్చు. ప్లూటార్క్ రచన లన్నింటికంటే, మీ స్వీయచరిత్ర ఆ విధంగా ఎక్కువ ఉపయోగపడుతుంది.

నేను వ్యక్తిగతంగా మీ గుణగణాలనూ, మహోదాత్తమైన వ్యక్తిత్వాన్ని చూసి ఆశ్చర్యపోతుంటాను. ఆ వరవడిలో అందరినీ నడిపించవలసిన విధి మీకున్నది. అంతేగాక యిప్పటి విప్లవపరిస్థితులను గ్రంథస్తంచేయటం చాలా ముఖ్యమైన కర్తవ్యం. ఉదాత్తమైన మీ జీవితం మీ దేశంమీదనేగాక ఇంగ్లండుమీదనూ, ఇంకా యితర యూరోపియన్ రాజ్యాలమీదను ప్రభావం కలిగిఉంటుంది. ఇది శాశ్వతంగా గౌరవించబడుతుంది. మానవుడు దురాత్ముడు కాదని నిరూపించాలి. మంచి నాయకత్వం అతనిని మార్చగలదు. ఈ కార్యక్రమాన్ని తొందరగా చేతుల్లోకి

తీసుకోండి. మీరు మంచివారు. ఆ విషయాన్నే ప్రపంచాని చెప్పండి. మీరు చిన్ననాటినుంచి న్యాయాన్ని, స్వేచ్ఛనూ ప్రేమించారు. ఆ విషయాన్నే ప్రపంచానికి నిరూపించండి. మీ పదిహేడు సంవత్సరాల జీవితచరిత్రలో నేను గ్రహించింది అదే. ఇంగ్లీషువాళ్లు మిమ్మల్ని గౌరవించటమే కాదు; ప్రేమించేటట్లుకూడా చూడండి. మీ దేశస్థులను గురించి వారు ఆలోచిస్తున్నారంటే మీ దేశాన్ని గురించికూడా ఆలోచిస్తున్నారన్నమాట. అంతే కాదు. మీ దేశీయులు ఇంగ్లీషువారివద్ద నేర్చుకోవలసిన విషయాలన్నీ తెలుసుకుంటే వారిని బాగా అర్థంచేసుకుంటానికి ఎక్కువ వీలుంటుంది. మీ ప్రభావం క్రమంగా ఇంకా ముందుకుసాగనివ్వండి. మీ రాజకీయ సమస్యలన్నీ పరిష్కరించుకొన్నతరువాత యావత్ మానవజాతినిగూర్చి ఆలోచించండి. నేను మీ స్వీయచరిత్ర లోని ఏ భాగాన్ని చదవకపోయినా మీ వ్యక్తిత్వాన్ని బాగా ఎరిగిఉండటంచేత యీ నాలుగు మాటలు ఏదో వ్రాశాను. నేను ఎదురుచూస్తున్నందుకు మీ జీవితము, ఆర్టు ఆఫ్ వర్టుూ్య అనే గ్రంథము నన్ను సంతృప్తి పరుస్తుందనుకుంటాను. అవి నేను పైనచెప్పిన విషయాలన్నింటి లోను ఉపయోగించినట్లయితే ఇంకా ఆనందిస్తాను.

నా ప్రార్థన మీ రంగీకరించి మీ కర్తవ్యం మీరు నిర్వహిస్తారని ఆశిస్తున్నాను... వగైరా వగైరా...

బెన్జమిన్ వాగ్హాన్."

# పారిస్‌కు దగ్గరగా పాసీలో ప్రారంభింపబడిన జీవిత చరిత్ర (1784)

ఈ ఉత్తరాలువచ్చి కొంతకాలమయింది. వాటిలోని అంశాలను గురించి ఆలోచించటానికి నాకింతవరకూ తీరుబాటు లేకపోయింది. నేనుగనక ఇంటిదగ్గర ఉన్నట్లయితే దీన్ని ఇంకా బాగా వ్రాయగలిగేవాడ్ని. అనేక వివరాలు అక్కడ లభించేవి. కాని నేను ఎప్పుడు ఇంటికి వెళ్తానో తెలియదు. ఇప్పుడు కొంత విశ్రాంతి లభించింది. అందుచేత నాస్మృతిపథంలో తొంగిచూస్తున్న కొన్ని జ్ఞాపకాలను వెలికితీసి వ్రాయటానికి ప్రయత్నిస్తాను. నేను ఇంటికి వెళ్ళినట్లయితే అక్కడ దీన్ని సరిదిద్దుకుంటాను. నేను ఇదివరకు వ్రాసినదాని ప్రతి ఇప్పుడు నా దగ్గర లేదు. నేను ఫిలడల్ఫియాలో గ్రంథాలయాన్ని స్థాపించిన విషయం అందులో చెప్పానో లేదో నాకు గుర్తులేదు. ఇప్పుడది బాగా అభివృద్ధి చెందింది. దాన్ని గురించిన కథ కొంత ఇక్కడ వ్రాస్తాను. ఒకవేళ ఇంతకుముందే ఇది వ్రాయబడి ఉన్నట్లయితే దీన్ని వదిలిపెట్టవచ్చు. నేను పెన్సిల్వేనియాలో స్థిరపడినప్పుడు ఆ ప్రాంతాల్లో ఎక్కడా మంచిపుస్తకాలషాపు ఉండేదికాదు. న్యూయార్కులోను, ఫిలడాలోను, అచ్చువేసేవారే షాపులు కూడా పెట్టారు. అక్కడ తెల్లకాగితాలు, స్టాంపులు పుస్త

కొాలు మినహా మరేమీ దొరికేవికావు. సాహిత్యం అంటే శ్రద్ధాసక్తులు గల వారందరూ ఏ పుస్తకం కావల్సివచ్చినా ఇంగ్లండునుంచి తెప్పించుకోవల్సి వచ్చేది. మా జంటో క్లబ్‌లోని సభ్యులందరి దగ్గరా తలో కాస్తిని పుస్తకాలు ఉన్నాయ్. మేము అంతకుముందు తాత్కాలికంగా సమావేశ మవుతున్న గృహాన్ని వదిలి ఒకగది అద్దెకు తీసుకున్నాము. సభ్యులందరి పుస్తకాలు అక్కడ సమీకరించాలని నేను సూచించాను. మేము జరుపుకునే చర్చల సందర్భంలో వాటి అవుసరం ఎంతైనా ఉంది. అలాచేసినప్పుడు ఆ ప్రయోజనం అందరికీ లభిస్తుంది. ఎవరికి కావలసిన పుస్తకాన్ని వారు యింటికి తీసుకుపోయి చదువుకోవచ్చు. నా సూచన ఆమోదింపబడింది. ఆ పద్ధతి కొంతకాలం బాగానే పని చేసింది.

ఈ చిన్నప్రయత్నంవల్ల కలిగిన ప్రయోజనాన్ని పురస్కరించుకొని బహిరంగంగా అందరికీ ఉపయోగించే ఒక పెద్ద గ్రంథాలయాన్ని స్థాపించాలనే అభిప్రాయం నాకు కలిగింది.అందుకు కావలసిన పథకాలను,నియమాలను తయారు చేశాను. వాటిని రూపొందించటంలో మిస్టర్ చార్లెస్-బ్రాక్‌డెన్ కొంత సాయంచేశాడు. చందాదార్లు మొట్ట మొదట కొంత పెద్దమొత్తాన్ని, ఆ తరువాత సాలీనా కొంత చిన్నమొత్తాన్ని చెల్లించాలని నిర్ణయింప బడింది. ఈ డబ్బుతో యింకా పుస్తకాలను కొనటానికి వీలుపడుతుంది. ఆ కాలంలో ఫిలడల్ఫియాలో చదవాలనే ఆసక్తి గలవాళ్ళు తక్కువ. వారయినను భాగ్యవంతులు కారు. అందుచేత

మొదట యాభై మంది చందాదారులు మాత్రమే చేరారు. అప్పటికే చాలా కష్టమైంది. ఈ స్వల్ప మొత్తంతో మేం గ్రంథాలయాన్ని ప్రారంభించాము. పుస్తకాలను దిగుమతి చేసి ఒక శుభముహూర్తాన గ్రంథాలయాన్ని ప్రారంభించాము. వాగ్దానపత్రంమీద మాత్రమే పుస్తకాలీయబడినవి సకాలంలో గనక వాటిని తిరిగి ఈయకపోతే రెట్టింపు మూల్యాన్ని చెల్లించాలని నిర్ణయింపబడింది. ఈసంస్థ ఎంత ప్రయోజనకరమయిందో అందరూ తెల్సుకున్నారు. ఇతర రాష్ట్రాల్లోనూ మమ్మల్ని అనుసరించి వారుగూడా గ్రంథాలయాలను స్థాపించుకుంటున్నారు. అప్పుడు దేశంలో మరో రకమైన వినోదాలు అంతగా లేకపోవటంచేత పుస్తకపఠనం తొందరగా వృద్ధిచెందింది. అది ఒక ఫాషన్‌గా కూడా మారింది. కొద్ది సంవత్సరాల్లో ఇతర దేశాల్లోని వారికంటె అదే తరగతికి చెందిన మా దేశప్రజలు ఎక్కువ అభివృద్ధిని సాధించారు. నేను చందాలకోసం తిరుగుతున్నప్పుడు అనేకమంది అనేక తరహాలుగా అభ్యంతరాలు చెప్పి అడ్డు తగులుతూ వచ్చారు. పదిమందికి సంబంధించిన యిలాంటి కార్యక్రమాన్ని నెత్తిన వేసుకొని తిరగడం అంత మంచిది కాదనే అభిప్రాయం నాకు కలుగుతూఉండేది. అటువంటి పనుల్లో ఒకరికి పేరు రావడం మరొకడు సహించడు. అందుచేత వారు చేయూతనివ్వటానికి కూడా ముందుకురారు. అందుచేత నేను సాధ్యమైనంతవరకు అలాటి పనులకు దూరంగా వెళ్తున్నాను. ఈ విధంగా నా పరిస్థితి కొంత బాగుపడింది. ఆ తరువాత కూడా అలాంటి పరిస్థితుల్లో నేను

ఇదే విధానాన్ని అవలంబించాను. అందువల్లనే అనేక విష యాల్లో తరచుగా నాకు విజయం లభించింది. అప్పటికప్పుడు నువ్వు త్యాగంచేసే తృణప్రాయమైనఆడంబరంవల్ల ఆ తరు వాత బాగా మేలుకలుగుతుంది. ఒక మంచిపని జరిగినప్పుడు దాని గౌరవము ఎవరికి దక్కాలో తెలియక పోవచ్చు. అప్పుడు ఒక ఆడంబరుడు ఆ మంచికి తానే కర్తగా బయట పడవచ్చు. అప్పుడు తక్కినవారికి అతనిపై అసూయ కలుగు తుంది. వారు కృషిచేసి నిజమైన గౌరవం ఎవరికి దక్కాలో వారికి దక్కించి ఘనంగా గౌరవిస్తారు.

ఈ గ్రంథాలయంవల్ల నాకెంతో ఉపయోగం కలి గింది. రోజూ ఒకటి రెండు గంటలు నేనక్కడ గడిపేవాణ్ణి. నాకు ఇతర విధమైన ఆటపాటలమీద ఎక్కువ శ్రద్ధ లేదు. నా వ్యాపారంలో ఇంకా నేను పూర్తిగా శ్రమించి పనిచేస్తు న్నాను. నా పరిస్థితులు రోజురోజుకూ బాగుపడుతున్నాయ్. నేను చాలా పొదుపుగానే ఉంటున్నాను. "కష్టపడి నీ కర్త వ్యాన్ని నువ్వు నిర్వహించినప్పుడు రాజులముందు నిలవగల అర్హత నీకు లభిస్తుంది. నీచులముందు కాదు" అనే సాల్ మన్ యొక్క ప్రవచనాన్ని నా చిన్నతనంలో నా తండ్రి పదే పదే గుర్తు చేసేవాడు. జీవితంలో అభివృద్ధిని, ధనాన్ని గడించటానికి కష్టించి పనిచేయటం ముఖ్యమైున మార్గ మని నేను తెలుసుకున్నాను. ఇది నన్ను ప్రోత్సహించింది. ఆతరవాత అయిదుగురు రాజుల ముందు నిలబడే అర్హత నాకు లభించింది. డెన్మార్కు రాజుతో కలసి విందార గించే గౌరవం కూడా నాకు లభించింది.

"నీ అదృష్టానికి కారణం నీ భార్య" అంటూ ఇంగ్లీషులో ఒక సామెత ఉంది. నావలే శ్రమించి పని చేసే సహధర్మచారిణి నాకు లభించింది. నా వ్యాపారంలో చేదోడు వాదోడుగా ఉంటూ ఆమె యెంతో సాయం చేసింది. నేను వేరే పనిమనిషిని పెట్టుకోలేదు. విలువయిన ఫర్నిచరు కొనుక్కోలేదు. నేను రొట్టె, పాలు మాత్రమే తీసుకునేవాణ్ణి. కాని యింత నియమం పెట్టుకున్నా విలాసజీవితం కుటుంబాల్లో ఎలా ప్రవేశిస్తుందో చూడండి! ఒకరోజు ఉదయం నేను భోజనానికి వెళ్ళాను. నా ముందు వెండి చెంచా కనిపించింది. నా కోసమని ఎంతో డబ్బుపెట్టి కొని తెచ్చింది, నా భార్య. ఇరుగు పొరుగు వారివలే తన భర్త కూడా అందుకు అర్హుడని ఆమె భావించిందట. క్రమంగా నాభాగ్యం పెరిగినకొద్దీ కొన్ని వందల పౌనుల విలువగల సామాగ్రి మా ఇంట్లో జేరింది. కొన్ని మత సిద్ధాంతాల్లో నాకు నమ్మకం లేదు. నలుగురితో కలసి ప్రార్థన చేయటానికి ఆదివారాల్లో నేను ఎన్నడూ పోలేదు. ఆదివారం అంతా చదువుకుంటానికే వినియోగించేవాణ్ణి. కాని కొన్ని సిద్ధాంతాలమీద నాకెప్పుడూ గౌరవముంది. భగవంతుని ఆస్తికత్వముపై నాకెన్నడూ అనుమానం లేదు. ఆయన ప్రపంచాన్ని సృష్టించి రక్షిస్తున్నాడనే విషయంలో అనుమానం లేదు. పాపం శిక్షింప బడుతుందని, పుణ్యం రక్షింప బడుతుందనీ ఆత్మ శాశ్వతమైనదనీ, నేను నమ్ముతాను. ప్రతి మతానికివి ప్రాథమిక సూత్రాలని నా నమ్మకం. అందు చేతనే తరతమ భేదాలున్నప్పటికీ ప్రపంచంలోని మతాలన్నిటినీ నేను గౌర

విస్తాను. అందులో కొన్ని మనలోని నైతిక శక్తులను వృద్ధి చేయటానికి గాక మానవ జాతిని ముక్కలు ముక్కలుగా విడదీసి ఒకరిపై ఒకరికి ద్వేషభావాన్ని కలుగ జేయడానికే ఉపయోగిస్తున్నాయ్. కాని బాగా చెడ్డ విషయం వల్ల కూడా కొన్ని మంచి ఫలితాలు కలుగుతూ ఉండటం చేత నేను అన్ని మతాలను గౌరవిస్తున్నాను.

నేను బహిరంగ ప్రార్థనలకు హాజరు కాకపోయినప్పటికీ సక్రమంగా నిర్వహింపబడినప్పుడు వాటివల్ల చాలా ప్రయోజనం కలుగుతుందని నా అభిప్రాయం. నేను ప్రతి సంవత్సరం మత బోధకునికి నా చందా మాత్రం చెల్లించే వాణ్ణి. ఆయన బాగానే బోధించ గలడు గాని, ఎక్కువగా విసుగు కలిగించేవాడు. ఉత్తమ పౌరులను తయారు చేయటంకంటె తన సిద్ధాంతాలను వారిపై రుద్దటమే ఆదర్శంగా పెట్టుకొన్నట్లు కనిపించాడు.

ఒకరోజున ఫిలిప్పైన్స్‌లో నాలుగో అధ్యాయాన్ని గురించి ప్రసంగించాడు.

"సోదరులారా! ఏ వస్తువైనా. ఎంత యదార్థంగా, నమ్మకంగా, అందంగా, స్వచ్ఛంగా కనిపించినా, అందులో ఏదైనా నిజమైన సుగుణము ఉన్నప్పుడే - దాన్ని గురించి ఆలోచించాలి."

ఇటువంటి శృతివాక్యాల్లో ఎంతో అంత నైతిక ప్రబోధం లేకుండా ఉండదు. ఆయనమాత్రం ఎప్పుడూ అయిదు విషయాలుమాత్రం నొక్కిచెప్పేవాడు.

(1) విశ్రాంతిదినం పవిత్రంగా గడపటం.

(2) పవిత్ర శృతులను శ్రద్ధగా చదవటం.

(3) బహిరంగ ప్రార్థనా సమావేశాలకు తప్పనిసరిగా హాజరుకావటం.

(4) సంస్కారంలో భాగస్వాములు కావటం.

(5) భగవంతుని ప్రతినిధులపై తగినంత గౌరవం చూపెట్టటం.

ఇవన్నీ మంచి విషయాలుకావచ్చు. కాని శృతుల నుండి నేను ఆక్షేపించిన మంచివిషయాలుమాత్రం కాదు. ఏమైనా, ఆ తర్వాత నేను ఆయనఉపన్యాసాలకు వెళ్ళలేదు. కొన్ని సంవత్సరాలక్రితం, నేను నాకు ప్రత్యేకంగా ఒకచిన్న దైనప్రార్థన తయారుచేసుకున్నాను. "ఆర్టికల్స్ ఆఫ్ బిలీఫ్ అండ్ ఏక్ట్స్ ఆఫ్ రెలిజియన్" అని దానికి పేరుపెట్టాను.

ఇప్పుడు దీన్నే నేను మళ్ళీ ఉపయోగించటం ప్రారంభించాను. బహిరంగ ప్రార్థనలకు వెళ్ళటం పూర్తిగా మాని వేశాను. ఈనా ప్రవర్తన నిందార్హమైనదే కావచ్చు. కాని ఇది వ్రాయటంలో నాలక్ష్యం జరిగిన యదార్థాన్ని చెప్పటమే.

నైతికంగా పరిపూర్ణతసాధించటానికి ఇదే ప్రయత్నం. ఏ పరిస్థితుల్లోనూ, ఎలాటి తప్పుచేయకుండా జీవించాలని కోరుకున్నాను. స్వభావం, సంఘం, ఆచారాలూ – నేను సర్వదా సన్మార్గాన్నే అనుసరించకుండా, ఎందుకుండాలో నాకర్థంకాలేదు. కాని అనతికాలంలోనే – నేను అనుకున్న దానికంటె క్లిష్టమైన భారాన్ని నెత్తిన వేసుకున్నానని

గ్రహించాను. ఒకతప్పు చేయకుండా తప్పించుకోవాలని నేను తీవ్రప్రయత్నం చేస్తుండగా, మరొక తప్పు కనిపించేది. సహజ స్వభావం, సాంఘిక ఆచారాలు నన్ను వెనక్కులాగేవి. అంచేత కేవలం సన్మార్గంలో జీవించాలని అనుకోవటమే కాదు, మనని ఆ మార్గంనుంచి మళ్ళిస్తున్న అపరాధాలను నిర్మూలించి తీరాలి. అప్పుడుగాని నిశ్చలమైన సక్రమప్రవర్తన మనకు అలవడదు. ఇందుకోసం నేను ఈ క్రింది పద్ధతిని అవలంబించాను. నేను చదివిన నైతిక గ్రంథాల్లో అనేకమంది, అనేకరకాల నైతిక సూత్రాలను ప్రవచించారు. కొందరు ఆహారం తీసుకోవటంలో మాత్రమే మితంగా ఉండాలని సూచిస్తే, మరికొందరు అన్నిరకాల సౌఖ్యాలకూ, భోగాలకూ, లోభాలకూ, ఆశలకూ కూడా హద్దుల్ని నిర్ణయిస్తారు. అంచేత అనేకభావాలుకల కొద్ది మాటలను ఏరాను. జీవితంలో అవుసరమని భావించిన సుగుణాలను పదమూడింటిని నేను నిర్ణయించాను. ఇందువల్ల కొంత స్పష్టంగా విషయ పరిగ్రహణం జరుగుతుంది. ప్రతి దానికి - నేను ఉద్దేశించిన పూర్తి అర్థాన్నిచ్చే నిర్వచనాన్ని క్రింద పొందుపరిచాను.

ఆ సుగుణాలేమిటంటే:—

1. మితాహారం:- మందం చేసేలా తినబోకు. మత్తెక్కించేలా త్రాగబోకు.

2. నిశ్శబ్దత:- నీకుగాని, మరొకరికిగాని, ప్రయోజనం లేనిమాటలు మాట్లాడబోకు- నిరర్థక సంభాషణ నిర్జించు.

3. క్రమము:- నీ వస్తువులన్నింటికీ, తగిన స్థానం సమకూర్చుకో. నీ పనులన్నింటికీ తగినంతకాలం వినియోగించు.

4. నిర్ణయము:- నీ కర్తవ్యాన్ని నిర్వహించాలని నిర్ణయించుకో. నీవు నిర్ణయించుకున్న దాన్ని తప్పకుండా నిర్వహించు.

5. పొదుపు:-ఇతరులకుగాని, నీకుగాని వినియోగించని దానికి ఏమీ కర్చుపెట్టకు. దేన్నీ వ్యర్థం చేయకు.

6. శ్రమ:- కాలాన్ని వ్యర్థంచేయకు. ప్రయోజనకరమైన ఏదోఒకపనిలో అనవరతం కాలాన్ని గడుపు. అనవుసరమైన కార్యక్రమాలు రద్దుచేసుకో.

7. నమ్మకము:- ఎవరినీ మోసంచెయ్యకు. న్యాయంగా నిష్కపటంగా ఆలోచించు. మాట్లాడవలసివస్తే, అలాగే మాట్లాడు.

8. న్యాయము:- ఎవరినీ గాయపరచి తప్పుచెయ్యకు. ఒకరికిమేలు కలిగించే నీ కర్తవ్యాన్ని అశ్రద్ధచెయ్యకు.

9. మితము:-ఏ విషయంలోనూ, అతిగా ఉండకు. తగినంతవరకూ అవమానకరమైన గాయాలను సహించు.

10. శుభ్రత:- అలవాట్లలో గానీ, దుస్తుల్లో గాని, శరీరంలోగానీ, ఏ మలినాన్నీ సహించకు.

11. నిదానము:- సాధారణమైనవీ, మామూలువీ, అయినటువంటి చిన్నచిన్న విషయాలకు తల్లక్రిందులైపోకు.

12. పరిశుద్ధత్వం:-ఆరోగ్యానికి అవసరమైనంతవరకూ,

మితముగాను సంసారసుఖమును అనుభవించు. నీకు గాని మరొకరికిగాని, నష్టం కలిగేటట్లు ప్రవర్తించకు.

13. వినయము:- జీసెస్‌నూ, సోక్రటీస్‌నూ అనుకరించు.

ఈ సుగుణాలన్నీ అలవరచుకోవాలని నా అభిప్రాయం. అన్నీ ఒక్కసారే ప్రయత్నించి, విఫలమవటం కంటె, ఒక టొకటే క్రమంగా అనుకరించ దల్చుకున్నాను. ఒకటి అలవరచుకొని, అందులో పరిపూర్ణత సాధించాక గాని రెండవ దానికి పోదల్చుకోలేదు. అంచేత పై క్రమంలో వాటిని సిద్ధపరిచాను. మితాహారము మొదటిఅంశం. ఇది మనస్సును నిర్మలంగా ఉంచేది. ఆ తరువాత అంశం నిశ్శబ్దత. ఈ నియమాన్ని అనుసరిస్తూ కొంత విజ్ఞానార్జనకూడా చేయదల్చుకున్నాను. ఎప్పుడూ మాట్లాడటంవల్ల కంటె, వింటూ ఉండటం వల్లనే విజ్ఞానాభివృద్ధి జరుగుతుంది. ఇంతవరకూ అతిగా మాట్లాడటం, చమత్కారాలనూ, చలోక్తులనూ ఎక్కువగా విసురుతూ మాట్లాడే అలవాటును తగ్గించుకున్నాను. అలాటి అలవాటు సోదిరాయుళ్ళతో కలిసిఉన్నప్పుడు మాత్రమే పనికొస్తుంది. అంచేత నిశ్శబ్దతకు రెండవ స్థానం యిచ్చాను. ఈ అలవాటుతో పాటు క్రమబద్ధమైన ప్రవర్తనకు ప్రయత్నించటంవల్ల-నా పనులకూ, చదువుకూ కావలసినంత సమయం లభించింది. నిర్ణయశక్తి ఒక్కసారి నా కలవాటయితే, తక్కిన సుగుణాలన్నింటినీ, సాధించటం యింకా సుకరమౌతుంది. పొదుపుగా ఉండటంచేత, నా ఋణభారం తీరిపోయి, ఒకరిమీద ఆధారపడక స్వేచ్ఛగా,

న్యాయంగా జీవించటానికి అవకాశం కల్గుతుంది. రోజూ మన ప్రవర్తన ఎలా ఉందని ఒకసారి ఆత్మపరీక్ష చేసు

| మితాహారము | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| మందం చేసేలా తినకు<br>మత్తెక్కించేలా త్రాగకు | | | | | | | |
| | ఆది | సోమ | మం | బుధ | గురు | శుక్ర | శని |
| మితాహారం | | | | | | | |
| నిశ్శబ్దత | | | | | | | |
| క్రమము | | | | | | | |
| నిర్ణయము | | | | | | | |
| పొదుపు | | | | | | | |
| శ్రమ | | | | | | | |
| నమ్మకం | | | | | | | |
| న్యాయం | | | | | | | |
| మితము | | | | | | | |
| శుభ్రత | | | | | | | |
| నిదానము | | | | | | | |
| పరిశుద్ధత్వం | | | | | | | |
| వినయం | | | | | | | |

కోవటం మంచిదని పైథాగరీస్ ప్రవచించాడు. ఆయనతో ఏకీభవిస్తూ, అలాటి ఆత్మపరీక్ష చేసుకుంటానికి ఈ పై మార్గాని అనుసరించాను.

నేను ఒకపుస్తకాన్ని కుట్టి అందులో ప్రతిఒక సుగుణానికీ, ఒకపుట ప్రత్యేకించాను.

నిలువుగా ఎర్రసిరాతో రోజుకొక్క గడిచొప్పున వారంరోజులకూ ఏడుగళ్ళు గీశాను. అడ్డంగా ఒకో సుగుణానికి, ఒకో బిరిచొప్పున పదమూడు అడ్డగీతలు గీశాను. ఆ రోజున ఆ సుగుణాన్ని, నేను ఆచరించిందీ లేనిదీ, ఎంతవర కాచరించిందీ, తెలిసేవిధంగా, ఎదురుగా ఆ గడుల్లో నల్లసిరాతో చుక్కలు పెట్టేవాణ్ణి.

ఒకో సుగుణానికి ఒకవారం చొప్పున వరుసగా కేటాయించాలని నిర్ణయించుకున్నాను. అంచేత తక్కిన సుగుణాలు, వాటిమార్గంలో అవి అనుష్ఠించబడగా, మొదటి వారంలో మితాహారానికి నేను పూర్తి ప్రాముఖ్యత యిచ్చాను. అంచేత మితాహారానికి ఎదురుగాఉన్న ఏడు బిరులూ, నల్లటి చుక్కలతో నిండి, ఆ సుగుణాన్ని, ఆ వారంనేను విజయవంతంగా సాధించినట్లు నిరూపణ జరిగితే, రెండవ సుగుణానికి, వెళ్ళేవాణ్ణి. తరువాతవారంలో రెండో బిరికూడా, ఖాళీలేకుండా చుక్కలతో నిండిపోయింది. ఆ విధంగా చివరిదాకా వెళ్ళాను. పదమూడువారాలు పట్టింది. సంవత్సరానికి, అలా నాలుగు పరివృతాలు జరిగినయ్. ఏ ఆసామీ తన తోటలోని కలుపుమొక్కలన్నింటినీ, ఒక్కసారిగా పీకివెయ్యటానికి వీలుపడదు. అది అతని శక్తికిమించిన

విషయం. క్రమంగా ఒకొక్క మొక్కనూ, నాశనం చేసుకుంటూ వస్తాడు. అదే విధంగా నేనుకూడా, నాలోని చెడ్డ గుణాలన్నింటినీ, ఒకటొకటే క్రమంగా వర్జించుకుంటూ వస్తున్నాను. నా ఆత్మపరీక్షా పత్రాలనిండా నా శీలం అభివృద్ధి చెందుతున్నట్లు సూచించే నల్లటి చుక్కలే కనిపించటం చేత నాకెంతో ఉత్సాహం కలిగేది. వివేకానికంతటికూ, భగవంతుడే మూలకందమనుకుంటాను. అంచేత దాన్ని పొందటానికి, ఆయనయొక్క సహాయాన్ని అర్థించటం ఎంతో అవసరం. ఈ గమ్యాన్ని జేరటానికి ఒక ప్రార్థన తయారుచేసుకున్నాను. దాన్ని నా దినకృత్యంలో ఒక భాగంగా ఉంచుకున్నాను.

"ఓ శక్తివంతమైన సౌజన్యమా! తండ్రీ!! దయామయా! రక్షకుడా! పరమ సత్యమైన నా జీవితగమ్యాన్ని జేరటానికి నాకు వివేకాన్ని ప్రసాదించు. వివేకవంతమైన మార్గాన జీవించగల స్వయంనిర్ణయశక్తిని నాకు ప్రసాదించు. నీ బిడ్డలందరికీ నా కృతజ్ఞతలు అందజెయ్యి. వారు నాకు చేస్తున్న మేలుకు నేను యివ్వగలిగిన ప్రతిఫలంఅదే."

అప్పుడప్పుడు థామ్సన్ పద్యంలోని ప్రార్థన్నుకూడా నేను తీసుకునేవాణ్ణి.

"మహాజ్ఞానానికీ, మానవజీవితాలకూ తండ్రీ!
సర్వశక్తి స్వరూపుడవైన సౌజన్యరాశీ!
ఏది ధర్మపథమో నాకు వెలుగుచూపు
ఆడంబరం, వినాశం, దుర్మార్గం, నా దరి
జేరనీయక రక్షించు—

నా ఆత్మను విజ్ఞానంతో - సుగుణ
సంపత్తితో శాంతితో నించు—
పవిత్రమైన, శాశ్వతానందాన్ని కూర్చు—"

నేను ఆచరించదలుచుకున్న సుగుణాలలో 'క్రమబద్ధమైన జీవితం' ఒకటి. నేను నిర్వహించవలసిన పనులన్నింటికీ, తగినంత కాలాన్ని కేటాయించటం దాని ఉద్దేశం. ఈ పని ఎంతవరకు జరుగుతున్నదో పరీక్షించటానికి, నా చిన్నపుస్తకంలో క్రింది పథకాన్ని తయారుచేశాను.

| | | |
|---|---|---|
| ఉదయము | 5 | మేల్కొనుట, కాలకృత్యాలు, ప్రార్థన. |
| ప్రశ్న:- ఈ రోజు నేను చేయవలసిన మంచి ఏమిటి ? | 6 | రోజూ చేయవలసిన పనులు నిర్ణయించుకుంటూ- పఠనం |
| | 7 | అల్పాహారం. |
| | 8 | |
| | 9 | పని. |
| | 10 | |
| మధ్యాహ్నం | 11 | |
| | 12 | లెక్కలుచూసుకొనుట, |
| | 1 | భోజనం. |
| | 2 | |
| | 3 | |
| | 4 | పని. |
| | 5 | |

| | | |
|---|---|---|
| సాయంత్రం | 6 | సర్దుకొనుట - భోజనం. |
| | 7 | సంగీతం - లోక సంభాషణ, |
| | 8 | దినకార్యక్రమ పరీక్ష. |
| | 9 | |
| | 10 | |
| | 11 | |
| రాత్రి | 12 | నిద్ర |
| | 1 | |
| | 2 | |
| | 3 | |
| | 4 | |

నిత్యకృత్యంలో ఆత్మపరీక్ష చేసుకోవాలనే ప్రయత్నంతో ఈ పథకాన్ని తయారుచేశాను. కొంతకాలం దీన్ని అమలుజరిపాను. నేను అనుకున్నదానికంటె ఎక్కువ తప్పులు నాలో కనిపించటం చూసి ఆశ్చర్యపోయాను. కాని ఆ తప్పులు రోజురోజుకూ తగ్గిపోవటం చూసి సంతృప్తిచెందుతున్నాను.

ఈ దినచర్య పుస్తకాలని, ప్రతిసారి కట్టుకోవటం, రూళ్ళు వేసుకోవటం విసుగనిపించి, ఒక దంతపు ఆకుమీద ఈ టేబిల్ వేసుకున్నాను. దానిమీద పెన్సలుతో గుర్తులు పెట్టటం, నిండిపోగానే చెరిపివేయటం- జరిగేది. ఇది చాలా తేలికగా ఉంది.

ఆ తరువాత, ఒక టేబిల్ నింపటానికి రమారమి సంవత్సరం పట్టేది. ఆ తర్వాత కొన్ని సంవత్సరాలు పడుతూ ఉండేది. చివరకి దాన్ని పూర్తిగా వదిలివేశాను. తరచుగా విదేశాలకు పోతూ, సముద్ర ప్రయాణాలు చేయవలసిరావటం, అనేక విషయాలు జీవితంలో ప్రవేశించటం – వీటివల్ల అది సాగలేదు. కాని నా చిన్న పుస్తకాన్ని మాత్రం, సర్వదా వెంట వుంచుకునేవాణ్ణి.

క్రమబద్ధమైన జీవితాన్నిగురించి నేను ఏర్పరచుకున్న నియమం నాకు చాలాఇబ్బంది కలిగించేది. రోజూ నిర్ణీత వేళల్లో మాత్రమే ఉద్యోగం చేసుకుపోయేవాళ్ళకు అది సాగుతుంది కాని, వ్యాపారస్తునకు కష్టంగానే ఉంటుంది. ఎవరైనా, ఎప్పుడైనా, పనికోసం ప్రెస్‌కు రావచ్చు.

వస్తువుల్ని క్రమబద్ధంగా నిర్ణీతమైన ప్రదేశాల్లో ఉంచుకోవటం కూడా నాకు కష్టంగానేఉంది. అంతకుముందు నా కలాటి పద్ధతి అలవాటులేదు. అదీగాక నాకు బాగా జ్ఞాపకశక్తి ఉండటంచేత, ఈ పద్ధతి అవలంబించకపోయినా ఇబ్బంది కలగటంలేదు. అంచేత ఈ అంశం అమలులో పెట్టటం నాకు కొంచెం కష్టమనిపించింది. అప్పుడప్పుడూ ఇందులోనే పొరపాట్లు చాలా దొర్లుతూండేవి. చివరకు ఈ విషయంలో నా లోపాన్ని అంగీకరిస్తూ, ఈ నియమాన్నే వర్జించాలనన్నంత విసుగుపుట్టింది. నిజానికి ఈ క్రమపద్ధతిని అనుసరించటం నాచేత కాలేదు. నేనిప్పుడు పెద్దవాణ్ణై పోయాను. నా జ్ఞాపకశక్తి సీరసించింది. ఉత్తమ శీలం విషయంలో నేను ఎన్నడూ పరిపూర్ణత సాధించలేదని నాకు

తెలుసు. కాని దాన్ని సాధించాలనిమాత్రం చాలాతీవ్రంగా ప్రయత్నించాను. ఆ ప్రయత్నం చేయటంవల్లనే గమ్యాన్ని చేరకపోయినా, మెరుగైన జీవితాన్ని గడపగలిగాను. ఆ ప్రయత్నమే చేయకపోతే, నా జీవితం చాలా పాడై ఉండేది. దస్తూరీ బాగుచేసుకోవటం కోసం కాపీలు వ్రాస్తాము. అచ్చు అక్షరంలా వ్రాయాలనేగదా వారి ప్రయత్నం? నిజానికి అలా వ్రాయటం ఎవరికీ సాధ్యంకాదు. కాని, అలా వ్రాయాలని ప్రయత్నిస్తూ కొన్నికాపీలు వ్రాయటంవల్ల నిస్సంశయంగా దస్తూరీ మెరుగుపడుతుంది. ఈ చిన్నిప్రయత్నంతో భగవానుని ఆశీఃప్రభావం కలియగా, తమ పూర్వీకుడొకడు, సుఖప్రదమైన జీవితాన్ని గడిపాడని-భవిష్యత్తరాలవారు తెలుసుకుంటే అంతకంటే ఏం కావాలి? భవిష్యత్తు భగవంతుని చేతుల్లో ఉంది. కాని గతజీవితంలోని సుఖానుభూతుల్ని జ్ఞప్తికి తెచ్చుకోవటం వల్లనే, జీవితంలో సంభవించే అనేక కష్టనష్టాలను, నిర్లిప్తతా భావంతో ఎదుర్కోగలం.

మితాహారం వలన మానవుడికి సుదీర్ఘమై ఆరోగ్యమైన జీవితం లభిస్తుంది. కష్టించి పనిచేస్తూ, పొదుపు చేసుకోవటం వలన, జీవితపు తొలిరోజుల్లో ఎదురయే చిక్కులు విడి, భవిష్యత్తులో అదృష్టాన్ని నిర్మించుకుంటానికి అవకాశం ఏర్పడుతుంది. దీనివల్లనే, మంచిపేరుకూడా వస్తుంది. ఉత్తమపౌరుడిగా జీవించే అవకాశం ఏర్పడుతుంది.

నమ్మకము - న్యాయము - ఈ సుగుణాలవల్ల, దేశం ఎడల నీ కర్తవ్యం తెలుస్తుంది. తొందరపాటు లేకుండా నవ్వుతూ మాట్లాడటంచేత, నీతోటి వారిలో నీకు గౌరవం

హెచ్చుతుంది. అంచేత నీ తరువాతి తరాలవారు ఈ ఉదాహరణను అనుసరించి ఫలితాన్ని పొందవచ్చు.

నా పద్ధతి అసలు మత ప్రసక్తి లేకుండా లేదు. కాని, ఏ ప్రత్యేకమతానికీ, లేదా, వర్గానికీ, చెందిన సిద్ధాంతాలు మాత్రం నాకు లేవు. నేను ఉద్దేశపూర్వకంగా వాటిని వర్జించాను. నా పద్ధతి నాకు చక్కటి ఫలితాల నిచ్చింది. అంచేత అన్నిమతాల వారికి ఇది ఉపకరిస్తుందనే నమ్ముతున్నాను. ఎప్పుడో ఒకప్పుడు దీన్ని బహిరంగంగా ప్రకటించాలను కుంటున్నాను. గనుక, ఎవరికీ కష్టంకలిగించకుండా జాగ్రత్త తీసుకున్నాను.

నేను ఈ సుగుణాల్లో ప్రతిఒక్కదాన్నిగురించీ కొంత వ్యాఖ్యానాని వ్రాయాలనుకుంటున్నాను. ఒక సుగుణంవల్ల లాభమేమిటో-దాన్ని అనుష్ఠించటంలోగల సాధక బాధకాలేమిటో - వివరంగా వ్రాసి దానికి "ఆర్టు ఆఫ్ వర్ట్యూ" అని పేరు పెట్టదల్చుకున్నాను. సుగుణాలను సంతరించుకోవటమెలాగో, ఇది చెపుతూందిగనుక, ఈ పేరే తగిందను కుంటా. కేవలం మంచి ఇదని చెప్పటమే కాకుండా, ఆ మంచిని ఎలాసాధించాలోకూడా చెప్పటం అవుసరం. కాని, ఈ వ్యాఖ్యానాన్ని వ్రాసి ప్రచురించాలనే, నా ఉద్దేశం ఎన్నడూ కార్యరూపం ధరించలేదు. అప్పుడప్పుడు నాకు వచ్చే ఆలోచనలను రాస్తూనేఉంటాను. దాన్ని ఆనక ఉపయోగించుకోవాలనుకుంటాను. వాటిలో కొన్ని యింకా నాదగ్గరున్నాయి. తొలిజీవితంలో నా వ్యక్తిగత వ్యాపారానికి సంబంధించిన పనులూ, ఆ తర్వాత బహిరంగ కార్య

కలాపాలూ, ఈ పని చెయ్యకుండా ఇంతవరకూ వాయిదా వేయించినయ్. ఇది వ్రాయటానికి నాలోని శక్తి యుక్తులన్నీ పూర్తిగా కేంద్రీకరించాలి. అనేక ఇతర వ్యాపకాల వల్ల నాకది సాధ్యంకాలేదు. అంచేత ఆ పని యింతవరకూ అసంపూర్ణంగానే మిగిలిపోయింది.

కొన్ని పనులు నిషేధింపబడటంచేత చెడ్డవి కాలేదు. చెడ్డవి కావటంచేత నిషేధింపబడ్డాయి - అందులో ఈ సిద్ధాంతాన్నే నేను ఉల్లేఖించ దల్చుకున్నాను. మానవుడు ఇహలోక సుఖాలను అనుభవించటానికిగూడా, కొన్ని సుగుణాలను అలవరచుకోవాలి.

మొదట నా పట్టీలో పన్నెండు సుగుణాలుమాత్రమే ఉండేవి. కాని ఒక క్వేకరు స్నేహితుడు, నాకు కొంచెం గర్వ ముందని చెప్పాడు. అది నా మాటల్లోనే ప్రతిబింబిస్తుందట. ఈ లోపాన్ని సరిదిద్దుకుంటానికి నేను ప్రయత్నించాను. అంచేత నా జాబితాకు వినయాన్నిగూడా జేర్చాను. ఈ సుగుణంవల్ల నాకేవో గొప్ప విజయాలు కల్గాయని చెప్పలేనుగాని, కొంత ఉపయోగం నిశ్చయంగా కల్గింది. ఇతరుల అభిప్రాయాలను ప్రత్యక్షంగా ఖండించటం నేను మానివేశాను. నా అభిప్రాయాన్ని సౌమ్యంగా నమ్మింపజేయటానికి ప్రయత్నించేవాణ్ణి - 'నిశ్చయంగా'- 'నిస్సందేహంగా' - మొదలైన మాటలు తగ్గించి 'నేను ఊహిస్తున్నాను' - 'ఇప్పటి పరిస్థితుల్లో అది అలా కనిపిస్తూన్నది'-అనే మాటలు వాటి బదులుగా ఉపయోగిస్తున్నాను. ఎదుటివా రెవరైనా ఒక పొరపాటు మాట చెప్పినప్పుడు దాన్ని వెంటనే ఖండిం

చటం వల్ల ఒక రకమైన సంతృప్తి కలుగుతుంది. కాని అది మంచి అలవాటు కాదు. అంచేత ఎదుటివాని మాటలో కొంత యదార్థముందని, కాని అప్పటి పరిస్థితుల్లో మాత్రం అది సరిపోదని సౌమ్యంగా చెప్పటం నేర్చుకున్నాను. నా ప్రవర్తనలో కలిగిన ఈ మార్పువల్ల నాకు చాలా లాభం కనిపించింది. ఇతరులతో నా సంభాషణ చాలా సౌమ్యంగా సాగుతూంది. సవినయంగా నేను ప్రతిపాదించే అభిప్రాయాలు ఎక్కువ వ్యతిరేక భావాలు లేకుండా ఆమోదింప బడుతున్నయ్. అలాంటి సమయాల్లో పొరపాటు, నాదైనప్పటికి మనస్సు ఎక్కువగా చీకాకు పడేది కాదు. అంతేగాక పొరపాటు యితరుల దైనప్పుడు వారు దానినంగీకరించి నా అభిప్రాయాన్ని స్వీకరించటానికి తగిన వాతావరణం ఏర్పడేది. ఈ విధానం మొట్టమొదట కొంత బలవంతంగా అమలుజరిపాను. స్వభావ సిద్ధమైన అలవాట్లను క్రమంగా అధిగమించాను. బహుశా ఈ యాభై సంవత్సరాల్లో మొరటుగా నియంతృత్వాన్ని ధ్వనిస్తూ మాట్లాడటం ఎవ్వరూ విని ఉండరు. సత్యపరిపాలన తరువాత ఈ సుగుణంవల్లనే ముఖ్యముగా నాతోటి వారిలో నాకుగల గౌరవం పెరగటం జరిగింది. నేను ప్రతిపాదించిన సంస్థలు ప్రజామోదాన్ని పొందటంగాని, శాసన సభల్లో సభ్యుడైనప్పుడు నాకు కొంతపలుకుబడి కల్గటంగాని ఈ వినయ సంపత్తివల్లనే జరిగింది. నేను గొప్ప వక్తనుగాను. దారాళంగా మాట్లాడలేను. మాటలు ఎన్నుకొనటంలో తత్తరపాటు చెందుతాను. భాషలో పొరపాటున్నప్పటికి నేను విజయవంతంగా నా అభిప్రాయాన్ని చెప్పకలిగేవాణ్ణి. నిజా

నికి మన జాతిలో కనిపించే మనోవికారాలలో-గర్వం చాలా ముఖ్యమైంది. దాన్నిపూర్తిగా అణచివేయటం దాదాపు అసాధ్యమైన విషయంగా పరిణమించింది. ఆ దుర్గుణంతో యుద్ధం చెయ్యి - దాన్ని చావగొట్టు - సమాధికట్టు-అయినా ఇంకా బ్రతికే ఉంటుంది. అప్పుడప్పుడు తలపెత్తి చూస్తూనే ఉంటుంది. మనచరిత్రలో ఈ విషయాన్ని నువ్వు అనేకసార్లు గమనించే ఉంటావు. వ్యక్తిగతంగా దాన్ని అధిగమించినట్లు నేను భావిస్తున్నాను. కాని నా వినయసంపత్తిని గురించి నేను గర్వపడుతున్నానేమో!

(ఇంతవరకూ 1784 లో పాసీలో వ్రాయబడింది.)

# 3

[ఆగస్టు 1788. నేను యిప్పుడు ఇంటిదగ్గరనుండే దీన్ని వ్రాయబోతున్నాను. కొన్ని కాగితాలవల్ల లభిస్తుందని ఆశపడ్డ సహాయం దొరకలేదు. అందులో అనేకం యుద్ధంలో పోయాయి. కొన్ని మాత్రం దొరికాయి. వాటిని ఇక్కడ పొందుపరుస్తున్నాను.]

సువిశాలమైన ఒక గొప్పసూత్రాన్ని నేను ఉదహరిస్తున్నాను. ముందు దానికిగల ఆదర్శాన్ని గురించి కొంత విషయం చెప్పవలసిఉంది. మొట్టమొదట ఇది నాలో జనించినప్పుడు—దాని స్వరూపం ఏమిటో—ఈ కాగితంలో కనిపిస్తుంది.

ఇది ప్రమాదవశాన అన్నింటితోపాటు పోకుండా భద్రంగా దొరికింది. 1731 మే 19 వ తేదీ:

గ్రంథాలయంలో కూర్చుని, దేశీయచరిత్రల చదివి నేను చేసిన పరిశీలనలు:

"యుద్ధాలూ— విప్లవాలూ మొదలైన పెద్దపెద్ద ఉపద్రవాలన్నింటికీ రాజకీయపక్షాలే కారణం"

"రాజకీయ పక్షాలకు గల విభిన్న దృక్పథాలు పరిస్థితులను చిందరవందర చేస్తున్నయ్."

"ఏ పార్టీ పథకాన్ని సూచించినా, అందులోని కొందరు వ్యక్తులకు కొన్ని వ్యక్తిగత లాభాలు ఉంటేనేగాని జరగదు."

"ఒకపార్టీ తా ననుకుంది సాధించగానే – అందులోని సభ్యులందరూ ఆ అవకాశం వినియోగించుకుని, వారి వారి వ్యక్తిగత లాభాలు సాధించుకుంటానికి ఎగబడతారు. ఇది పరి

స్థితులను ఇంకా చిందర వందర చేస్తుంది. కేవలం ప్రజా క్షేమం కోసం వ్యవహరించే రాజకీయవాదులు అతి తక్కువగా ఉంటారు. వారివల్ల దేశానికి కొంతమేలు జరిగినా, వారి వ్యక్తిగత లాభానికి వ్యతిరేకంగా మాత్రం అది జరిగి ఉండదు. ఇక మానవ కళ్యాణానికి పాటుపడేవారు రాజకీయాల్లో మరీ తక్కువగా ఉంటారు.

ఈ పరిస్థితులన్నీ చూస్తుంటే-అన్ని జాతులకు చెందిన సజ్జనులందరినీ. సంఘటిత పరచవలసిన అవసరం నా కెంతో కనిపిస్తున్నది. దీన్ని కార్యరూపంలో పెట్టటానికి అప్పటి పరిస్థితులను బట్టి, నా కవకాశం లభించలేదు. అంచేత ఈ విషయంలో నాకు జనించే ఊహాలన్నింటినీ, అప్పుడప్పుడు కాగితాలమీద పొందుపరుస్తూ వచ్చాను. అందులో అనేకం పోయాయి. కాని వాటిసారాంశంగల ఒకకాగితం దొరికింది. అందులో ఇలాఉంది:

"భగవంతుడు ఒక్కడే. అతడే ప్రపంచాన్ని సృష్టించాడు. అతడే సృష్టిని రక్షిస్తున్నాడు. అందుకు మన మాయనకు కృతజ్ఞులమై, సర్వదా ప్రార్థనలతో పూజించాలి. తోటిమానవులను సేవించినప్పుడే, భగవంతుడు ఎక్కువ ఆనందిస్తాడు. ఆత్మ శాశ్వతమైనది. భగవంతుడు దుష్టశిక్షణా-శిష్టరక్షణ చేయగలడు."

ఈ సూత్రాన్ని ముఖ్యంగా అవివాహితులైన యువకుల్లో వ్యాపింపజేయాలనుకున్నాను. మొదట ప్రతి వ్యక్తీ దీన్ని అంగీకరించినట్లు ప్రకటించుకోవాలి. తర్వాత పదమూడు వారాలూ, సాధనచేసి నే నింతకుముందు చెప్పిన సుగుణాలను అలవాటుచేసుకోవాలి.

ఈ సంఘం తగినంత పెద్దదయేదాకా దీని ఉనికిని రహస్యంగానే ఉంచాలి. ఇందలి సభ్యులందరూ సజ్జనులైన యువకులకు ఈ సూత్రాలు బోధిస్తూ క్రమంగా వ్యాపింప జెయ్యాలి. ఇందలి సభ్యులు ఒకరికొకరు సహాయ సానుభూతులను అందించుకోవాలి. తద్వారా జీవిత పురోభివృద్ధిని సాధించాలి. ఈ సంఘాన్ని "ది సొసైటీ ఆఫ్ ఫ్రీ అండ్ ఈజీ" అనే పేరుతో వ్యవహరించాలి.

ఈ సుగుణాలను అలవాటుచేసుకోనటంవల్ల, దుర్గుణాలనుండీ, ఋణభాధలనుండీ విముక్తిగలగటానికి అవకాశ ఉంది.

నే ననుకున్న విషయాలలో నాకిప్పుడు ఇంతవరకూ మాత్రం గుర్తుంది. ఇద్దరు ఉత్సాహవంతులైన యువకులకు ఈ సూత్రాలను బోధించానుకూడా! కాని వ్యాపారానికి చెందిన లావాదేవీలలో మునిగితేలుతూ, దీన్ని యింకా వ్యాపింపజెయ్యలేకపోయాను. నా వ్యక్తిగత వ్యవహారాలు కొన్ని, బహిరంగ కార్యకలాపాలు కొన్ని, అడ్డుపడుతూ నన్ను ఈ పని చెయ్యకుండా ఎప్పటికప్పుడు వాయిదా వేస్తూ వచ్చాయి.

ఈ పథకం ఆచరణ సాధ్యమైనదనే- యిప్పటికీ నేను భావిస్తున్నాను. అనేకమందిని - దీనిద్వారా ఉత్తమపౌరులుగా తయారుచేయవచ్చు. ఇది భరించలేని కార్యభారం మాత్రం కాదు. శక్తి - ఉత్సాహముగల వ్యక్తి - ఇలాటి అనేక కార్యక్రమాలు నిర్వహించి - మానవజాతిలో అనేక మార్పులు తేగలడు. కావలసిందల్లా ఒక్క చక్కని కార్య

క్రమాన్ని ఏర్పాటుచేసుకుని - దానిపై తన శక్తి యుక్తు లన్నీ కేంద్రీకరించి - పనిచేయాలి.

1732 లో మొదటిసారిగా నేను 'రిచర్డు సండర్స్' అనే పేరుతో ఒక పంచాంగాన్ని ప్రకటించాను. అనతికాలంలోనే అది బహుళ ప్రచారంలోకివచ్చి, పాతిక సంవత్సరాలవరకూ సాగింది. దానిమీద సాలీనా నాకు పదివేలు లాభంవస్తూ ఉండేది. రాష్ట్రంలోనివారంతా దాన్ని చదివేవారు. రాష్ట్రంలోని ప్రతియింటిలోనూ, అది కనిపించేది. తరచుగా మరొక పుస్తకం కొంటం అలవాటులేని సాధారణప్రజలలో, నా అభిప్రాయాలను ప్రచారంచెయ్యటానికి ఈ పంచాంగాన్ని నేను సాధనంగా తీసుకున్నాను.

అందులో వీలైన ఖాళీ జాగాల్లో కొన్ని నైతిక సూత్రాలను ప్రకటించేవాణ్ణి. శ్రమించి పనిచెయ్యటం - పొదుపుగా జీవించటం, తద్వారా సిరిసంపదలను, సుగుణ సంపత్తినీ వృద్ధిచేసుకోవటం - మొదలైన సుభాషితాలు అందుండేవి. నిజానికి కొన్ని కొన్ని అవుసర పరిస్థితుల్లో మానవుడు నీతివంతంగా బ్రతకలేడు. "ఖాళీసంచి ఖచ్చితంగా నిలబడలేదు" అనే సామెత కూడా ఒకటి వాడుకలో ఉంది. తరతరాల విజ్ఞానం ఈ సామెతల్లో వెల్లివిరుస్తూ ఉంటుంది. అనేక జాతులకు చెందిన సామెతలను కొన్ని సంకలించి 1757 లో నా పంచాంగంలో ప్రకటించాను. ఒక వేలంపాటకు హాజరైన ప్రజల నుద్దేశించి ఒక వృద్ధుడుచెప్పిన మాటలరూపంలో వీటిని ప్రకటించాను. ఇది ప్రజలను బాగా ఆకర్షించింది. ఈ రచన ఐక్యకంఠంతో

పొగడబడటంచేత ఖండంలోని పత్రికలన్నీ దీన్ని ప్రకటించు కున్నాయి. బ్రిటన్‌లోనూ, ఫ్రాన్సులోనూకూడా ప్రకటించ బడ్డాయి. నా అభిప్రాయాలను ప్రచారంచేయటానికి, నా పత్రికకూడా మంచిసాధనంగా ఉపయోగపడింది. స్పెక్టేటర్ మొదలైన నైతిక రచనలలోని భాగాలనూ, నావి కొన్నిం టినీ తరచుగా అందులో ప్రకటించేవాడిని. ఇందులో సోక్రటీస్ సంభాషణ ఒకటి. ఒక దుర్మార్గునికి ఎంత శక్తి సామర్థ్యా లున్నప్పటికీ, అతన్ని తెలివిగలవాడని అనలేం- అనే విషయాన్ని అది నిరూపిస్తున్నది. ఒక సుగుణం ఒక వ్యక్తిలో గాఢమైన అలవాటుగా మారినప్పుడే దానికి సుస్థి రత్వం వస్తుంది—అనేది మరొక విషయం. ఇవి 1735 సంవ త్సర ప్రారంభంలోని పేపర్లలో ప్రకటించబడ్డాయి.

ఇక నేను నడుపుతున్న వార్తాపత్రికవిషయం: చాలా జాగ్రత్త వహించి, ఏ రకమైన వ్యక్తిగత దూషణలకూ అందు స్థానంలేకుండా చేశాను. సాధారణంగా కొందరు రచ యితలు అలాటి రచనలు తెచ్చి, పత్రికా స్వాతంత్ర్యమనే హక్కును గుర్తుచేస్తూ, వాటిని నా పత్రికలో ప్రకటించ మంటూ వాదించేవారు. నే నందుకు నిరాకరిస్తూ- కావా లంటే వారి రచనలను ప్రత్యేకంగా అచ్చువేసి, కావలసి నన్ని ప్రతులను యివ్వగలనని రచయితలకు వాగ్దానంచేసే వాణ్ణి. ఏమైనా అలాంటి వ్యక్తిగత దూషణలకు, నా పత్రి కను సాధనంగా రూపొందించదల్చుకోలేదు. కాని అనేక మంది ప్రచురణకర్తలు వారికి సంబంధంలేని విషయాల్లోకూడా కేవలం అసూయతో వ్యక్తిగతమైన నిందారోపణలు చేయ

టానికి సందేహించటం లేదు. అంతేగాక ప్రభుత్వాన్ని గురించీ యిరుగు పొరుగు రాజుల్ని ఆఖరికి మన మిత్రరాజ్యాల్ని గురించికూడా, దూషణలతో నిండిన అవివేకపూరితమైన రచనల్ని ప్రకటించటం కొందరి కలవాటైపోయింది. ఈ విషయాలని యువకులైన ప్రచురణకర్తలకు తమ వ్యాసాంగాన్ని కళంకితం కానీయకుండా, హెచ్చరించటానికి ఉదహరిస్తున్నాను. అటువంటి చెడుమార్గాల ద్వారా వారి వృత్తిని అవమానపరచక నన్ను ఉదాహరణగా తీసుకొని, అలాటి వాటిని నిశ్చలంగా నిరాకరించవచ్చు.

1733 లో నా దగ్గర పనిచేసే ఒక కార్మికుణ్ణి దక్షిణ కరోలినాలోని చార్లెస్‌టన్‌కు పంపాను. అక్కడ ఒక ప్రెస్ అవుసరమైంది. అతనికి నేను కావలసి సాధనసామాగ్రినికూర్చి ఒక సమిష్టి వ్యాపారపద్ధతికి అంగీకరించి పంపించాను. దాని ప్రకారం మూడోవంతు ఖర్చులుపోను మరొక మూడో వంతు లాభం నాకు సంక్రమిస్తున్నది. అతడు బాగా చదువుకున్నవాడు. నమ్మకమైనవాడు. కాని సరిగ్గా పద్దులువ్రాయటం చేతకాదు. అప్పుడప్పుడు నాకు కొంత డబ్బు పంపినా ఏ విధమైన లెఖ్ఖలు నాకు తెలిసేవి కావు. ఆ తరువాత అతడు జీవించి ఉండగా మా సమిష్టివ్యాపారము యొక్క వాస్తవ స్థితిగతులు ఎలాంటివో నాకెన్నడూ తెలియలేదు అతని మరణానంతరం అతని విధవభార్య వ్యాపారం సాగించింది. ఆమె హాలెండులో పుట్టి పెరిగింది. అక్కడ స్త్రీ విద్యలో లెఖ్ఖలు ముఖ్యంగా బోధింపబడేవిట. అంచేత అప్పటి స్థితిగతులకు సంబంధించిన ఆరాపట్టిక నొకదానిని

పంపటమేగాక ఆ తరువాత ప్రతి మూడుమాసాలకు సక్రమ మైన లెఖ్ఖలు పంపుతూఉంది. వ్యాపారం బాగా అభివృద్ధి చెందింది. కుటుంబాన్ని గౌరవప్రదంగా నిర్వహించి ఒడం బడికగడువు సమాప్తమయ్యేసరికి ఆ ప్రెస్‌ని తానే స్వయంగా కొని దానిని తనకుమారుని కప్పగించింది. ఈ విషయాన్ని నే నెందుకు ఉదహరించానంటే, మన ఆడపిల్లలకి సంగీతము, నాట్యము మొదలైన కళలకంటేకూడా ఈ విధమైన విద్య ఎక్కువ ఉపకరిస్తుందని చెప్పటానికి మాత్రమే. దురదృష్ట వశాన గంపెడు సంసారంగల స్త్రీ విధవ కావచ్చు. ఆమెబిడ్డ లందరు అప్పటికి రెక్కలురాని కూనలు కావచ్చు. అలాటి పరిస్థితుల్లో పెద్దకొడుకు పెద్దవాడయేదాక ఏదో ఒక వ్యాపా రాన్ని నిర్వహించుకుంటూ సంసారాన్ని సంరక్షించుకో గలశక్తి ఆమెకు లభిస్తుంది.

1734 లో ఐర్లండు నుంచి యువకుడైన 'ప్రెస్‌బెటేరి యన్' మతబోధకుడొకడు మా ప్రాంతాలకు వచ్చాడు. అతనిపేరు 'హెంపిల్'. ఆతడు చక్కని కంఠస్వరంతో అనర్గ ళంగా ఆధ్యాత్మికోపన్యాసాలు అనేకం చేశాడు. అవి నేను తరచుగా వినేవాణ్ణి. అవి నియంతృత్వ ధోరణిలో ఉండేవి కాదు. సుగుణసంపత్తిని అలవరచుకొమ్మని మాత్రమే అవి వక్కాణించేవి. అంచేత అవి నాకు నచ్చాయి. కాని మా సమాజంలోని కొందరు పూర్వపుప్రెస్ బెటేరియన్‌లకు అతని ధోరణి నచ్చలేదు. వారాతనిని ఖండించారు. నేనుమాత్రం అతని సిద్ధాంతాలకు ముగ్ధుణ్ణయి తదనుకూలంగా ఒకపక్షాన్ని నిర్మించటానికి ప్రయత్నించాను. దానిమీద కొంతరభస

జరిగింది. అతడు మంచిబోధకుడైనప్పటికీ రాత చేతనైన వాడు కాదు. అంచేత అతనికిబదులు నేను రెండు మూడు కరపత్రాలు వ్రాసిపెట్టాను. అందులో ఒకటి 1735 ఏప్రిల్ గజట్‌లో ప్రకటించబడింది. అన్ని వివాదాస్పదమైన విష యాల వలెనే దీన్నికూడా ప్రజలందరూ ఉత్కంఠతో చది వారు. ఇప్పుడు దాని ప్రతి ఒక్కటికూడా నా దగ్గర లేదు.

ఈ పోటీలో ఒక దురదృష్టకరమైన సంఘటన అతనికి చాలా అపకారం చేసింది. అతను బోధించిన ఒకానొక విష యం మా ప్రతిపక్షులలో ఒకడు విన్నాడు. దానిని అంతకు ముందెన్నడో ఎక్కడో చదివిన ట్లాతని కనుమానంవేసింది. వెతికి వెతికి డాక్టర్ ఫాస్టర్ యొక్క సమీాక్షలోని భాగమని నిర్ణయించాడు. ఈ పరిశోధన అనేకమందికి మా పక్షంమీాద విసుగుపుట్టించింది. అప్పటివరకూ అతని సిద్ధాంతాన్ని బల పరుస్తున్నవారు విరమించుకున్నారు. నేనుమాత్రం అతనిని వదిలిపోలేదు. తను స్వయంగా కనిపెట్టిన అవాకులు, చెవా కులూ వాగేదానికంటే యితరులు చెప్పిన గొప్పగొప్ప ఆధ్యాత్మికవిషయాలను చెప్పటం తప్పుగా నాకు కనిపించ లేదు. సాధారణంగా మతబోధకులందరూ ఆ మొదటి పనినే చేస్తూఉంటారు. ఆ తరువాత తానుబోధించిన విషయాలన్నీ తనవికావనీ ఒక్కసారి చదివినంతమాత్రం చేత ఏ విషయా న్నైనా గుర్తుంచుకోగల ధారణాశక్తి తనకున్నదనీ అతనే నాకు చెప్పాడు. ఈ అపజయం తరువాత అతడు మమ్మల్ని వదిలి మరొకచోట అదృష్టాన్ని వెదుక్కుంటూ వెళ్ళిపో యాడు. నేనుకూడా ఆ మత సమాజంనుండి వెలుపలకు

వచ్చివేశాను. నేను చెల్లించవలసిన విరాళాలను చాలా సంవత్సరాలవరకు చెల్లించినప్పటికీ ఆ తరువాత ఎన్నడూ అట్టి సభలకు హాజరుకాలేదు.

1733 లో ఇతరభాషల్ని అభ్యసించటం నేను ప్రారంభించాను. అనతికాలంలోనే ఫ్రెంచిభాషలోని గ్రంథాలను చదువగల నేర్పును సంపాదించాను. ఆతర్వాత ఇటాలియన్ భాషపైకి నా దృష్టి మళ్ళింది. నాతోపాటు ఆ భాష నభ్యసిస్తున్న ఒకవ్యక్తితో నాకు పరిచయం కలిగింది. అతడు తరచుగా నన్ను చదరంగం ఆడటానికి ఆహ్వానించేవాడు. దీనివల్ల నాకు చదువుకోవలసిన కాలం ఎక్కువగా వృథా అవుతున్నదని తెలుసుకున్నాను. ఆ తర్వాత ఆటకు రావటానికి నేనొకషరతు పెట్టాను.ఆటలో గెల్చినవాడు వ్యాకరణంలోగాని, అనువాదంలోగాని, కంఠస్తం చేయటంలోగాని, ఓడిపోయిన అభ్యర్థికి కొంతపని కలిగించే హక్కు లభిస్తుంది. దాన్ని అతడు పూర్తిచేసి తరువాతి సమావేశంలో చూపించాలి. మేమిద్దరం సమఉజ్జీలం కావటంచేత ఒకరికొకరు పనులు చెప్పుకునేవాళ్ళం. ఆ తరువాత కొద్దికష్టంతోనే స్పానిష్ భాష నేర్చుకున్నాను.

లాటిన్‌స్కూల్లో ఒక్క సంవత్సరం మాత్రమే విద్యగడించినట్లు యింతకుముందే చెప్పాను. ఆ తరువాత లాటిన్ భాష చదవటానికి నేనెన్నడూ శ్రద్ధవహించలేదు. కాని ఫ్రెంచి-ఇటాలియన్ - స్పానిష్-భాషలతో నాకు పరిచయం కలిగినతరువాత లాటిన్‌భాషను చదవటం నాకు చాలావరకు

సులభసాధ్యమయింది. అంచేత మళ్ళీ లాటిన్ భాషను చదవాలనే ఆసక్తి లేకుండా చేసింది.

ఆ పరిస్థితుల్లో మనకు భాషల్ని నేర్పే సాధారణ పద్ధతిలో నాకు ఏదో వైరుధ్యం కనిపించింది. మొట్టమొదట లాటిన్ నేర్చుకోవాలని చెప్తారు. తద్వారా ఆధునిక భాషలన్నింటినీ నేర్చుకోవటం సులభమని వారి అభిప్రాయం. కాని లాటిన్ భాషను తేలికగా నేర్చుకోవాలని ముందు గ్రీకుభాషను మనం అభ్యసించం.

బాస్టన్ వదిలివచ్చి పదేళ్ళయిన తరువాత మళ్లా బంధువులన్నందరినీ చూచిరావాలని బయలుదేరాను. అప్పటి నా పరిస్థితులు కొంత బాగున్నయ్. తిరుగు ప్రయాణంలో నా అన్నను చూడటంకోసం నేను న్యూపోర్టులో ఆగాను. ఒక ప్రెస్ పెట్టుకొని అతడక్కడే స్థిరపడిపోయాడు. మా గత వైషమ్యాలు అదృశ్యమై ఆదరాభిమానాలు తిరిగి మొలకెత్తాయి. అప్పటికి నా అన్న ఆరోగ్యం క్రమంగా తగ్గిపోతున్నది. అనతికాలంలోనే తనఆయువు సమసిపోతుందని అతడు భావిస్తున్నాడు. ఆలాంటిపరిస్థితుల్లో పదిసంవత్సరాల వయస్సు గల తనబిడ్డను పెంచి పెద్దచేసి ప్రెస్‌వ్యాపారాన్ని అప్పగించే భారం నన్ను స్వీకరించమని ప్రార్థించాడు. ఈ వాగ్దానాన్ని నేను నిర్వహించాను. అతణ్ణి కొద్దిసంవత్సరాలు స్కూలుకు పంపి ఆ తరువాత వ్యాపారంలో పెట్టాను. అతడు పెరిగిపెద్దవాడయ్యే దాకా అతనితల్లే వ్యాపారం నిర్వహించింది. నేను చేతనైన సాయం చేసేవాణ్ణి.

1736 లో నా కుమాళ్ళలో ఒకడు మసూచిపోసి మర ణించాడు. పండులాంటిబిడ్డ... ఇది నన్ను చాలా కుంగ దీసింది. ఇంతవరకూ నా కీబాధ పోలేదు.

మా జుంటోక్లబ్బు చాలా ఉపయోగపడుతోంది. ఇది సభ్యులందరకూ సంతృప్తికరంగానే ఉంది. ఎవరికివారు తమ స్నేహితులను సభ్యులుగా జేర్పించాలనుకుంటున్నారు. కాని సభ్యుల సంఖ్య గరిష్టపరిమితి పన్నెండుకంటె ఎక్కువ వుండ కూడదని మా తొలినిర్ణయం. ఈ సంస్థని సాధ్యమైనంత రహస్యంగా ఉంచాలని మా అభిప్రాయం. అనర్హులైన వ్యక్తులు ఇందులో ప్రవేశించ కూడదనే ఉద్దేశంతోనే ఇలాటినిర్ణయం తీసుకున్నాం. ఈ సంఖ్య పెరగటానికి నిరాక రించిన వారిలో నేను ప్రథముణ్ని. అందుకు ప్రతిగా ప్రతి సభ్యుడు దీనికనుబంధంగా తలొక క్లబ్బును ఏర్పాటుచేయ టం మంచిదని ప్రతిపాదించాను. ఆ అనుబంధ సంస్థలన్నిం టిని కూడా ఇవే నియమ నిబంధనలు పరిపాలిస్తాయి. అందలి సభ్యులకు మాత్రం వారి వారి సంస్థలో జుంటోకు అనుబంధా లుగా ఉన్న విషయం తెలియకూడదు. దీనివలన అనేకమంది యువకులకు ఈ సంస్థలయొక్క ప్రయోజనాలు సిద్ధిస్తాయి. జుంటోలోని సభ్యులందరూ తమ తమ అనుబంధ సంస్థలలో జరుగుతున్న కార్యకలాపాలనుగురించి ఎప్పటికప్పుడు నివేది కలను పొందుపరచాలి. దీనివలన మా జుంటో క్లబ్బుయొక్క అభిప్రాయాలను, ఆదర్శాలను అతి త్వరితంగా వ్యాప్తిచెయ్య టానికి అవకాశం కలిగింది.

ఈ కార్యక్రమం అంగీకరింపబడింది. ప్రతిసభ్యుడు తలొక క్లబ్బును స్థాపించటానికి అంగీకరించినా అందులో అయిదుగురు మాత్రమే సఫలులయ్యారు. ఆ క్లబ్బులకు వై ఇన్-యూనియన్-బాండ్ అనేపేర్లు పెట్టబడ్డాయ్. అవి చాలా ఉపయోగకరంగా ఉన్నాయి. చెప్పాలో తగ్గంతగా మా అభిప్రాయాలను ప్రజలలో వ్యాప్తిచేయటానికీ పలుకుబడి సాధించటానికీ ఇవి ఉపయోగించాయి. ఇందుగురించిన కొన్ని కొన్ని సంఘటనలు ముందు ముందు చెప్తాను.

1736 లో సాధారణ సభలో నాకు గుమాస్తా ఉద్యోగం దొరికింది. ఏకగ్రీవంగా నే నెంచుకోబడ్డాను. కాని ఆ తరువాత సంవత్సరం నాపేరు తిరిగి ప్రతిపాదించినప్పుడు ఒకానొక కొత్తసభ్యుడు లేచి నాకు వ్యతిరేకంగా ఒక సుదీర్ఘమైన ఉపన్యాసంచేశాడు. తా నభిమానించే వేరొక అభ్యర్థిని బలపరచటం మాత్రమే ఆ మహోపన్యాసానికి ప్రేరణం. ఎలాగైతేనేం చివరికి నాకే ఉద్యోగం లభించింది. ఉద్యోగరీత్యా వచ్చే ప్రతిఫలమే గాకుండా నిరంతరం సభ్యులతో పరిచయం కలిగి ఉండటంచేత వ్యాపారరీత్యా నాకు కొన్ని లాభాలు సిద్ధించాయి. అందువల్ల నాకు ఓట్లు, శాసనాలు, కాగితపు కరెన్సీ మొదలైనటువంటి అనేక పనులు లభించి విశేషమైన లాభాలను చేకూర్చినయ్.

అందుచేత ఈ క్రొత్తసభ్యునియొక్క వ్యతిరేక భావానికి నాకు కొంత కష్టం కలిగింది. అతను బాగా చదువుకున్నవాడు. శ్రీమంతుడు. ముందు ముందు శాసనసభలో నిస్సంశయంగా గొప్పపలుకుబడి సాధించగలవాడు. అయినా

అతని అడుగులకు మడుగులొత్తుతూ అతని అభిమానాన్ని సంపాదించటానికి నేను ప్రయత్నించలేదు. కాని, ఇందుకు మరొక మార్గాన్ని అవలంబించాను. అతని లైబ్రరీలో ఒక అసాధారణమైన గ్రంథమున్నదని తెలుసుకొని దానిని కొద్ది రోజులు చదువుకుంటానని కిమ్మని ప్రార్థిస్తూ అతనికొక లేఖ వ్రాశాను. అతడు వెంటనే ఆ గ్రంథాన్ని పంపాడు. నేను దాన్ని చదివి వారంరోజుల్లో కృతజ్ఞతాభివందనాలతో సహా అతనికి పంపివేశాను. ఆ తరువాత నన్ను అతను సభలో చూసినప్పుడు మొదటిసారిగా నాతో మాట్లాడాడు. ఆ మాటల్లో ఎంతో అభిమానాన్ని వ్యక్తంచేశాడు. ఆ తరువాత అన్ని సందర్భాల్లోనూ అతను నాకు సహాయంచేస్తూ వచ్చాడు. మేం గొప్ప స్నేహితుల మయ్యాం. అతని జీవితాంత కాలం మా స్నేహం నిలిచేఉంది. "నీ చేత సహాయం పొందినవారికంటె నీకు ఒకసారి సహాయంచేసిన వ్యక్తి మరొకసారి సహాయం చెయ్యటానికి తొందరపడతాడు" అనే సిద్ధాంతాన్ని మా యీ స్నేహం ఋజువుచేసింది. అనవసరమైన స్పర్థలను నిర్మూలించుకోవటం వలన ఎంతలాభం కలుగుతుందో యీ విషయం మరోసారి నిరూపించింది.

1737 లో ఒకానొకప్పుడు వర్జీనియా గవర్నరుగిరి చేసి ఇప్పుడు పోస్టుమాస్టర్ జనరల్‌గా ఉంటున్న కర్నల్ 'స్పాట్స్ ఉడ్' ఫిలడల్ఫియాలోని డిప్యూటీయొక్క ప్రవర్తనకు అసంతృప్తి చెంది అతన్ని బర్తరఫ్ చేశాడు. ఆ ఉద్యోగానికి నన్ను ఆహ్వానించాడు. నేను దాన్ని సంతోషంతో అంగీకరించాను. జీతంతక్కువైనప్పటికీ దానివల్ల నాపత్రికకు

కొంత లాభం వచ్చింది. ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుకోవటం సుకరమైంది. క్రమంగా అమ్మకం పెరగటమే గాక అనేక ప్రకటనలుకూడా దొరుకుతున్నాయ్. దానివల్ల తగినంత లాభం చేకూరుతూ ఉంది. తత్ఫలితంగా నా పాత పోటీదారుని వార్తాపత్రిక కొంతజోరు తగ్గింది.

ఇప్పుడిప్పుడే ప్రజాక్షేమానికి సంబంధించిన చిన్న చిన్న కార్యకలాపాలమీద నాదృష్టి ప్రసరిస్తున్నది. నగరంలోని గడియారాన్ని సరిగ్గా ఉపయోగపడేటట్లు చెయ్యాలని మొదట నిర్ణయించుకున్నాను. దాన్ని వంతులవారీగా పోలీసు జవాన్లు నిర్వహించేవారు. వారు పుష్కలంగా లంచాలు తీసుకోవటం, త్రాగి తందనాలాడటం మినహా మరో ఉపయోగకరమైన పని చేసేవారుకారు. ఈ సందర్భంలో తీసుకోవలసిన చర్యల గురించి ఒక నివేదికవ్రాసి జుంటోలో చదివాను. ఈ జవానులు కాపలా కాసినందుకు ప్రతిఫలంగా ఒకో యింటికి ఆరు షిల్లింగులు చొప్పున పన్ను వసూలుచేసేవారు. యాభై పౌన్లు విలువచేసే సామాన్లుకూడా లేని ఒక పేదరాలుకూడా ఆరుషిల్లింగులు చెల్లించవలసి వచ్చేది. బాగా మదించిన కోటీశ్వరుడు కూడా తన ఆస్థిపాస్తులను సంరక్షిస్తున్నందుకు ఆరుషిల్లింగులు మాత్రమే పన్ను చెల్లించేవాడు. ఇదినాకు చాలా అన్యాయంగా తోచింది.

మొత్తంమీద కొందరు నిర్ణీత వ్యక్తుల్ని కొంత జీతంమీద శాశ్వతంగా గడియారం విషయంలో శ్రద్ధవహించటానికి నియమించాలని కాపలాపన్ను తలవారీగా

గాక ఆ స్త్రీనిబట్టి విధించాలని నేను ప్రతిపాదించాను. ఈ అభిప్రాయం జుంటోలో ఆమోదింప బడటంచేత క్రమంగా దాని అనుబంధ సంస్థలన్నింటికీ ప్రాకింది. దానివల్ల తక్షణం సమకూరిన ఫలితం లేకపోయినప్పటికీ క్రమంగా ప్రజలదృష్టి నాకర్షించటంచేత తరువాత కొన్నిసంవత్సరాలకు అందుకనువైన శాసనాలు అమలులోకి వచ్చినయ్. మా క్లబ్బులోని సభ్యుల పలుకుబడి బాగా పెరగటం ఒక కారణం.

ఈ రోజుల్లో నగరంలో జరుగుతున్న రకరకాలైన ప్రమాదాల్ని గురించి, వాటిని నివారించటానికి తీసుకోవలసిన జాగ్రత్తల్ని గురించి నేనొక వ్యాసం వ్రాశాను. ముందు దాన్ని మా క్లబ్బులో చదివి ఆ తరువాత ప్రకటించాను. తిరిగి ఇది ప్రజలను ఆకర్షించింది. తత్ఫలితంగా అగ్నిప్రమాదాలను నివారించటానికి, ప్రమాద సమయాల్లో పరస్పరం సాయం చేసుకోవటానికి ఒకసంఘం ఏర్పడింది. ఇందులో ముప్ఫైమంది సభ్యులున్నారు. మా సంఘనిబంధనల ప్రకారం అందలి ప్రతిసభ్యుడు ప్రమాదాలను ఎదుర్కొంటానికి సర్వదా సంసిద్ధుడై ఉండాలి. ప్రతిఒక్కరూ సామాన్లు జేరవేయటానికి కొన్ని సంచులను, బకెట్లను సిద్ధంగా ఉంచుకోవాలి. నగరంలో ఎక్కడ అగ్నిప్రమాదం జరిగినా ఈ సాధనలతో అక్కడ హాజరుకావాలి. సంఘసభ్యులందరూ నెలకొకతూరి సమావేశమై అగ్నిప్రమాదాలను గురించి ఉపయోగకరమైన సలహాలను, అభిప్రాయాలను ఒకరికొకరు చెప్పుకోవాలని నిర్ణయించుకోబడింది.

ఈ సంస్థయొక్క ఉపయోగం అనతికాలంలోనే అందరూ గుర్తించారు. అనేకమంది మాతో జేరాలని ముందుకు వచ్చారు. మా సలహా ప్రకారం వేరొక సంఘం స్థాపించబడింది. ఆ తర్వాత క్రమంగా అనేక సంఘాలు స్థాపించబడ్డాయ్. మేం మొట్టమొదట స్థాపించిన సంఘంపేరు 'యూనియన్ ఫైర్ కంపెనీ'. దాన్ని స్థాపించిన వారిలో ఇప్పుడు నేనూ మరొకరుమాత్రమే జీవించిఉన్నాం. ప్రమాద సమయాల్లో కార్యరంగంలోకి రానివారిపై వేయబడిన జరిమానాలతో ఫైర్ ఇంజన్లు, లాడర్లు, హుక్కులు, తదితర సాధన సామాగ్రి కొనేవాళ్ళం. అంచేత ప్రపంచంలో అగ్ని ప్రమాదాలను నివారించటానికి ఇంత బందోబస్తుగా జాగ్రత్తలు తీసుకోబడిన మరో నగరం ఉందా అని నేను ప్రశ్నిస్తున్నాను. ఆ తర్వాత మా నగరం ఎన్నడూ చెప్పుకోతగ్గంతగా అగ్నిప్రమాదాలకు గురికాలేదు.

1739 లో- ఐర్లెండు నుంచి రెవరెండ్ మిస్టర్ వైట్ ఫీల్డ్ అనే మతబోధకుడువచ్చాడు. అతడు ప్రజలనుబాగా ఆకర్షిస్తున్నాడు. మొదట చర్చిలలోనే బోధనలు జరపటానికి అతనికి అనుమతిదొరికింది. కాని ఆతరువాత మతాధికారులు, వారి వేదికలను అతని కీయ నిరాకరించటంచేత, బయట హాలాల్లోనే ఆయన సభలు జరుపుకోవాల్సివచ్చింది. ఆయన ఉపన్యాసాలు వింటానికని ఇసుకవేస్తే రాలకుండా జనం ఎగబడేవారు. "మీారంతా సగం పశువులు, సగం రాక్షసులు" అని హామీా నిస్తూ నిందాపూరితమైన వాక్యాలతో అతను ప్రసంగించేవాడు. అయినా శ్రోతలందరూ మంత్రముగ్ధులై

నిశ్చేష్టులై ఆయనవాక్కులను వినేవారు. మొదటినుంచీ, మతంమీద తూష్ణీభావంకలవారుకూడా, క్రమంగా మతాభిమానులౌతున్నారు. కాని అలా బయటిపొలాల్లో, రకరకాల వాతావరణాలకు లొంగి, సభలు జరుపుకోవటం కష్ట మనిపించింది. అంచేత ఒక మందిరం నిర్మించుకోవాలనే ప్రతిపాదన చేయబడింది. విరాళాలు సేకరించటానికి కొందరు వ్యక్తులు నియమింపబడ్డారు. వంద అడుగులు పొడుగూ, డెబ్భై అడుగులు వెడల్పూగల సౌధం, అనతికాలంలోనే నిర్మింపబడింది. అది షుమారు వెస్టు మినిస్టర్ హాలంతఉంది. ఈ కార్యం విపరీతమైన పట్టుదలతో అనుకున్న దానికంటె ముందే పూర్తి చేయబడింది. ఆ భవనమంతా కొందరు ధర్మకర్తల అజమాయిషీ క్రింద ఉంచబడింది. ఏ మతానికి చెందిన ప్రబోధకులు వచ్చినా, ఆ మందిరాన్ని యివ్వటానికి నిర్ణయించబడింది. ఆఖరికి, మహమ్మదీయమతాన్ని ప్రచారంచేయటానికి కాన్‌స్టాంటినోపిల్ నుంచి ఎవరైనా వచ్చినా, ఆయనకుకూడా అందులో స్థానం దొరుకుతుంది.

మిస్టర్ వైట్‌ఫీల్డ్ తర్వాత జార్జియా కాలనీ లన్నింటిలో ప్రచారంచేసుకుంటూ వెళ్ళాడు. రాష్ట్రంలో ఇప్పుడిప్పుడే స్థిరనివాసాలు ఏర్పాటు చెయ్యబడుతున్నాయి. కాని కష్టించి శ్రమించే రైతులకుబదులు దివాలాతీసిన వ్యాపారులు, అప్పులపాలైన సంసారులు, జైలునుంచి విడుదలైన ఖైదీలు, సోమరులు వచ్చి జేరుతున్నారు. వారివి పెద్ద పెద్ద సంసారాలు. వాటిని పోషించేమార్గం వారికే తెలీదు. అంచేత ఆ ప్రాంతమంతా అనాధ బాలబాలికలతో నిండి ఉంది.

ఈ దైన్యస్థితిని మిస్టర్ వైట్‌ఫీల్డు చూశాడు. అతని హృదయం కరిగింది. ఒక అనాథ బాల బాలికలశరణాలయం స్థాపించాలనే అభిప్రాయం కలిగింది. ఉత్తరాదికి వచ్చి, దీన్ని గురించి ప్రబోధింపసాగాడు. పుష్కలంగా విరాళాలు ప్రోగు పడినయ్. అతని అమృతవాక్‌ఝురి శ్రోతలపై ఎనలేని పలుకుబడిని సంపాదించింది.

ఈ అభిప్రాయాన్ని నేను వ్యతిరేకించలేదు. జార్జి యాలో తగిన సాధనసామాగ్రిగాని, పనివారుగాని లేక పోవటంచేత, అధిక వ్యయప్రయాసల కోర్చి కార్మికులనూ, సామాగ్రినీ, ఫిలడల్ఫియా నుంచి పంపాలని ప్రతిపాదించారు. నే నీ ప్రతిపాదనకుమాత్రం వ్యతిరేకించి, ఇక్కడే ఆ భవ నాన్ని కట్టి, పిల్లలను యిక్కడికే తీసుకురావటం మంచిదని సూచించాను. కాని ఆయన దాని కంగీకరించలేదు. అంచేత దానికి విరాళ మీయటానికి నేను నిరాకరించాను.

ఇది ఇలాఉండగా ఒక రోజున ఆయన ఉపన్యాసాలు వింటానికి నేను వెళ్ళటం తటస్థించింది. ఏ విధమైన విరా ళమూ యివ్వకూడదని ముందే నిర్ణయించుకున్నాను. నా జేబులో కొన్ని రాగినాణేలూ, నాలుగు వెండినాణేలూ, అయిదు బంగారు నాణేలూ ఉన్నాయి. అతని ఉపన్యాసం వింటూ వింటూ, నా నిర్ణయం కొంచెం మార్చుకుని, నా జేబులోని రాగినాణేలు యిచ్చివేశాను. ఆ తర్వాత అతని వాగ్ధాటి నన్ను కదిలించివేసింది. వెండినాణేలుకూడా యిచ్చి వేశాను. చివరకు ఆయన ఉపన్యాసం ముగించేముందు నా జేబు ఖాళీఅయిపోయింది. ఈ ఉపన్యాసానికి వచ్చినవారిలో

ఒక శ్రోత నావలే, అనాధ శరణాలయాన్ని ఫిలడల్ఫియా లోనే నిర్మించాలని అభిప్రాయం గలవాడు కావటంచేత, అందుకు ఏ విధమైన విరాళము యివ్వకూడదని నిర్ణయించు కుని, ఖాళీ జేబులతో వచ్చాడు. మిస్టర్ వైట్‌ఫీల్డు ఉప న్యాసం విన్నాక అతనిమనస్సుకూడా కరిగింది. ఖాళీ జేబులు తడుముకుంటూ తానుకూడా కొంత విరాళం యివ్వాలనే కోరికతో, ప్రక్కనున్న వ్యక్తిని కొంత డబ్బు అప్పుకావా లని అడిగాడు. కాని సమావేశానికి వచ్చినవారిలో వైట్‌ ఫీల్డు ఉపన్యాసానికి ఆవంతకూడా చలించకుండావున్న వ్యక్తి అతడొక్కడే. అతడు అప్పుయివ్వటానికి నిరాకరిస్తూ యిలా జవాబిచ్చాడు.

"మరో సమయంలో అయితే నిరాటంకంగా అప్పు యిచ్చిఉండేవాణ్ణి. కాని యిప్పుడు వీల్లేదు. ఎంచేతనంటే, నువ్వు యిప్పుడు పరాధీనమైన మనస్సుతో ఉన్నావు."

వైట్‌ఫీల్డు విరోధులు కొందరు, అతడు ప్రోగుచేస్తున్న విరాళాలు గుటకా స్వాహాచేయటానికే నని భావించసాగారు. కాని నాకుమాత్రం అతనిమీద అనుమానం కల్గలేదు. ఈ నాడుకూడా ఆయన సజ్జనుడనే నా నమ్మకం. మాకు మత సంబంధమైన అనుబంధాలేమీ లేకపోవటంచేత, ఆయనపై నాకుగల అభిప్రాయానికి ఎక్కువ విలువ యివ్వాల్సింది. మాది కేవలం మర్యాదపూరితమైన స్నేహం. అది అతని జీవితాంతంవరకూ అలాగే నిలిచింది.

ఈ క్రింది సంఘటన మా స్నేహస్వరూపం ఎలాటిదో తెలియజేస్తుంది.

ఒకసారి తాను అనతికాలం లోనే ఫిలడల్ఫియా రాగోరుతున్నాననీ, కాని తనస్నేహితుడైన బెనిజట్ లేక పోవటం చేత, ఎక్కడ బసచెయ్యాలో అర్థంకావటం లేదనీ వ్రాశాడు.

దానికి నేనిలా జవాబు వ్రాశాను: "మాయిల్లు మీకు తెలుసు. ఇక్కడగల కొద్దిసౌకర్యాలతో మీరు గడపగలిగి నట్లయితే, మిమ్మల్ని హృదయపూర్వకంగా ఆహ్వానిస్తు న్నాను." దానికి జవాబుగా ఆయన నా ఆహ్వానాన్ని క్రీస్తు మెచ్చుకుంటాడని వ్రాశాడు. వెంటనే నేను "మీకు ఆహ్వానం పంపింది క్రీస్తు మెప్పుకోసం కాదు; మీకోసం మాత్రమే" అని వ్రాశాను.

దీన్ని గురించి మా మిత్రుడొకడు చమత్కారంగా వ్యాఖ్యానించాడు. "సాధారణంగా యోగులందరూ, ఎవరి దగ్గరైనా ఏదైనా సహాయం పొందినప్పుడు, దానికి తాము కృతజ్ఞులై ఉండే భారాన్ని, దేమునికప్పగించి వేస్తారు." అంటూ... ... ...

అతనికి స్వచ్ఛమైన పెద్దకంఠం ఉంది. వాక్యాలను చక్కగా ప్రయోగించగలడు. ఒకసారి మార్కెట్ మధ్యలో గల కోర్టు మెట్లపైనుంచుని, అతను ఉపన్యసిస్తున్నాడు. కొద్ది క్షణాల్లోనే, ఆ ప్రాంతమంతా శ్రోతలతో నిండిపోయింది. అతని ఉపన్యాసం ఎంతదూరం వినిపిస్తుందో చూడాలని క్రమంగా వెనక్కు నదివైపుకు నడిచాను. ఫ్రంట్ వీధి వరకూ ఆయనమాటలు ప్రస్ఫుటంగా వినిపిస్తూనే ఉన్నాయి. దాన్నిబట్టి ఒక్కశ్రోతకు రెండు చదరపు అడుగులనేలను

కేటాయిస్తూ లెఖ్ఖ కట్టాను. దాని ప్రకారం రమారమి ముప్ఫైవేలమంది శ్రోతలకు వినిపించేలా అతడు ఉపన్యసించ గలడని తేలింది. పాతికవేలమంది శ్రోతలకు ఒకేసారి బోధ నలు చేశాడంటూ వార్తాపత్రికలలో వచ్చిన వార్తలు అతి శయోక్తులు కావని అప్పుడనుకున్నాను. ప్రాచీనచరిత్రలలో వేలాది సైన్యాన్ని ఉద్దేశించి ఒకేసారి ప్రసంగించిన వ్యక్తు లున్న విషయం అప్పుడే నమ్మాను. అతనివి తరచుగా వింటం చేత అతడు కొత్తగా తయారుచేసిన ఆధ్యాత్మికోపన్యాసా లకు, ఇదివరలో ప్రయాణాలు చేస్తూ అతడు బోధించిన ఉప న్యాసాలకు గల తేడా గ్రహించగలిగాను. ఇటీవల అతని ఉపన్యాసాలు ఇంకా బాగుపడ్డాయి. ప్రతిమాట, ప్రతి భావమూ పరిపూర్ణమైన క్రమపద్ధతిలో ప్రయోగించ గలుగు తున్నాడు. అతడు చెప్పేవిషయం ఏదైనా, అతని వాగ్ధోర ణికి శ్రోతలు ముగ్ధులు కాక తప్పదు. మధురమైన సంగీతాన్ని ఆకర్ణించేటప్పుడు కలిగే ఆనందమే అతని ఉపన్యాసాలు వింటున్నప్పుడూ కలుగుతుంది. తరచుగా అతడు వ్రాసి ప్రక టిస్తున్న విషయాలు అతనిశత్రువులకు చాలా ఉపయోగపడి నయ్. విమర్శకులు తీవ్రంగా అతని అభిప్రాయాలను ఖండిం చటం మొదలుపెట్టారు. అతనుగనుక తన ఉపన్యాసాలను అలా ప్రకటించి ఉండకపోయి నట్లయితే ఎంతో గౌరవంగా ఉండేది. అతని మరణానంతరం కూడా భవిష్యత్ తరాల వారు అతన్ని ఆరాధించటానికి అవకాశం కలిగేది.

ఇప్పుడు నా వ్యాపారం బాగా వృద్ధిచెందుతూవుంది. నా పరిస్థితులు బాగా మెరుగుపడుతున్నాయి. నా వార్తా

పత్రికవల్ల ఎనలేని లాభాలు కలుగుతున్నాయి. మా రాష్ట్రం లోనే గాక ఇరుగు పొరుగు రాష్ట్రాల్లోకూడ నాది ఒక్కటే పత్రిక అయింది. "మొదటి వేయిపౌనులను సంపాదించటం కష్టం. రెండో వేయిపౌనులను సంపాదించటం సులభం" అనే విషయం నాకిప్పుడు బాగా బోధపడుతున్నది. ఎందుకంటే లాభాన్ని చేకూర్చే స్వభావం డబ్బులోనే ఉంది.

కరోలినాలోని జాయింట్ వ్యాపారం బాగా సాగుతున్నది. అంచేత నా దగ్గర పనిచేస్తున్న కార్మికుల్ని తలాొక రాష్ట్రంలోనూ తగిన సాధనసామాగ్రిని కూర్చి ప్రెస్ వ్యాపారం పెట్టించాలనే అభిప్రాయం కలిగింది. అలాగే చేశాను. వారిలో చాలామంది వ్యాపారాన్ని బాగా నిర్వహించారు. మా ఒడంబడిక కాలం, ఆరుసంవత్సరాలు పూర్తిఅయ్యే సరికి వారు స్వంతపెట్టుబడితో వ్యాపారాన్ని నడపగల స్తోమత సంపాదించారు. సమిష్టి వ్యాపారం సాధారణంగా స్పర్థలతో సమాప్తమౌతుంది. కాని, నా విషయంలో చాలా సుఖంగానే గడిచింది. దీనికి కారణం ప్రతివిషయం లోను నేను ఎంతో జాగ్రత్తవహించాను. ప్రతిచిన్న అంశాన్ని కూడా స్ఫుటంగా ఒడంబడికలో పొందుపరిపించాను. అందుచేత వివాదానికి తావులేకపోయింది. సమిష్టి వ్యాపారంలో దిగేవారందరికీ నేను సలహా యివ్వదల్చుకున్నాను. భాగస్వాములిద్దరికి వ్యాపారంలో దిగేసమయంలో పరస్పరం ఎంతగా ఆదరాభిమానాలున్నప్పటికీ క్రమంగా వ్యాపార నిర్వహణలో స్వల్పవిషయాలపై కూడ బేధాభిప్రాయాలు కలగటం, స్పర్థలు పెరగటం జరగవచ్చు. దీనిఫలితంగా చివ

రికీ స్నేహబాంధవ్యం భగ్నమైపోవటం, కోర్టులోకెక్కటం, విషమ పరిణామాలను అనుభవించటం జరుగుతుంది.

పెన్సిల్వేనియాలో స్థిరపడటం నాకెంతో సంతోషంగా ఉంది. కాని రెండువిషయాలు నాకు అసంతృప్తిగా ఉన్నాయి. అక్కడ రాష్ట్రానికి తగినంత రక్షణ లేదు. యువకులకు తగినన్ని విద్యాసౌకర్యాలు లేవు. అందుచేత 1743లో ఒక ఎకాడమీ స్థాపించటానికి కావలసిన ప్రతిపాదనలు నేను తయారు చేశాను. అప్పుడు ఖాళీగా ఉన్నాను. రెవరెండ్ మిస్టర్ పీటర్సు ఈ కార్యభారాన్ని వహించటానికి తగినవారని నేను భావించాను. ఈ విషయాన్ని నేనతనికి సూచించాను. కాని, అతనికి కొన్ని వ్యాపకాలల్లో ఎక్కువలాభాలు లభించే అవకాశం ఉండటంచేత తానందుకు నడుము కట్టుకుంటానికి అంగీకరించలేదు. మరొకరు సమర్థులైన వారు లేకపోవటంచేత నా ప్రతిపాదనలు కొంతకాలం వెలుగులోనికి రావటానికి అవకాశంలేకపోయింది. కాని ఆ తర్వాత సంవత్సరం నేను విజయాన్ని సాధించాను. 1744 లో ఫిలసాఫికల్ సొసైటీని స్థాపించాను. ఆ సందర్భంలో నేను వ్రాసిన వ్యాసం నా రచనల సంపుటిలో కనిపిస్తుంది.

ఆ తరువాత రాష్ట్రానికి కావలసిన రక్షణగురించి ఆలోచించాను: చాలా సంవత్సరాలుగా స్పెయిన్, గ్రేట్ బ్రిటన్‌లకు యుద్ధం జరుగుతూ ఉంది. ఇప్పుడు స్పెయిన్ ఫ్రాన్సుతో చేరింది. ఇది మారాష్ట్రానికి చాలా ప్రమాదకరమైన విషయం. ఇందువిషయమై అప్పటి రాష్ట్రగవర్నరు థామస్ క్వేకర్ అసెంబ్లీలో రాష్ట్రరక్షణకు సంబంధించిన

ఒక సైనిక చట్టాన్ని ఆమోదింపచేసి కొంత మేలుచేయటానికి ప్రయత్నించాను. కాని అతని ప్రయత్నాలేమీ సఫలీకృతం కాలేదు. అప్పుడు నేనొక విషయం ఆలోచించాను. ప్రజలందరూ ఐచ్ఛికంగా ముందుకువచ్చి ఒక సంఘంగాఏర్పడితే కొంత ప్రయోజనముంటుందని భావించాను. ఇందుకోసం "ప్లెయిన్ ట్రూత్" అనే పేరుతో నేనొక కరపత్రాన్ని ప్రకటించాను. ఇందులో మనరాష్ట్రంయొక్క రక్షణలేని పరిస్థితినీ అందరూ ఐక్యమై క్రమశిక్షణతో ఒక రక్షణ శ్రేణిని నిర్మించుకోవలసిన ఆవశ్యకతనూ వివరించాను. ఈ కరపత్రం అనుకోనివిధంగా ఆశ్చర్యకరమైన ఫలితాల నిచ్చింది. ఈ సంఘాన్ని స్థాపించవలసిన భారం నా మీదనే వేశారు. ప్రప్రథమంగా పౌరులందరూ సమావేశం కావాలని నేను చెప్పాను. సమావేశం ప్రారంభమయింది. జనం బాగానే వచ్చారు. నేను కొన్ని అచ్చు ప్రతులను తయారుచేసి అందరికీ పంచాను. దాన్ని చదివి వివరించి చెప్పి సంతకాలు చేయమని అభ్యర్థించాను. ఏ విధమైన వ్యతిరేకభావం కనిపించకుండా అందరూ సంతకాలు చేశారు. ఆ రోజు సమావేశమయ్యాక మేము లెఖ్ఖచూసుకునే టప్పటికి అంగీకరించిన సభ్యుల సంఖ్య పన్నెండు వందలవరకు తేలింది. ఈ అచ్చుప్రతులను రాష్ట్రమంతా పంచిపెట్టాము. క్రమంగా సభ్యుల సంఖ్య పదివేలవరకు పెరిగింది. వారు ఆయుధాలతో సంసిద్ధులై వేరువేరు దళాలుగా, పటాలాలుగా ఏర్పడి వారానికొకసారి సమావేశమై శిక్షణ పొందాలని నిర్ణయించబడింది. స్త్రీలు కొన్ని విరాళాలుప్రోగుచేసి ఉత్సాహాన్ని ప్రకటించారు.

ఫిలడల్ఫియా పట్టాలంలోని వివిధ్న దళాల ఆఫీస ర్లందరూ సమావేశమై నన్ను కల్నల్‌గా ఎన్నుకున్నారు. అందుకు నాకుగల అర్హతను శంకించి కొంత పలుకుబడి, ప్రాభవముగల మిస్టర్ లారెన్స్ అనే వ్యక్తిని ఆ ఉద్యో గానికి సిఫార్సు చేశాను. అతడు అలాగే నియమింపబడ్డాడు. ఆ తరువాత పట్టణ దిగువభాగంలో కోట బురుజు నిర్మించి అందులో ఫిరంగిని ఏర్పాటుచేయటానికి కావలసిన డబ్బును సమకూర్చుకొనేందుకు ఒక లాటరీ పద్ధతిని ప్రతిపాదించాను. ఇది సఫలీకృతమైంది. వెంటనే కోట బురుజు సిద్ధమైంది. బోస్టన్ నుంచి ఒక పాతఫిరంగిని తెప్పించాము. కాని అది చాలక మరికొన్నిటికోసం ఇంగ్లండుకు వ్రాశాము.

ఈలోగా కల్నల్ లారెన్స్, విలియం అల్లెన్, అబ్రాం టైలర్‌లతో కలిసి గవర్నరు క్లింటన్ దగ్గర కొన్ని ఫిరంగులు అప్పుతీసుకురావటానికి నేను న్యూయార్కు బయలుదేరాను. అతడు మొట్టమొదట నిరాకరించాడు. కాని ఆ తరువాత విందుసమయంలో ఆచార ప్రకారం మోతాదు మించి మెడైరా మద్యం సేవించటంచేత ఆ సమయంలో ఆరు ఫిరంగులు అప్పుగా యివ్వటానికి అంగీక రించాడు. మరో రెండు మోతాదులు తీర్థం సేవించాక ఆ సంఖ్య పది వరకు పెరిగింది. చివరకు అతిమర్యాదగా పదు నెనిమిది ఫిరంగులు అప్పుగా యివ్వటానికి అంగీకరించాడు. అవి చాలా మంచివి. వెంటనే వాటన్నింటినీ మా కోట బురుజుకు రవాణా చేశాం. యుద్ధం జరుగుతున్నంతకాలం రాత్రి సమయాల్లో అక్కడ కాపలా ఉంచబడింది. నేను

కూడా సాధారణ సైనికునిలా నా వంతు డ్యూటీ చేస్తు న్నాను.

ఈ విషయాల్లో నా కార్యక్రమం గవర్నరుకు, కౌన్సి లుకు కూడా ఆమోదయోగ్యంగానే ఉంది. వారు నన్ను పూర్తిగా విశ్వసించి అవసర సమయాల్లో నాతో సంప్ర దింపులు జరిపేవారు. మా కార్యక్రమానికి భగవంతుని ఆశీస్సులుపొందటానికి ఒక నిరాహారదీక్షను నేను ప్రదిపా దించాను. వారు ఈ ప్రతిపాదనను అంగీకరించారు. కాని ఇలాంటి నిరాహారదీక్ష ఆ రాష్ట్రంలో క్రొత్తది కావటంచేత దానికి కావలసిన ప్రకటన ఎలా తయారుచేయాలో కార్య దర్శికి తెలియలేదు. నేను న్యూ ఇంగ్లండులో చదివిన కాలంలో సంవత్సరాని కొకసారి ఉపవాసంచేయటం అల వాటు. అది నా కిక్కడ ఉపయోగపడింది. సాంప్రదాయ బద్ధమైన శైలిలో దాన్ని నేను తయారుచేయగల్గాను. అది జర్మన్‌లోకి అనువదింపబడి రెండు భాషల్లోను ప్రకటించ బడింది. క్రమంగా ఇది రాష్ట్రమంతా పాకింది. ఇది అన్ని వర్గాలకుచెందిన మతాచార్యులకు తమ తమ అనుచరులను ఈ సంఘంలో చేర్పించటానికి అవకాశం యిచ్చింది. కాని ఈ ఏర్పాట్లు క్వేకర్లకు కొంత కష్టంకలిగించాయ్.

ఈ విషయంలో నా కార్యకలాపాలు క్వేకర్లకు కష్టం కలిగించవచ్చని కొందరు స్నేహితులు అనుకున్నారు. అసెం బ్లీలో వారే అధిక సంఖ్యాకులు కావటంచేత తత్ఫలితంగా అసెంబ్లీలో నాకుగల స్థానం పోవచ్చని కూడా వారను కున్నారు. అసెంబ్లీలో కొందరు స్నేహితులుగల ఒక యువ

కుడు నా ఉద్యోగాన్ని తాను పొందటానికి ప్రయత్నిస్తూ నాకో సలహా యిచ్చాడు. రాబోయే ఎన్నికల్లో అసెంబ్లీ వారు ఎలాగో నా ఉద్యోగం తీసివేస్తారుగనుక ఇప్పుడే నేను రాజీనామా చేయటం మంచిదని అతని సలహా. సాధారణంగా ఏ ఉద్యోగాన్ని అడక్కపోవటం, లభించిన ఉద్యోగాన్ని తిరస్కరించకపోవటం పెద్ద పెద్దవాళ్ళు ఆచరించె ముఖ్యనియమం గనుక నేను ఉద్యోగానికి రాజీనామా యివ్వదల్చుకోలేదని చెప్పాను. నా ఉద్యోగాన్ని వారు మరొకరికి యివ్వదల్చుకుంటే ఇవ్వవచ్చు, కాని నా అంతట నేను మాత్రం రాజీనామా చేయదల్చుకోలేదు. ఆ విషయం అంతటితో సమసిపోయింది. తరువాత ఎన్నికలలో ఏకగ్రీవంగానే నేను ఎన్నుకోబడ్డాను. కొందరు అయిచ్ఛికంగా ఉద్యోగం వదిలి నేను వెళ్తే కొంత సంతోషించేవారేమో కాని వారంతట వారు నన్ను తీసివేయటానికి తగిన కారణాలన్నీ వారు చెప్పలేరు. కేవలం సైనికసంఘంలో నాకుగల శ్రద్ధాసక్తుల్ని సాకుగా వారునన్ను తీసివెయ్యలేరు.

అందులో ఏ ఒక్కరికీ దేశరక్షణాకై మేము పాటు పడటం అయిష్టంగా లేదని నాకు తెలుసు. కావల్సిందల్లా అందుకై వారిని ఏ సహాయము అడక్కుండా ఉంటేచాలు. చాలామంది యుద్ధానికి వ్యతిరేకించినా దేశరక్షణకు అనుకూలత చూపుతున్నారు. ఈవిషయంలో అనేక కరపత్రాలు ప్రకటించబడ్డాయి. అందులో కొన్నింటిని క్వేకర్లుకూడా ప్రకటించారు. వారి మనస్తత్వాన్ని తెలుసుకుంటానికి ఒక సంఘటన నాకు సాయపడింది. ఒక కోటబురుజును కట్టే

ప్రయత్నాలిని ప్రోత్సహించాలని ప్రతిపాదించబడింది. మా నియమాలప్రకారం తరువాత సమావేశంవరకూ ఏ విధంగా నూ డబ్బు ఖర్చుపెట్టకూడదు. సంఘంలో మొత్తం ముప్పది మంది సభ్యులున్నారు. అందులో ఇరువది యిద్దరు క్వేకర్లు. తక్కినవారు ఎనమండుగురు. మా ఎనమండుగురము అనుకున్న ప్రకారం సమావేశానికి హాజరైనాం. కొందరు క్వేకర్లు మాతో కలుస్తారని ఊహించినప్పటికి మాకు మెజారిటీ లభిస్తుందనే ఆశలేదు. మిష్టర్ జేమ్సు మారిస్ అనే ఒక క్వేకరు మాత్రం ముందుకువచ్చి చాలామంది స్నేహితులు ఇందుకు విరుద్ధంగా ఉన్నారని, ఇది చివరికి ముదిరి సంఘమే రద్దై పోయే ప్రమాదమున్నదని చెప్పాడు. దానికిసంఘంలో ఎలాగో వారిదే మెజారిటీ గనుక వారి అభిప్రాయమే నెగ్గుతుందని, దానికి మేము తలవొగ్గుతామని చెప్పాను. సమావేశం ప్రారంభమైంది. అంతకుముందు ఇద్దరు క్వేకర్లు నన్ను కలుసుకున్నారు. వారిలో ఎనమండుగురు ప్రత్యేకంగా సమావేశం జరిపి అవసరమైతే మాకు అనుకూలంగా ఓటుచేయటానికి నిర్ణయించుకున్నారట. అలా బహిరంగంగా వారి పక్షానికి ఎదురుతిరగటం కొంత అనైకమత్యానికి దారితీస్తుందని, అంచేత మరీ అవసరమైనప్పుడే వార్ని సహాయానికి పిలవమని చెప్పారు. ఈ విధంగా మెజారిటీ రావటం తథ్యమని భావిస్తూ సభాసమావేశానికి వెళ్ళాను. సమావేశం మరొకగంట వరకు పొడిగించబడింది. చివరకు తీర్మానం 8–1 తో ఆమోదింప బడింది.

ఆ వర్గానికే చెందిన పండితుడు, గౌరవనీయుడు అయిన మిస్టర్ లోగన్ ఈ రక్షణచర్యలను సమర్థించి, అందుకు బలమైన కారణాలను నిరూపిస్తూ తన వారందరికీ వ్రాశాడు. నేను చిరకాలం అసెంబ్లీలో ఉన్నాను. అందులో ఎప్పుడూ క్వేకర్లే అధికసంఖ్యాకులు. యుద్ధానికి వ్యతిరేకమైనవారి నియమంవల్ల సైనిక సంబంధమైన కార్యకలాపాలకు సంబంధించిన నిర్ణయాలు తీసుకునేటప్పుడు వారుచాలా ఇబ్బంది పడేవారు. రాజుయొక్క ప్రతిపాదనను సూటిగా తిరస్కరించి ప్రభుత్వాన్ని కించపరచటం వారికి కష్టంగా ఉండేది. అందుచేత సైనికసహాయం అనే పదాన్ని ఉపయోగించకుండా చక్రవర్తి ఉపయోగమునకు అనేపదాన్ని వాడేవారు. దానిఅర్థం ఏమిటో నిర్వచించటానికి వారెన్నడూ ప్రయత్నించలేదు. కాని అలాంటి ప్రతిపాదన ప్రత్యక్షంగా చక్రవర్తినుంచి రానప్పుడు మరొకపదం కనిపెట్టబడేది. లూయిస్‌బర్గ్ పటాలానికి తుపాకిమందు కావాల్సివచ్చినప్పుడు న్యూఇంగ్లండు ప్రభుత్వము కొంతసహాయం కావాలంటూ పెన్సిల్ వేనియాను అర్థించింది. గవర్నరు థామస్ దీన్ని అసెంబ్లీలో ప్రతిపాదించాడు. వారు తుపాకిమందు కొనేందుకు ఆర్థికసహాయం చేయటానికంగీరించక రొట్టె, పిండి, గోధుమ, ఇతర ఆహారధాన్యాలు కొనుక్కునేందుకుగాను మూడువేలపౌన్లు సహాయంచెయ్యటానికంగీకరించారు. కౌన్సిలులోని కొందరు క్వేకర్లను ఇంకా ఇబ్బంది పెట్టటానికి ఆ డబ్బును అంగీకరించవద్దని గవర్నరుకు చెప్పారు. గవర్నరు ఆర్థికసహాయం అడిగింది రొట్టె, పిండి మున్నగు

వాటికోసం కాదాయెను. కాని గవర్నరు ఆ డబ్బు అంగీకరిస్తూ 'వారి మాటల్లోని అర్థం నాకు బాగా తెలుసు. ఇతర ఆహారధాన్యాలు అని వారన్నమాటకు అర్థం, తుపాకిమందే" అన్నాడు. ఆ తరువాత ఆ డబ్బుతో తుపాకిమందే కొనబడింది. దానికి క్వేకర్లు ఏవిధమైన అభ్యంతరమూ చెప్పలేదు.

క్వేకర్లకు యిలాంటి చిక్కులు కల్గటానికి కారణం ఏవిధమైన యుద్ధచర్యలూ చట్టవిరుద్ధమనే నియమాన్ని వారు లోగడ ప్రకటించటం. ఆ తరువాత వారి అభిప్రాయాలు మారినా ఒకసారి ప్రకటించారుగనుక తొందరగా ఆ సిద్ధాంతాన్ని మార్చుకోలేకపోయారు. ఇది నాకొక విషయాన్ని జ్ఞప్తికి తెస్తూంది. డంకర్సు వర్గాన్ని స్థాపించినవారిలో ఒకడైన మైఖేల్ వెల్ఫేర్ అనేవ్యక్తిని నేను కలుసుకున్నాను. అతడు తమ వర్గంవారిని కొందరు విపరీతంగా దూషిస్తున్నారనీ, లేనిపోని అపవాదులు వేస్తున్నారనీ, చెప్పాడు. ఏదైనా క్రొత్తమతం జన్మించినప్పుడు యిలా దూషించబడటం సర్వసాధారణమేనని, కానీ వారు తమనియమ నిబంధనలను స్ఫుటంగా ప్రచురించి ప్రచారంచేస్తే కొంతఉపయోగం ఉంటుందనీ చెప్పారు. అతడు దానికి జవాబుగా ఈ విషయం తమలో ఒక్కసారి ప్రతిపాదింపబడి నిరాకరింప బడిందని చెప్పి దానికి కారణం యిలా వివరించాడు:

"మనం సంఘంగా ఏర్పడిన తర్వాత భగవానుడు మన మనస్సులను వికసింపజేశాడు. మనం ఒకప్పుడు సత్యాలని నమ్మినసిద్ధాంతాలు అసత్యాలని, అసత్యాలని భావించిన సిద్ధాంతాలు సత్యాలని చెప్పుకుంటున్నాం. రోజురోజుకూ

ఆయన మనకు ఎక్కువవిజ్ఞానాన్ని ప్రసాదిస్తున్నారు. మన సిద్ధాంతాలు అభివృద్ధిచెంది తప్పిదాలు తగ్గుముఖం పడ్తు న్నాయ్. ఇలా అభివృద్ధి పథంలో పురోగమిస్తున్న మనం ఇంకా అంతిమలక్ష్యాన్ని చేరుకోలేదు. పరిపూర్ణమైన తాత్విక ఆధ్యాత్మిక, విజ్ఞానాన్ని ఆర్జించలేదు. ఈ అసంపూర్ణమైన జ్ఞానంతో ఏ సిద్ధాంతాన్ని మనమిప్పుడు ప్రకటించి దానికి బద్ధులమైనా మన అభివృద్ధి కుంటుపడిపోతుంది. ఇంకా అభి వృద్ధి సాధించటముపై మనకు విముఖత్వం కలగవచ్చు. మన తరువాతి తరాలవారు వారిపెద్దలు చెప్పిందే వేదమనే నమ్మ కంతో ఆ సిద్ధాంతాన్ని వదిలిపెట్టటానికి అంగీకరించక పోవచ్చు "

మానవజాతి చరిత్రలో ఒకానొక మతంలో యింత వినయసంపత్తి కనిపించటానికి యిదే మొదటి ఉదాహరణ. తక్కిన మతాలన్నీ పరిపూర్ణసత్యాన్నిసాధించినట్లూహించు కుంటూ తమ అభిప్రాయాన్ని వ్యతిరేకించిన వారందరూ తప్పుదారిన పడి పోతున్నారని జాలిపడ్తారు. మంచులో ప్రయాణం చేస్తూన్న మనిషికి తనకు కొంచెం దూరంలోగల వారందరూ మంచుతో కప్పబడినట్లు కనిపిస్తారు. తనుకూడా మంచుతో కప్పబడినట్లు అతనికి కనిపించదు. నిజానికిఅందరి లాగా అతన్నికూడా మంచు ఆవరించేఉంది. ఈ మతాల యొక్క వైఖరి ఇంచుమించు యిలాగేఉంటుంది. ఈచికాకు నుండి బయట పడ్డంకోసం క్వేకర్లు అస్సెంబ్లీలోంచి క్రమంగా వైదొలగ నారంభించారు. అనుకున్న నియమాన్ని వర్జించ

టం కంటె అధికారాన్ని పరిత్యజించటానికే వారంగీక రించారు.

1742 లో చలికాచుకుంటానికి నేను ఒక క్రొత్తరకం స్టౌ కనిపెట్టాను. దీనివల్ల చాలా వంటచెఱుకు పొదుపుచేయ వచ్చు. దీని నమూనాను నా చిన్ననాటి స్నేహితుడైన మిస్టర్ రాబర్ట్ గ్రేస్ అనేవ్యక్తికి బహూకరించాను. అతనికి ఒక ఇనపకొలిమి ఉంది. ఎక్కువమంది యీ స్టౌలను ఉప యోగించటం వల్ల వీటికి కావలసిన ప్లేటులను తయారు చేయ టం అతనికి లాభసాటిగా కన్పించింది. ఈ స్టౌలను యింకా ప్రచారం లోకి తేవటానికి నేనొక కరపత్రం ప్రకటించాను. "క్రొత్తగా కనిపెట్టబడిన స్టౌను గురించిన కథ. దీని నిర్మా ణము, ఇది పనిచేయు విధానము, ఇతర పద్ధతులకంటె యిందులో గల ఎక్కువప్రయోజనము, దీనిపై చేయబడిన విమర్శలకు జవాబులు ... ..." అంటూ.

ఈ కరపత్రం చాలా మంచిఫలితాల నిచ్చింది. ఈ స్టౌ నిర్మాణాన్ని చూసి గవర్నర్ థామస్ ముగ్ధుడైపోయాడు. కొన్ని సంవత్సరాలపాటు దీనికి సంబంధించిన పేటెంటు హక్కులను నా కిస్తానని వాగ్దానం చేశాడు. అలాంటి సంద ర్భాల్లో నేను అనుసరించదలుచుకున్న సిద్ధాంతరీత్యా యీ వాగ్దానాన్ని నేను ఉపయోగించుకోలేదు. ఆ సిద్ధాంతం యిది. "ఇతరులు కనిపెట్టిన అనేక వస్తువులవల్ల మనం అనేక లాభాలు పొందుతున్నాం. అంచేత మనం ఏదన్నా కనిపెట్టి నప్పుడు దాన్ని విశాలహృదయంతో ప్రతిఫలాపేక్ష లేకుండా ఇతరులకు అందజేయాలి."

లండన్‌లో ఒకానొక ఇనపవర్తకుడు నా కరపత్రాన్ని ఆధారంగా తీసికొని ఒక స్టౌ నమూనాను తయారు చేశాడు. అది తాను కనిపెట్టించని చెప్పుకుంటానికి వీలుగా కొన్ని స్వల్పమైన మార్పులు చేశాడు. ఆ మార్పులవలన దానికి ఏమీ ప్రయోజనం కలుగకపోగా ఇబ్బందే కలిగింది. అంతే కాదు. దానికి – పేటెంటు హక్కులుగూడా తనే సంపాదించి పుష్కలంగా గడించుకున్నాడు. ఆ విషయం ఆ తరువాత ఎవరో చెప్పారు. నేను కనిపెట్టిన వస్తువులకు పేటెంటు హక్కులు ఇతరులు పొంది లాభాలు ఆర్జించటం జరిగింది; ఈ ఒక్క సందర్భంలోనే కాదు. కాని అలాటివారిపైనే నెన్నడూ చర్యతీసుకో లేదు. వాటివల్ల లాభాలు ఆర్జించటం, అలాటివ్యక్తులతో వివాదాలు పెంచుకోవటం నాఅభిప్రాయం కాదు. ఇరుగు పొరుగు అన్ని కాలనీలలోను ప్రతి ఇంటిలోనూ యీ స్టౌ లనే ఉపయోగిస్తున్నారు. దీనివలన ఎంతో పొదుపు కలుగుతోంది.

సంధి జరిగినతర్వాత సైనికసంఘముయొక్క అవుసరం తీరిపోయింది. తిరిగి ఒక మొకాడమీ స్థాపించాలనే విషయం మీద నా దృష్టి కేంద్రీకరించబడింది. అందుకు ప్రాథమికంగా ఉత్సాహవంతులైన స్నేహితుల నందరిని ఒక సంఘంగా జేర్చాను. తరువాత "పెన్సిల్‌వేనియాలోని యువకుల విద్యా సముపార్జనకు సంబంధించిన ప్రతిపాదనలు" అనే పేరుతో ఒక కరపత్రాన్ని ప్రకటించి పంచిపెట్టాను. అందుకు తగిన అనుకూల వాతావరణం ఏర్పడగానే ఒక మొకాడమీ స్థాపించి నిర్వహించటానికి అవసరమైన విరాళా

లను సేకరించటం ప్రారంభించాను. ఈ విరాళాలు దఫాల వారీగా అయిదు సంవత్సరాల్లో యిచ్చేటట్లు విభజించాను. విరాళాలు భారీగా నే షుమారు అయిదు వేలపౌన్ల వరకు ప్రోగు పడినయ్.

ఈ ప్రతిపాదనలకు వ్రాసిన ఉపోద్ఘాతంలో నా పేరును మాత్రం ఉదహరించ లేదు. 'ప్రజా సేవలో ఉత్సాహవంతు లైన పెద్దలు' అని మాత్రమే ప్రకటించబడింది. ఇలాంటి విషయాలలో సాధ్యమైనంతవరకు నా పేరు బయటకు రానీయకూడదనే నియమాన్ని పాటించాను. విరాళము నిచ్చిన దాతలందరూ కార్యనిర్వహణకు ఇరువదినాలుగు మంది సభ్యులను ఎన్నుకున్నారు. అప్పటి అటార్నీ జనరల్ అయిన మిస్టర్ ఫ్రాన్సిస్‌ను, నన్ను కలిపి యీ కాడమీ నిర్వ హణకు కావల్సిన నియమ నిబంధనలను తయారు చెయ్య టానికి నియమించారు. ఒక భవనం అద్దెకుతీసుకోబడింది. ఉపాధ్యాయులు నియమించబడ్డారు. 1749 లో పాఠశాల ప్రారంభించబడింది.

అనతికాలంలోనే విద్యార్థుల సంఖ్య వృద్ధిచెందింది. ఆ భవనం ఇరుకుగా కన్పించింది. మేము తగిన భవనాన్ని నిర్మించటానికి విశాలమైన స్థలంకోసం వెదుకుతున్నాం. ఇంతలో భగవదానుగ్రహంవల్ల మాకు బాగా ఉపకరించే ఒక విశాలమైన భవనం లభించింది. ఇది లోగడ మిస్టర్ వైట్‌ఫీల్డు ఉపన్యాసాలు వినటంకోసం శ్రోతలందరూకలసి నిర్మించినదే. ఆ భవనం మాకు ఈ విధంగా లభించింది.

భవన నిర్మాణానికి విరాళాలు అన్ని వర్గాలవారినుండీ వసూలుచేయబడిన విషయం గమనించాలి. అంచేత ధర్మ కర్తలను ఎన్నుకోవటంలో తగిన జాగ్రత్తతీసుకోబడింది. ఏ వర్గానికీ అధిక ప్రాముఖ్యం యివ్వబడలేదు. అలాటి ప్రత్యేక ప్రాముఖ్యతలు వారి వారి ప్రత్యేక లాభాల కుపయోగపడి ప్రాథమిక ఆశయానికే ప్రమాదం రావచ్చు. అందుచేత ఇంగ్లండు చర్చికి చెందిన ప్రతినిధి ఒకడు, ప్రెస్ బిటేరియన్ ప్రతినిధి ఒకడు, మొరేవియన్ ప్రతినిధి ఒకడు, బాప్టిస్టు ప్రతినిధి ఒకడు, -చొప్పున అన్ని వర్గాలకు ప్రాతినిధ్యం కల్పించబడింది. మరణంవల్ల ఖాళీఅయిన స్థానాలు సభ్యులచే ఎన్నుకోబడినవారిచే భర్తీ చేయబడ్డాయి. తోటివారితో పొందికలేని మొరేవియన్ ప్రతినిధి మరణానంతరం ఆ వర్గానికి ప్రాతినిధ్యం రద్దుచేయాలని నిర్ణయించబడింది. అప్పుడు ఒకే వర్గానికి రెండు స్థానాలురాకుండా చేయటం ఒక సమస్య అయింది.

అనేకమంది పేర్లు ప్రతిపాదించబడ్డాయ్. అంచేత ఏ ప్రతిపాదనా అంగీకరించబడలేదు. చివరికి ఒకవ్యక్తి అన్ని విషయాలూ ఆలోచించి నా పేరు ప్రతిపాదించాడు. ఏ వర్గానికీచెందని ఒక పెద్దమనిషిగా నన్ను అతను గుర్తించాడు. మొట్టమొదట గల ఉత్సాహం ధర్మకర్తలలో క్రమంగా నీరసించింది. ఇంకా విరాళాలు సంపాదించటం సాధ్యంకాలేదు. స్థలానికి అద్దెచెల్లించటం, భవనానికిచెందిన కొన్ని అప్పులుతీర్చటం ఎలాగో అర్థంకాక వారు చాలా చీకాకుపడుతున్నారు. నేను అటు భవనానికి, ఇటు ఎకాడ

మీాకి చెందిన రెండు ధర్మకర్తృత్వ సంఘాల్లోనూ సభ్యుణ్ణి కావటంచేత ఉభయులమధ్య సులభంగా రాయబారాలు సాగించి, ఒక ఒప్పందలకు తీసికొనిరాగలిగాను. దాని ననుస రించి భవనానికి చెందిన ధర్మకర్తలు దాన్ని యొకాడమీాకి ఇచ్చివేయాలి. యొకాడమీావారు దానిపైగల ఋణాలను పరిష్కరించాలి. దానికితోడుగా మతప్రబోధకులు ఎవరు వచ్చినా వారు సభలు జరుపుకోటానికి అందులో అవకాశం కల్పించాలి. అందులో బీదపిల్లలకు ఉచిత విద్యాసౌకర్యాలు ఏర్పాటుచేయాలి. ఆ ప్రకారం ఒడంబడికలు వ్రాసు కున్నారు. యొకాడమీావారు అప్పులుతీర్చి భవనాన్ని దాని ప్రాంగణాన్ని స్వాధీనంచేసుకున్నారు.అందులోని బ్రహ్మాండ మైన హాలును చిన్న చిన్న గదులుగా విభజించి వేరు వేరు తరగతులకు కేటాయించారు. మరికొంతస్థలం కొనబడింది. పాఠశాల క్రొత్త భవనంలోకి మార్చబడింది. భవనంలోని మార్పులకు కావలసిన సాధన సామాగ్రి కొనటం, పనివారిని నియమించటం, పని జరిపించటం నా బాధ్యత అయింది. నేను ఈ కార్యభారాన్ని ఆనందంతో స్వీకరించాను. అంతకు ముందే మిస్టర్ డేవిడ్ హాల్ అనే వ్యక్తిని నాతో కలసి సమిష్టి వ్యాపారంచేయటానికి ఒడంబడిక చేసుకోవటం చేత, ఈ క్రొత్త కార్యభారాన్ని నేను స్వీకరించగల్గాను. మిస్టర్ డేవిడ్‌హాల్ సమర్థుడు. నమ్మకమైన స్నేహితుడు. అతడు నాదగ్గర నాలుగు సంవత్సరాలు పనిచేయటంచేత అతని ప్రవర్తన నాకు బాగా తెలుసు. ప్రెస్ వ్యాపార మంతా అతని భుజాలమీాద వేసుకొని లాభాలనుమాత్రం

నాకు ఖచ్చితంగా యిచ్చేవాడు. అలా ఎనిమిది సంవత్సరాల పాటు ఉమ్మడి వ్యాపారం మా యిద్దరి మధ్యా జేగీయమానంగా సాగింది.

గవర్నరు ఆదేశం ప్రకారం ఒక క్రొత్త చార్టరుతో యెకాడమీ ధర్మకర్తృత్వ సంఘం పునర్నిర్మింపబడినది. బ్రిటన్ నుంచి వచ్చిన విరాళాలవల్ల, అస్సెంబ్లీవారిచ్చిన గ్రాంటువల్ల విరాళాలు బాగా పెరిగి యెకాడమీ బాగా వృద్ధిచెందింది. తత్ఫలితంగా ఫిలడల్ఫియా విశ్వవిద్యాలయం స్థాపించబడింది. మొట్టమొదటినుంచీ దీనికి నేను ధర్మకర్తగానే ఉంటున్నాను. ఈ నలుబది సంవత్సరాల్లో ఎందరో యువకులు ఈ విశ్వవిద్యాలయంలో విద్యాబుద్ధు లభ్యసించి, శక్తి సామర్థ్యాలను పెంపొందించుకొని ఉన్నత పదవులు నిర్వహించగల అర్హత సంపాదించి, మాతృదేశానికి మణిదీపాలై ప్రకాశించటం నాకెంతో ఆనందదాయకంగా ఉంది. ఆ విధంగా నా వ్యక్తిగత వ్యాపారంనుంచి నేను విముక్తి పొంది కావల్సినంత ధనాన్ని గడించి, ఆ తరువాతి జీవితంలో అధిక భాగాన్ని తాత్వికవిజ్ఞానార్జనకు, వినోదాలకు వెచ్చించగల్గాను. ఇక్కడిక ఉపన్యాసా లివ్వటంకోసం ఇంగ్లండు నుంచివచ్చిన డాక్టర్ స్పెన్సు దగ్గరగల ఉపకరణాలన్నీ నేను కొని, అత్యంత శ్రద్ధాసక్తులతో విద్యుత్ సంబంధమైన పరిశోధనలు ప్రారంభించాను. కాని ప్రజలు బహిరంగ కార్య కలాపాలకు నన్ను ఆహ్వానిస్తున్నారు. గవర్నరు నన్ను శాంతి సంఘంలో నియమించాడు. నగర పౌరసభ నన్ను సాధారణ సభ్యుడుగా ఎన్నుకొంది. తరువాత పౌరు

లందరూ నన్ను అసెంబ్లీ సభ్యునిగా ఎన్నుకున్నారు. ఈ చివరి ఉద్యోగం నాకు ఆనందాన్ని కలిగించింది. చాలా కాలం కేవలం గుమాస్తా పదవిలో అసెంబ్లీలో కూర్చొని విసుగుకలిగించే ఎన్నో ఉపన్యాసాలు విన్నాను. నాకు మాత్రం మాట్లాడటానికి ఎన్నడూ అవకాశం లభించ లేదు. అదీగాక అసెంబ్లీ సభ్యుడనైతే ఇంకా ఎక్కువ మంచి పనులు చేయగలననే నమ్మకం నాలో ఉంది. నాకు కలిగిన ఈ అదృష్టాలవల్ల నా ఆశలు యింకా పెరిగినయ్. అతి తక్కువ జీవితం ప్రారంభించిన నాకు ఈ అదృష్టాలు నాకు చాలా గొప్పగానే కన్పించినయ్. అంతేగాక ఇవన్నీ ప్రజలకు నాపైగల ఆదరాభిమానాలకు బలమైన తార్కాణాలు. ఇందులో ఏ ఒక్కటీ నేను అభ్యర్థించి సాధించుకున్నది కాదు.

శాంతిసంఘంలో న్యాయమూర్తిగా నాకార్యక్రమాలను నేను సక్రమంగా నిర్వహించటానికి నేను అనుకున్న దానికంటే ఎక్కువ న్యాయశాస్త్రపరిజ్ఞానంకావాలని తెలుసుకున్నాను. అసెంబ్లీలో ఇంతకంటే గురుతరమైన బాధ్యతలు నిర్వహించాలని సంతృప్తిపడి క్రమంగా ఈఉద్యోగంలోంచి నేను వైదొలగటానికి ప్రయత్నించాను. ఈ ఉద్యోగానికి నేను పది సంవత్సరాలు వరుసగా ఎన్నుకోబడ్డాను. ఎన్నడూ ఏ వ్యక్తినీ ఓటుయిమ్మని అడగ లేదు. కనీసం నాకీ ఉద్యోగం కావాలనే వాంఛితాన్నికూడా ప్రకటించ లేదు. నేను అసెంబ్లీలో నా స్థానంలో కూర్చోగానే నా కుమారుడు అందులో గుమాస్తాగా నియమించబడ్డాడు.

ఆ తరువాత సంవత్సరం 'కార్లిస్లె' వద్ద ఇండి యన్లతో ఒక ఒప్పందం చేసుకోవలసిన అవసరం కలిగింది. అందుకు నియమించబడిన సంఘంలో సభ్యులుగా పనిచేయటానికి కొందరి పేర్లను సూచించమని గవర్నరు అసెంబ్లీకి ఒక ఆదేశం పంపాడు. అస్సెంబ్లీ స్పీకరు మిష్టర్ నారిస్‌ను, నన్ను – వారు సూచించారు. ఆ తరువాత మేము కార్లిస్లే వెళ్ళి ఇండియన్లను కలుసుకున్నాము. వారికి బాగా త్రాగటం అలవాటు. అలా త్రాగినపుడు అడ్డదిడ్డంగా ప్రవర్తిస్తూ కయ్యానికి కాలు దువ్వుతూ ఉంటారు. అంచేత వారికి ఏవిధమైన మద్యం అమ్మకూడదని మేము నిషేధించాము. దానికి వారు నిరసన తెలియజేసినప్పుడు ఒడంబడిక కాలంలో సక్రమంగా ప్రవర్తిస్తే, ఆ తరువాత కావలసినంత 'రమ్' సరఫరా చేయగలమని చెప్పాము. వారు అందు కంగీకరించారు. ఒడంబడిక క్రమపద్ధతిలో ఇరుపక్షాల వారికి సంతృప్తికరంగా జరిగి పోయింది. ఆ తరువాత వారికి అనుకున్న విధంగా 'రమ్' సరఫరా చేయబడింది. ఇది మధ్యాహ్నంపూట జరిగింది. వారు మొత్తం స్త్రీలు, పురుషులు, పిల్లలు కలసి నూరు మంది ఉన్నారు. తాత్కాలికమైన నివాసాలు ఏర్పాటు చేయబడ్డాయి. సాయంత్ర మయ్యేసరికి పెద్దపెద్ద కేకలు, అల్లరి విని కమీషనర్లు అక్కడికి పరుగెత్తారు. అందరూ తాగి తందనాలాడుతూ తెగబడి పోట్లాడుకుంటున్నారు. వారి నల్లటి అర్ధనగ్న శరీరాలు చలిమంట మసక వెలుతురులో అస్పష్టంగా కనిపిస్తున్నాయ్. ఒకరివెనుక ఒకరు పరుగెత్తుతున్నారు. ఒకరినొకరు కొరకంచులతో కొట్టుకుంటున్నారు.

నరకంలోని దృశ్యాల భీభత్సం అక్కడ తాండవిస్తున్నది. వారిని అదుపులో పెట్టుట అసాధ్యమని గ్రహించి మేము మా బసలకు తిరిగివచ్చాము. ఒక అర్ధరాత్రివేళ వారిలో కొందరు వచ్చి ఇంకా 'రమ్' కావాలంటూ తలుపులు బాద సాగారు. కానీ మేము లక్ష్యపెట్టలేదు.

ఆ మర్నాడు వారు చేసినతప్పు తెల్సుకొని మాకు యిబ్బంది కలిగించినందుకు క్షమాపణ అర్థిస్తూ ముగ్గురు పెద్దల్ని పంపారు. అందులో ఒకడు తప్పును ఒప్పుకుంటూ దానికి కారణం 'రమ్' అని నిరూపించాడు. ఆ విషయాన్ని వ్యాఖ్యానిస్తూ "అన్ని వస్తువులనూ సృష్టించిన భగవంతుడు ప్రతి వస్తువునూ ఏదో ఒక ఉపయోగం కోసమే చేశాడు. ఏ వస్తువును ఏ ఉద్దేశంతో అతడు చేశాడో అందుకే అది ఉపయోగించ బడాలి. అతడు 'రమ్' ఎందుకు చేశాడు? ఇండియన్లు త్రాగటంకోసం. అంచేత త్రాగాల్సిందే" అన్నాడు. నిజమే. ఈ పశుతుల్యులను నిర్మూలించి పృథ్విని కష్టించి పనిచేసే కర్షకులకు అప్పజెప్పటమే దైవనిర్ణయమైతే అందుకు నిశ్చయంగా 'రమ్' ఒక సాధనమే. ఇంతకుముందు తీర ప్రాంతంలో నివసించిన తెగల వారందర్నీ ఇది నాశనం చేసింది.

1751 లో నా స్నేహితుడైన డాక్టర్ థామస్ బాండ్ కు ఫిలడల్ఫియాలో ఒక ఆసుపత్రి స్థాపించాలనే అభిప్రాయం కలిగింది. రాష్ట్రవాసుల, రాష్ట్రేతరుల అనే తారతమ్యం లేకుండా బీదసాదలందరికీ ఉపయోగపడటమే ఇందలి ప్రధానోద్దేశం. అతడు కష్టించి ఉత్సాహంతో విరాళాలు

సేకరించటానికి ప్రయత్నించాడు. కాని యిలాంటి ఆస్పత్రి అంతకుముందెన్నడూ అమెరికావారికి తెలియక వారు దానిని సరిగా అర్థంచేసుకోలేదు. అంచేత అతనికి సరైన విజయం లభించలేదు.

చివరకి అతడు నా దగ్గరకు వచ్చి "ప్రజాక్షేమానికి సంబంధించిన ఏ ప్రణాళికా మీసహాయం లేకుండా జరగదు. నేనెవర్ని చందాలడిగిన ఈ విషయంలో నువ్వు ఫ్రాంక్లిన్‌ను సంప్రదించావా అని అడుగుతున్నారు. నేను సంప్రదించ లేదని చెప్పగానే వారు విముఖులై విరాళాలీయటానికి నిరాకరిస్తూ ఆనక ఆలోచిస్తామని తప్పుకుపోతున్నారు" అన్నాడు. అతని ప్రణాళికయొక్క స్వరూపస్వభావాలను, వాస్తవ ప్రయోజనాలను అతడు చెప్పగా విని చాలా సంతృప్తిచెంది నేను కొంత విరాళమియ్యటమేగాక యింకా విరాళాలు ప్రోగు చెయ్యటానికి హృదయపూర్వకంగా అతనితో సహకరించాను. ముందు ప్రజలకు ఈ విషయాన్ని గురించి బోధపర్చటానికి వార్తాపత్రికల్లో దీన్ని గురించిన వివరాలన్నీ ప్రకటించాను. ఇలాటి విషయాలలో నే నెప్పుడూ అలాగే చేస్తాను.

ఆ తరువాత ధారాళంగా విరాళాలు ప్రోగుపడినయ్. కాని అసెంబ్లీయొక్క సహాయంలేకుండా యీ కార్యక్రమం నిర్వహించటానికి ప్రోగుపడిన విరాళాలు చాలవని అసెంబ్లీకి ఒకదరఖాస్తు పెట్టించాను. పల్లెప్రాంతాలకు చెందిన కొందరు సభ్యులు ఇది కేవలం నగరవాసులకు మాత్రమే ఉపయోగిస్తుందనే మిషతో దీన్ని వ్యతిరేకించారు. నగరవాసులు మాత్రమే దీనిఖర్చు భరించాలని వారి వాదన. ఈ

నగరవాసులే ఇందుకు అనుకూలురు కారని వారి నమ్మకం. దీన్ని ఖండిస్తూ నగరంలో రెండువేల పౌనులు ఐచ్ఛికంగా విరాళాలు ప్రోగుపడ్డాయని, దీనినిబట్టి నగరవాసులలో అధిక సంఖ్యాకులు ఇందుకు సుముఖులేననీ వాదించాను. చివరకు అస్సెంబ్లీలో ఎన్నో తర్జనభర్జనలు జరిగాక బిల్లు ఆమోదించబడింది. జేబులోని దమ్మిడీ ఖర్చులేకుండా దయార్ద్ర హృదయులనే అవకాశం దొరికింది గనుక సభ్యులంతా దీన్ని ఆమోదించారు. ప్రభుత్వసహాయం లభించటంతో సునాయాసంగా కార్యక్రమం నిర్వహించటం జరిగింది. కొద్దిరోజుల అనుభవంతో ఈ సంస్థ ఎంత ఉపయోగకరమైందో అందరికీ తెలిసిపోయింది. ఇది యీనాటికీ నిలిచే ఉంది.

ఈరోజుల్లోనే రెవరెండ్ గిల్‌బెర్ట్ టిన్నెట్ అనేవ్యక్తి నా దగ్గరకు వచ్చి ఒక సమావేశమందిరం నిర్మించాలని తాను సంకల్పించినట్లు చెప్పి అందుకు చందాలు ప్రోగు చేయటానికి నన్ను సహాయం చేయమని అర్థించాడు. కాని నాతోటి పౌరులను తరచు చందాలకై వత్తిడిచేస్తూ విసుగు కలిగించటం యిష్టం లేక అతని ప్రార్థనను నేను నిరాకరించాను. తరువాత తరచుగా చందాలిచ్చే ఉదారులైన పెద్దల జాబితా కావాలని అడిగాడు. నేను అందుకు కూడా నిరాకరించాను. చివరకు మీ సలహా అయినా కావాలని అడిగాడు. అందుకు నేను అంగీకరించి యిలా చెప్పాను:

"ప్రప్రథమంగా మీకు తెలిసిన వారిలో యిస్తారనుకున్న వారిని చందాలడగండి. ఆ తరువాత యిస్తారని నమ్మకం లేనివారి నడగండి. చందాలిచ్చినవారి జాబితా

వారికి చూపెట్టండి. చివరకు యివ్వరనుకున్న వారినిమాత్రం అశ్రద్ధ చేయకుండా చూడండి. ఎందుచేతనంటే అలాంటి కొందరి విషయంలో మనంఒక్కసారి పొరపాటు పడవచ్చు."

అతడు నా సలహా విని నవ్వి కృతజ్ఞత తెలిపి వెళ్ళిపోయాడు. ఆ తరువాత అలాగే చేశాడు. ప్రతిఒక్కరిని అడిగాడు. అనుకున్నదానికంటె ఎక్కువ చందా నే పోగు బడింది. దానితో ఆర్క్ స్ట్రీటులో ఒక సువిశాలమైన సభామంటపాన్ని నిర్మించాడు.

ఇలాటిదే మరో విషయం. మా నగరం వంకరలేని విశాలమైన వీధులతో క్రమపద్ధతిలోనే నిర్మించబడింది. కాని కొన్నివీధులు రోడ్లు వేయబడలేదు. వానాకాలంలో అవన్నీ బురదతో నిండి చాలా చీకాకుగా ఉంటాయి. ఇక వేసం కాలంలోకూడా దుమ్ముధూళీ రేగుతూ చాలాబాధకరంగా ఉంటాయి. అప్పుడు నేను జర్సీ మార్కెట్ వద్ద ఉంటున్నాను. ఆ బురదలో ఈడ్చుకుంటూ ప్రజలు రాకపోకలు సాగించటం నేను చూస్తున్నాను. ఈ కష్టాన్ని తొలిగించటం గురించి నేను చాలామందితో మాట్లాడాను. చాలా వ్యాసాలు వ్రాశాను. చివరకు ఆ వీధిలో కంకరరోడ్డు వేయటానికి ఒకపథకం తయారుచేశాను. దాని ప్రకారం నిర్మాణం జరిగింది. కాని ఇరుగుపొరుగు వీధుల్లో బురదలో ప్రయాణం చేసిన బండ్లు మా వీధిలోకి రావటంచేత అదికూడా బురదతో నిండిపోయేది. అప్పుడు ఇంకా పాకీవారులేరు. వీధి శుభ్రపడే మార్గం కనిపించలేదు. ఆరా తీయగా ఒక కూలివాడు దొరికాడు. అతడు చాలా పేదవాడు. వారానికి రెండుసార్లు

నెలకు ఆరుపెన్నీల జీతానికి వీధిని శుభ్రపరచటాని కంగీక రించాడు. ఈ మొత్తాన్ని ఆ ప్రాంతంలోని యిండ్ల వారం దరూ వంతులవారీగా భరించే ఏర్పాటుజరిగింది. అతి స్వల్ప వ్యయంతో మన గృహపరిసరాలను శుభ్రంగా ఉంచుకోవ టం ఎలా సాధ్యమో వివరిస్తూ నేనొక కరపత్రం ప్రకటిం చాను. దీని ప్రతులను మా వీధిలో ఇంటింటా పంచి పెట్టిం చాను. ఒకటి రెండురోజులయాక చందాలకోసం బయలు దేరాను. అందరూ ముందుకువచ్చి చందాలిచ్చారు. నా పథకం చక్కగా పారింది. నగరవాసులందరూ మా వీధి శుభ్రతను చూసి ఆశ్చర్యపోయారు. వారి వీధులనుకూడా అలాగే ఉంచుకోవాలని ఆసక్తిపడుతున్నారు. ఇందుకోసం కొంత పన్ను చెల్లించటానికికూడా వారు సిద్ధపడుతున్నారు.

కొంతకాల మయాక నగరంలోని వీధులన్నింటిలో రోడ్లు నిర్మించటాని కని అసెంబ్లీలో నేనొక బిల్లు ప్రతి పాదించాను. 1757 లో నేను ఇంగ్లండు వెళ్ళటానికి కొద్ది కాలం ముందు యిది జరిగింది. కొద్దిపాటి సవరణలతో వీధు లలో దీపాలను పెట్టటానికి కూడ అవకాశం కల్గజేస్తూ బిల్లు ఆమోదించబడింది. అసలు మొట్టమొదట జాన్ క్లిఫ్టన్ అనే వ్యక్తి తన గుమ్మంముందు ఒక దీపాన్ని పెట్టటంవల్ల దాని ఉపయోగాన్ని ప్రజలందరూ గ్రహించారు. నగర వీధు లన్నింటినీ అలాగే దీపాలతో అలంకరించాలనే ఆసక్తి వారిలో కలిగింది. దీనికి సంబంధించిన గౌరవం నాకే ఆపా దింప పడినా నిజానికిది ఆ పెద్దమనిషికే చెందుతుంది. కాని లండన్ నుంచి వచ్చిన గుండ్రటి దీపాలకంటె మెరుగైన వాటిని నేను కనిపెట్టాను. లండన్ దీపాలలో కొన్ని లోపా

లున్నాయ్. పొగబయటికి పోవటానికవకాశం లేక దీపంలోనే అట్టగట్టుకు పోతుంది. రోజూ వాటిని శుభ్రపరిచి తీరాలి. అంతేకాదు- వాటికేమాత్రం దెబ్బతగిలినా అవి పూర్తిగా పాడైపోతాయ్. వీటికి బదులుగా నేను మరొకరకం దీపం కనిపెట్టాను. ఇందులో పొగ ధారాళంగా బయటకు పోతుంది. అందుచేత ఇది లండన్ దీపాలవలె తొందరగా పొగచూరి కాంతి తగ్గదు. నేను కనిపెట్టిన దీపాలు లండన్ దీపాలకంటె ఎంతో దృఢంగా పనిచేస్తాయ్ కూడా. లండన్ పౌరులు ఈ పద్ధతిని యింతవరకూ ఎందుకు కనిపెట్టలేదో నాకు తెలియలేదు. లండన్ దీపాలు వెలిగించిన కొద్ది గంటల లోనే కాంతిహీనమై పోయేవి.

ఇప్పుడు నాకు నేను లండన్‌లో ఉండగా జరిగిన ఒక సంఘటన గుర్తుకువస్తున్నది. అప్పుడు లండన్ వీధులు ఎన్నడూ శుభ్రపరచ బడేవి కావు. అప్పుడు నేను క్రావెన్ వీధిలో బస చేస్తున్నాను. ఒకరోజు వుదయం నేను తలుపు తీసి చూసేసరికి ఒక వృద్ధురాలు గుమ్మంముందు పాచి చేయటం చూశాను. ఇక్కడ ఊడవమనీ నీకు ఎవరు చెప్పారు. అని ప్రశ్నించగా ఆమె "నన్నెవరూ ఊడవమనలేదు. కాని నేను చాలా దైన్యస్థితిలో ఉన్నాను. గొప్పగొప్పోరి యిండ్ల ముందు ఊడుస్తూఉంటే ఎవరో ఒకరు ఎంతోఅంత యివ్వక పోతారా" అంది. ఆ వీధినంతా శుభ్రపరిస్తే ఒక షిల్లింగు బహుమానమిస్తానని ఆమెకు నేను వాగ్దానం చేశాను. అప్పుడు తొమ్మిదిగంటలైంది. పన్నెండు గంటలయేసరికి ఆమెవచ్చి తన షిల్లింగుకోసం చేయి జాపింది. అంతస్వల్ప వ్యవధిలో ఆమె వీధినంతా శుభ్రపరచిందని నేను నమ్మలేదు.

దాన్ని చూసిరమ్మని నా సేవకుణ్ణి పంపాను. అతను చూసి తిరిగివచ్చి వీధిఅంతా శుభ్రపడిందని చెప్పాడు. జవసత్వాలుడిగిన అలాంటి వృద్ధురాలు ఆవీధిని మూడుంగంటలలో శుభ్రపరిచినప్పుడు ధృఢశరీరం గల ఒకవ్యక్తి అందులో సగం కాలంలో ఆ పని చేయగలడు. నేను మరోవిషయం కూడా గమనించాను. అలాంటి యిరుకువీధుల్లో మధ్యగాఒకే మురుగుకాల్వ వుండటం మంచిది. అప్పుడు వర్షం కురిసిన తరువాత వీధిలోని నీరంతా అందులోకి ఉధృతంగా దొర్లి ప్రవహించటం చేత వీధి శుభ్రపడుతుంది. అలాకాక వీధికి కిరుప్రక్కలా రెండుకాలవలుంటే ప్రవాహం బలహీనమై పోతుంది. అప్పుడు వీధిలో బురద ఎక్కువై చాలా బాధాకరంగా పరిణమిస్తుంది.

డాక్టర్ ఫోదర్‌గిల్ అనేవ్యక్తి ప్రజోపయోగకరమైన ప్రణాళికలమలు జరపటంలో చాలా ప్రముఖపాత్రవహించేవాడు. అతనికి నేనొక ప్రతిపాదన చేశాను.

"లండన్ వెస్ట్‌మినిష్టర్ వీధులను శుభ్రపరచటానికి కొందరు నియమింపబడాలి. వారు వేసంకాలంలో వీధుల్లో దుమ్మూ ధూళీ రేగకుండా శుభ్రపరచాలి. వానాకాలంలో బురదలేకుండా చెయ్యాలి. అందుకు కావలసిన సాధన సామాగ్రి వారికి సరఫరా చెయ్యబడాలి. వేసంకాలంలో ఉదయమే ఇంకా దుకాణాలు తెరవకముందే వీధులన్నీశుభ్రపరచబడాలి." ఇది ఆచరణ సాధ్యమైన సూచనేనని నా అభిప్రాయం. ఎందుచేతనంటే ఒకరోజు ఉదయం స్ట్రాండ్ ఫ్లీడ్ వీధిలో నడుస్తూ ఉన్నప్పుడు ఒక్కదుకాణం కూడా తెరిచి

ఉన్నట్లు నాకు కనిపించలేదు. అప్పటికి వెలుతురు బాగా వచ్చిందికూడా.

ఇలాంటి విషయాలు శ్రద్ధ వహించతగ్గ గొప్పవి కావని కొందరనుకుంటారు. కానిసాధారణంగా జీవితసౌఖ్యం ఒక్కసారి సాధించబడే పెద్దవిషయాలవలెగాక నిత్యం మనం చవిచూసే చిన్నవిషయాలమీదే ఆధారపడి ఉంటుంది. అంచేత బీదవాడైన ఒక యువకునికి స్వయంగా క్షవరం చేసుకోవటం ఏలాగో, రేజర్‌ను తిరిగి దాచుకోవట ఎలాగో నేర్పినట్లయితే అతనికి వెయ్యిగినీలిచ్చి నప్పటికంటె ఎక్కువ లాభం కలుగుతుంది. డబ్బు తొందరగానే ఖర్చుపెట్టవచ్చు. ఆ తరువాత వృథాచేసినందుకు బాధపడవచ్చు. కాని ఈ విషయం అలాటిదికాదు. మంగలికోసం పడిగాపులు పడటం, మలిన సిక్తాలయిన వారి చేతులతోను ఊపిరితోను మొండి కత్తులతోను బాధపడటం తగ్గుతుంది. అతనికి వీలైనప్పుడు సుఖంగా క్షవరం చేసుకోవచ్చు. ఈ ఉద్దేశాలతోనే యింత వరకూ కొన్ని పేజీలు యిలాంటి విషయాలు ఉల్లేఖించు కుంటూ వచ్చాను. ఇవి నేను ప్రేమించే ఈ నగరానికి-ఎన్నో సంవత్సరాలు సుఖంగా జీవించిన ఈ నగరానికి - బహుశా అమెరికాలోని అనేక పట్టణాలకు ఈ సూచన లుపయోగ పడగలవని నేను ఆశిస్తున్నాను.

అలా కొంతకాలం అమెరికా పోస్టుమాష్టర్ జనరల్ దగ్గర కంప్ట్రోలరుగా పనిచేస్తూ అనేక ఆఫీసులయొక్క లెఖ్ఖలు తనిఖీచేస్తూ గడిపాను. 1753 లో ఆయన మరణా నంతరం విలియం హంటర్‌తో పాటు సమిష్టిగానే నాఉద్యోగా

నికి నియమించబడ్డాను. ఇంతవరకూ అమెరికా ఆఫీసు బ్రిటన్‌కు ఏమీ చెల్లించలేదు. మేము సాలీనా ఆరువందల పౌన్లు తీసుకోవచ్చు. కాని ఆఫీసువల్ల లాభం వచ్చినప్పుడు మాత్రమే అది సాధ్యమౌతుంది. ఇందుకు ఎన్నో అభివృద్ధి పనులు చెయ్యాలి. అందుకోసం మొదట కొంత డబ్బు ఖర్చుపెట్టాలి. అందుచేత మొదటి నాలుగు సంవత్సరాల్లో తొమ్మిదివందల పౌన్ల అప్పు తేలింది. కాని త్వరలో మాకు లాభాలు రావటం మొదలెట్టాయ్. నన్ను ఈ ఉద్యోగంలోంచి తీసివేసేసరికి ఇంగ్లాండు పోస్టాఫీసుకంటె మూడురెట్లు ఆదాయం మావల్ల చక్రవర్తికి లభిస్తున్నది. అంతలో కొందరు మంత్రులు నన్ను తొలగించారు. ఈ విపరీత చేష్టలు గురించి ముందు చెప్తాను. ఆతరువాత దానినుంచి వారికి ఒక్క ఫార్తింగ్ కూడా లభించలేదు.

పోస్టాఫీసు వ్యాపార సందర్భంలో ఈ సంవత్సరం నేను న్యూ ఇంగ్లండు వెళ్ళే అవకాశం లభించింది. అక్కడ నాకు కేంబ్రిడ్జి కాలేజివారు యమ్. ఏ. డిగ్రీ ప్రదానంచేశారు. అంతకుముందు కనెక్టికట్‌లోని ఏల్ కళాశాలవారు నాకదే గౌరవంచేశారు. ఆవిధంగా ఏ కళాశాలలో చదవకపోయినా వారి గౌరవాల్లో నేను భాగం పంచుకున్నాను. సామాన్య శాస్త్రంలో ముఖ్యంగా నేనుసాధించిన విద్యుత్ సంబంధమైన విషయాలను గుర్తించి వారు నాకట్టి గౌరవాలను ప్రసాదించారు.

1754 లో మళ్ళీ ఫ్రాన్సుతో యుద్ధం ప్రారంభమయింది. అందుకు తీసుకొనవలసిన రక్షణ చర్యలగురించి

ఆలోచించటానికి అన్ని కాలనీలనుండీ ఆల్బనీలో సమావేశం కావటానికి కొందరు ప్రతినిధులు ఆదేశింపబడ్డారు. గవర్నర్ హామిల్టన్ ఈ ఆదేశాన్ని అస్సెంబ్లికి అందజేశాడు. పెన్సిల్వేనియా తరఫున ప్రతినిధులుగా అస్సెంబ్లీ స్పీకరు మిస్టర్ నారిస్, నేను, మిస్టర్ థామస్ పెన్, మిస్టర్ శెక్రటరీ పీటర్సు ఎన్నుకోబడ్డాము. జూన్ మధ్యకాలంలో ఆల్బనీలో సమావేశానికి మేం హాజరైనాం. సమిష్టి రక్షణకు తదితర ముఖ్య కార్యక్రమాలకు కాలనీలన్నీ ఒకే సంఘంగా ఒకే ప్రభుత్వం క్రిందకు రావటానికి నేనొక పథకం తయారు చేశాను. మేం న్యూయార్కుగుండా ప్రయాణంచేస్తూ దీన్ని మిస్టర్ జేమ్సు అలెగ్జాండర్, మిస్టరు కెనెడే అనే యిద్దరు మేధాసంపన్నులైన రాజకీయవేత్తలకు చూపించాను. వారు దీన్ని బలపరచటంతో నా పథకాన్ని కాంగ్రెస్ ముందుంచటానికి సాహసించాను. అప్పుడు యింకా అనేకమంది ప్రతినిధులు ఇంచుమించు అలాటి పథకాలనే ప్రతిపాదించారు. ఒక యూనియన్ ఏర్పాటు చేయబడాలని ఏకగ్రీవంగా తీర్మానించబడింది. వివిధ పథకాలను ఆలోచించటంకోసం కాలనీ కొక్కొక్క సభ్యునితో ఒక కమిటీ నియమించబడింది. ఆ కమిటీవారు నా పథకాన్నే ఎన్నుకున్నారు.

నా పథకం ప్రకారం చక్రవర్తిచే నియమించబడిన ఒక ప్రెసిడెంట్ జనరల్‌తో సాధారణ ప్రభుత్వం ఏర్పడుతుంది. అన్ని కాలనీలవారు అస్సెంబ్లీలద్వారా ఎన్నుకొన్న ప్రతినిధులతో ఒక విస్తృతమైన కౌన్సిల్ ఏర్పాటుచేయబడాలి. ఈ పథకాన్నిగురించి కాంగ్రెస్‌లో రోజూ చర్చలు

జరుగుతూనే ఉన్నాయ్. మొదట అనేక అభ్యంతరాలు చెప్పబడినా చివరకు నా పథకం ఏకగ్రీవంగా ఆమోదించ బడింది. దీని ప్రతులు బోర్డు ఆఫ్ ట్రేడ్‌కూ, వివిధ రాష్ట్ర శాసనసభలకూ పంపాలని ఆదేశించబడింది. కాని చివరకు మరోలా జరిగింది. ఇందులో విశేషాధికారా లున్నాయనే నెపంతో అస్సెంబ్లీలు దీన్ని ఆమోదించలేదు. ఇక ఇంగ్లండులో యిది మరీ ప్రజాస్వామికంగా ఉందని వ్యాఖ్యానించ బడింది. అంచేత చక్రవర్తి అనుమతికై దీన్ని పంపటానికి బోర్డు ఆఫ్ ట్రేడ్ నిరాకరించింది. అందుకు బదులు, అంత కంటె మెరుగయినదానిగా భావించబడి మరొక పథకం ప్రతిపాదించబడింది. దీని ప్రకారం వివిధ రాష్ట్రాల గవర్నర్లూ, వారి వారి అస్సెంబ్లీలనుండి కొందరు సభ్యులతోపాటు సమావేశంకావాలి. సైన్యాలను సమకూర్చటంగురించీ, కోటలు కట్టటంగురించీ ఆదేశాలువారు జారీచేయాలి. ఇందుకు అయే ఖర్చు ముందు, గ్రేట్ బ్రిటన్ ఖజానానుంచి ఖర్చు పెట్టబడుతుంది. కాని ఆ తర్వాత అమెరికన్లపై ప్రత్యేక పన్ను విధించి, ఆ మొత్తం తిరిగి రాబట్టుకునే అధికారం బ్రిటిష్ పార్లమెంటుకు ఉంటుంది. అప్పుడు అచ్చయిన నా రాజకీయరచనల్లో, నా పథకాన్ని సమర్థిస్తూ నేను చేసిన సూచనలు కనిపిస్తాయి.

ఆ తరువాత శీతాకాలంలో ఈ రెండు పథకాలను గురించీ, గవర్నర్ షిర్లేతో సుదీర్ఘమైన సంప్రదింపులు జరిపాను. నా కాగితాల్లో ఈ చర్చల ధోరణికూడా కనిపిస్తుంది. నా పథకాన్ని అనుసరించటానికి వ్యక్తపరుచబడిన

వ్యతిరేకభావం, అందుకు వారికారణాలు చూస్తే యిప్పటికీ నా పథకమే సక్రమమైందనే నమ్మకం నాకు కల్గుతూంది. ఇది గనుక అమలుజరుపబడినట్లయితే, ఉభయులకూ కూడా ఎక్కువ ప్రయోజనకరంగా ఉండేది. అలా సంఘటితమైన కాలనీ లన్నీ కలసి, ఆత్మరక్షణకు అవసరమైన శక్తిని సంతరించుకునేవి. అప్పుడు ఇంగ్లండు నుంచి ప్రత్యేకంగా సైన్యాలు రావలసిన అవసరం ఉండేది కాదు. ఆ తర్వాత అమెరికాపై పన్నువిధించటంకూడా తప్పేది. కాని ఇలాటి తప్పిదాలు కొత్తవికావు. చరిత్రనిండా, రాజులూ రాజ్యాలూ చేసే ఇలాటి తప్పిదాలు కోల్లలుగా కనిపిస్తాయి.

"ప్రపంచంలో చాలా తక్కువమందికిమాత్రమే వారి మంచేమిటో వారికి తెలుసు. తెలిసినా దాన్ని ఆచరించే వారూ తక్కువే."

పరిపాలకులకు ఎప్పుడూ చేతినిండా పనులు ఉంటూ ఉండటంచేత, క్రొత్త ప్రణాళికలను అమలుజరపాలనే ఉత్కంఠ వారికుండదు. అంచేత, అత్యుత్తమ ప్రజాసంక్షేమ కార్యాలన్నీ, గత విజ్ఞానాన్ని ఆధారంగా చేసుకొని, పరిస్థితుల వత్తిడివల్ల నిర్వహించబడేవిమాత్రమే.

పెన్సిల్వేనియా గవర్నరు ఆ పథకాన్ని అస్సెంబ్లీకి అందజేస్తూ "అది మిక్కిలి విచక్షణాజ్ఞానంతో తయారు చేయబడిన, స్పష్టమైన పథకంగనుక, అసెంబ్లీవారు దాన్ని శ్రద్ధగా పరిశీలించాల"ని ఆదేశించాడు.

ఒకానొక సభ్యుని కృషి ఫలితంగా నా పరోక్షంలో శాసనసభ దాన్ని త్రోసిపుచ్చింది. కనీసం వారు దాన్ని

పరిశీలించటం కూడా జరగలేదు. దీన్ని చాలా అవమాన కరమైన విషయంగా నేను పరిగణించాను.

నేను బోస్టన్ పోతూ, మార్గమధ్యంలో న్యూయార్క్ గవర్నర్ మిస్టర్ మోరిస్‌ను కలుసుకున్నాను. అప్పుడే అతడు ఇంగ్లండు నుంచి వచ్చాడు. అతనితో అంతకుముందే నాకు బాగా పరిచయం ఉంది. మిస్టర్ హామిల్టన్ రాజీనామాను పురస్కరించుకుని, ఆ స్థానంలో ఇతడు నియమించ బడ్డాడు. ఈ పరిపాలన చాలా చీకాకుగా ఉంటుందని తాను అనుకుంటున్నట్లు చెప్పాడు. "అలా ఉండదు. అసెంబ్లీతో విరోధం పెట్టుకోకుండా ఉంటే, మీకు ఎలాంటి చీకాకు కల్గద"ని నేను చెప్పాను. ఆయన నవ్వుతూ "మిత్రుడా! వివాదాలు పెంచుకోవద్దని మీరెలా సలహా యిస్తున్నారు? నాకు వివాదాలంటే యిష్టమని మీకు తెలుసుగదా? నాకు అత్యంత వినోదకరమైన విషయాల్లో ఇది ఒకటి. కాని, మీమీదగల గౌరవంచేత, మీసలహా పాటించటానికి ప్రయత్నిస్తాను." అన్నాడు. వాగ్వివాదాలమీద ఆయనకు అభిమానం ఏర్పడటానికి ఒక కారణం ఉంది. ఆయనతండ్రి చిన్ననాటినుంచీ, వారిని అలా పెంచాడట. పిల్లలు ఒకరితోనొకరు తర్కించుకోవటం అయన ప్రోత్సహించే వాడుట. తత్ఫలితంగా ఇతగాడు చక్కటి వక్త అయాడు. కుతర్కం చేయగల సామర్థ్యం అలవరచుకున్నాడు. కాని నిత్యజీవితంలో, ఈ అలవాటు ఏమంత మంచిదికాదు. దీనివల్ల దురదృష్టకరమైన చిక్కులను ఎదుర్కోవాల్సి వస్తుంది. కొన్ని సమయాల్లో వారు విజయాలు సాధించవచ్చుకాని ఎన్నడూ ఎదుటివారి

సదభిప్రాయాన్ని మాత్రం సాధించలేరు. జీవితంలో ఎక్కు-వగా మొదటిదానికంటె రెండవది ఉపయోగపడుతుంది.

ఆ తర్వాత ఆయన దగ్గర శెలవుపుచ్చుకున్నాను. ఆయన ఫిలడల్ఫియా పోగా, నేను బోస్టన్ బయలుదేరాను. కాని, నా కిచ్చిన వాగ్దానానికి వ్యతిరేకంగా, అతడు అసెంబ్లీలో వాగ్వాదాలు పెంచుకున్నాడట. తిరుగుప్రయాణంలో న్యూయార్కు-లో ఆ విషయం నాకు తెలిసింది. ఇందులో తదుపరి కొంతభాగం నాకుకూడా లభించింది. నేను అసెంబ్లీకి తిరిగి రాగానే, ఆయన ఉపన్యాసాలకూ, సందేశాలకూ జవాబు చెప్పే ప్రతి సంఘానికీ నన్ను ఎన్నుకునేవారు. ఆయన సందేశాలూ, వాటికి సమాధానాలూ చాలా కఠినంగా ఉండేవి. ఒకోసారి కొంత నిందాపూర్వక వాక్యాలతోగూడా కలిసి ఉండేవి. అసెంబ్లీతరఫు పత్రాలను వ్రాసేది నేనే నని ఆయనకు తెలుసు. అంచేత మే మిద్దరం ఎదుటపడితే, పెద్ద యుద్ధం జరుగుతుందని సాధారణంగా అనుకోవచ్చు. కాని అలా ఎన్నడూ జరగలేదు. ఆయన చాలా ఉదార స్వభావుడు. మేం అనేకసార్లు కలిసి భోంచేశాం.

ఒకరోజున మా యిద్దరిమధ్యనూ వాగ్వాదాలు పతాకనందు కున్నాయి. ఆరోజు బజారులో ఆయన్ను కలుసుకోవటం తటస్థించింది. "ఫ్రాంక్లిన్! మీ రీ రోజు మాయింటికి వచ్చి, నాతో కొంతకాలం గడపాలి." అని ఆయన ఆహ్వానించి, రెక్క-పుచ్చుకొని తీసుకువెళ్ళాడు. కులాసాగా ఇద్దరం కబుర్లు చెప్పుకున్నాం. అస లీ వాగ్వాదా

లన్నింటికీ ప్రధానమైన కారణం ఒకటుంది. వంశపారంపర్యం హక్కుగల గవర్నర్లు, మేజిస్ట్రేట్లమీద పన్నులు పడే ఏ చట్టాన్నీ చేయనిచ్చేవారు కాదు. అలాగే వారి ప్రతినిధులను ఆదేశించేవారు. ఈ అన్యాయం నివారించటానికి, అసెంబ్లీ మూడు సంవత్సరాలు ప్రయత్నించింది. చివరకు, మారిస్ తర్వాత గవర్నర్‌గా వచ్చిన కెప్టెన్ డెన్నీ ఈ సమస్యను పరిష్కరించాడు. అదెలా జరిగిందో ముందు చెప్తాను.

నేను చాలా తొందరగా కథ చెప్పివేశాను. గవర్నర్ మారిస్ హయాంలో చెప్పవలసిన అనేక సంఘటనలు జరిగాయి.

ఫ్రాన్సుతో యుద్ధం ప్రారంభమవటంచేత, 'మసాచుసెట్స్' ప్రభుత్వం ఎదురు దాళ్ళు జరపటానికీ, మిస్టర్ క్విన్సీని పెన్సిల్‌వేనియాకూ, మిస్టర్ పౌనాల్‌ను న్యూయార్కుకు పంపింది. నేను అసెంబ్లీలో ఉండటంచేతనూ, దాని యొక్క ధోరణి నాకు బాగా తెలియటం చేతనూ, మిస్టర్ క్విన్సీ నా సహాయం అభ్యర్థించాడు. అతను అసెంబ్లీకి పంపే సందేశం ఎలా ఉండాలో నేనే చెప్పాను. దాన్ని సభవారు బాగానే స్వీకరించారు. సాధనసామగ్రి సమకూర్చటానికి పదివేల పౌనులు ఆర్థిక సహాయాన్ని ఇవ్వాలని వారు తీర్మానించారు. కాని ఇందుకు విధించబోయే పన్నునుంచీ ఎస్టేట్లన్నింటినీ, మినహాయింపు చేయనిదే, దాన్ని ఆమోదించటానికి గవర్నరు నిరాకరించాడు. మిస్టర్ క్విన్సీ గవర్నరును అంగీకరింపజేయటానికి చాలా కష్టపడి పనిచేశాడు. కాని అతడు తన మూర్ఖపు పట్టుదలను మాత్రం విడవలేదు.

అప్పుడు గవర్నర్ యొక్క ప్రమేయం లేకుండా కార్యక్రమం సాగించటానికి ఒక పద్ధతి సూచించాను. లోన్ ఆఫీసుయొక్క ధర్మకర్తలను ఆదేశించి డబ్బుతీసుకునే అధికారం అసెంబ్లీకి ఉంది. నిజానికప్పుడు లోన్ ఆఫీసులో డబ్బులేదు. అందుచేత ఆజ్ఞాపత్రాలను ఒక సంవత్సరంలో చెల్లించబడాలని, అందుకు అయిదు శాతం వడ్డీ ఉండాలనీ, నేను మరొకసూచన చేశాను. ఈ ఆజ్ఞాపత్రాలను అమ్మి, వచ్చిన పైకంతో కావలసిన సాధన సామాగ్రి కొనుక్కోవచ్చని నా అభిప్రాయం. అసెంబ్లీ నా సూచనను ఆమోదించింది. అందు కవసరమైన ఆజ్ఞలు వెంటనే జారీ చేయబడ్డాయి. వాటిపై సంతకం పెట్టిన సంఘంలో నేనుకూడా ఒకసభ్యుణ్ణి ఈ ఆజ్ఞాపత్రాలను, డబ్బుగలవారంతా అనుకున్న దానికంటె ఎక్కువగా కొన్నారు. వీటిని ఏ క్షణంలోనైనా డబ్బుగా మార్చుకోవచ్చు. పై పెచ్చు వీటిపై వడ్డీ వస్తుంది. అంచేత ధనవంతులను ఇవి బాగా ఆకర్షించాయి, కొద్దివారాల్లోనే పత్రాలన్నీ అమ్ముడుపోయాయి. ఆ విధంగా ఈ ముఖ్యవిషయం, నా సలహాప్రకారం పూర్తయింది. మిస్టర్ క్విన్సీ ఇందుకుగాను, అసెంబ్లీకి హృదయపూర్వకమైన కృతజ్ఞతలు అందజేశాడు. ఇక తన కర్తవ్యం విజయవంతంగా ముగించుకుని తిరిగి వెళ్ళాడు. ఆ తర్వాత మా యిద్దరికీ మంచి ఆత్మీయమైన స్నేహబంధం ఏర్పడింది.

ఆల్బెనీలో కాలనీ లన్నీ సంఘటిత మవాలంటూ చేయబడిన తీర్మానాన్ని బ్రిటిష్ గవర్నమెంట్ త్రోసిపుచ్చటానికి అలాంటి సంఘటన క్రమంగా బలపడి, తమ కెదుకు

తిరగవచ్చు ననే భయమే కారణం. అందుచేత ఆ ప్రతిపాదనకు ప్రతిగా బ్రిటిష్ ప్రభుత్వం జనరల్ బ్రాడక్‌ను రెండు పటాలాల ఇంగ్లీషు సైన్యంతో పంపింది. అతడు వర్జీనియాలోని అలెగ్జాండ్రియా పట్టణంలో దిగాడు. ఆతర్వాత మేరీలాండ్‌లోని ఫ్రెడరిక్ నగరానికి వచ్చాడు. అక్కడ కొంత కాలం ఆగాడు. మా అసెంబ్లీపై అతనికి తీవ్రమైన దురభిప్రాయం ఉందని తెలిసింది. అసెంబ్లీవారంతా, సభ్యుని హోదాలో కాక, పోస్టుమాస్టర్ జనరల్ హోదాలో ఆయనన్ను కలుసుకొమ్మని అడిగారు. అందు కయ్యే ఖర్చులు భరించటానికి అంగీకరించారు. ఈ ప్రయాణంలో నాతోపాటు నా కుమారుడుకూడా వెంటవచ్చాడు.

మేం ఫ్రెడరిక్ పట్టణంలో జనరల్‌ను కలుసుకున్నాం. వాగన్లు సమకూర్చుకుని రమ్మని పంపిన వారికోసం, అతడు విసుగుదలతో ఎదురుచూస్తున్నాడు. ఆయనతో కలసి నేను కొన్నిరోజులు మకాం చేశాను. నిత్యం ఆయనతో కలసే భోజనంచేసేవాణ్ణి. అందుచేత అన్నివిషయాలూ విపులంగా మాట్లాడుకుంటానికి మాకు వ్యవధి దొరికింది. దీనివల్ల అసెంబ్లీపై ఆయనకు గల దురభిప్రాయాన్ని తొలగించగల్గాను ఆయనకు సహాయంచెయ్యటానికి, అసెంబ్లీ సర్వదా సిద్ధంగానే ఉందని చెప్పాను.

మేము బయలుదేరి వచ్చే ముందు ఎదురుచూస్తూన్న వాగన్లు రావటం జరిగింది. కాని అవి పాతిక మాత్రమే ఉన్నయ్. అవైనా అన్నీ సరైన స్థితిలో లేవు. జనరల్ తదితరోద్యోగులు వాటిని చూసి ఆశ్చర్యపోయారు. తమ

దండయాత్ర పూర్తిగా విఫలమైపోతుందని నిశ్చయించు కున్నారు. తమ సామానులు సరఫరా చేసుకుంటానికి ఏ విధ మైన అవకాశములేని దేశములో తమను దించినందుకు మంత్రివర్గంయొక్క తెలివితక్కువతనానికి వారు చకితు లయ్యారు. కనీసం వారికి నూటయాభై వాగనులైనా కావాలి!

పెన్సిల్‌వేనియాలో ప్రతిరైతుకు ఒకవాగను ఉంటుం దనీ, సైన్యంగనక అక్కడ దిగి ఉన్నట్లయితే యింత యిబ్బందిఉండేది కాదనీ నేను చెప్పటం తటస్థించింది. జనరల్ నా మాటలను ఉత్కంఠతో విని 'మాకు వాగన్లు సరఫరాచేయగలవ్యక్తి పేరు చెప్పండి. ఈ కార్యభారం మీరే స్వీకరించాలని ప్రార్థిస్తున్నాను' అన్నాడు. వాగన్ యజమానులకు ఇచ్చే ప్రతిఫలంవిషయంలో షరతులన్నింటినీ నేను కాగితంమీద వ్రాశాను. అందుకు వా రంగీకరించారు. ఆ షరతులన్నింటినీ నేను లంకాష్టర్ రాగానే పేపర్లలో ప్రకటించాను. అది ఇలా ఉంది.

## ప్రకటన

లంకాష్టర్,

26 ఏప్రియల్ 1755

నూటయాభై వాగన్లు కావాలి. ప్రతిదానికి నాలు గేసి గుఱ్ఱాలు ఉండాలి. ఇంకా పదిహేనువందల మంచి గుఱ్ఱాలు చక్రవర్తిసైన్యంలో పనిచేయటానికి కావాలి. హిజ్ ఎక్సెలెన్సీ జనరల్ బ్రాడక్ వీటిని అద్దెకు కుదిర్చే అధికారం నాకీయటం చేత నే నీప్రకటన చేస్తున్నాను. నేటి

నుంచి వచ్చే బుధవారంవరకు యిక్కడ బసచేస్తాను. ఇం దుకు సంబంధించిన షరతులు ఈ క్రింద ఉదహరిస్తున్నాను.

1. నాలుగు మంచిగుఱ్ఱాలు ఒక చోదకునితో సహా వాగన్ సప్లయిచేసిన వారికి డయిమ్ ఒక్కింటికి పదిహేను షిల్లింగుల ప్రతిఫలం ఇవ్వబడుతుంది. జీనుగల ప్రతిగుఱ్ఱానికి డయిమ్‌కు రెండు షిల్లింగుల చొప్పున, జీనులేని గుఱ్ఱానికి పదునెనిమిది పెన్నీల చొప్పున ఇవ్వబడుతుంది.

2. పిలుస్ర్కీక్ లోని సైన్యాన్ని చేర్చిన నాటినుంచీ జీతం ఇయ్యబడుతుంది. మే 20 వ తేదీ లోపున వాగన్లు అక్కడకి చేరాలి. రాకపోకలకి తగినంత భత్యముకూడా ఇవ్వబడుతుంది.

3. ప్రతివాగను, అశ్వాలు నిష్పాక్షికమైన కొందరు పెద్దలచేత ధర కట్టించబడతయ్. ఈ సందర్భంలో వాటి కెటువంటి నష్టం సంభవించినా దాని విలువ వెంటనే చెల్లించ బడుతుంది.

4. ఏడురోజుల జీతం ముందు అడ్వాన్సుగా ప్రతి వాగన్ యజమానికి చెల్లించటానికి నేను సిద్ధంగా ఉన్నాను. తక్కినదంతా తిరిగివచ్చేటప్పుడు జనరల్ బ్రాడాక్ చెల్లించ గలడు. అవసరమైతే తఫాలవారీగాకూడా ప్రతిఫలం చెల్లించ బడుతుంది.

5. ఏ పరిస్థితుల్లోనూ చోదకులు గాని గుఱ్ఱాలవెంట వచ్చేవారుగాని, సైనిక సంబంధమైన పనులు చేయనవసరం లేదు.

6. వాగన్లు వస్తూ తెచ్చే ఆహారధాన్యాల్లో మిగిలినవి చివరకి కొంత ధరకట్టి సైన్యం తీసుకుంటుంది.

నోటు:_ నా కుమారుడు విలియం ఫ్రాంకిలిన్ కంబర్ లెండ్ దేశంలో ఇలాంటి ఒడంబడికలు చేసుకుంటానికి అధికారం కలిగిఉన్నాడు.

బి. ఫ్రాంక్లిన్.

లంకాష్టర్ - యార్కు - కంబర్‌లాండ్
—నివాసులకు—

స్నేహితులారా !

ఫ్రెడరిక్‌లో ఇటీవల కొంతకాలం నేను మకాం చేశాను. ఈ రాష్ట్రంలో లభిస్తాయని జనరల్ ఎదురుచూసిన వాగన్లు లభించలేదు. గవర్నరుకు, అసెంబ్లీ కి మధ్యగల భేధాభిప్రాయాల వల్ల అందుకవసరమైన డబ్బు కేటాయించబడలేదు. అందుకు కావల్సిన చర్యలేమీ తీసుకొనబడలేదు. అవసరమైన వాగన్లను, గుఱ్ఱాలను బలవంతంగా తీసుకొని రావటంకోసం కొంతసైన్యాన్ని దేశంలోకి పంపాలని ప్రతిపాదించ బడింది. ఇలాంటి సందర్భంలో బ్రిటిష్ సైనికులు విజృంభించటం మనకు సంతోషకరమైన విషయం కాదు. అందువల్ల ప్రజలకు అనేక కష్టనష్టాలు సంభవించవచ్చు. అందుచేత సౌమ్యమైన మార్గంలో ఈ సమస్యను పరిష్కరించుకోవటం మంచిది. ఈ ప్రాంతీయులు తగినంత ద్రవ్యం మారకంలో లేదని అస్సెంబ్లీలో ఆరోపించారు. ఇప్పుడు చెప్పుకోతగ్గంత మొత్తం లభించే అవకాశం మీకు కలిగింది. ఈ దండయాత్ర ఇంకా సాగి 120 రోజుల్లో మన వాగన్లకు, గుఱ్ఱాలకు ముప్పైవేల పౌన్ల ప్రతిఫలం ముట్టే అవకాశం

ఉంది. ఇందుకు బంగారు వెండి నాణాలుమాత్రమే చెల్లించ బడతాయి. ఈ పని చాలా సులువైనదికూడా. రోజుకు పన్నెండు మైళ్ళకంటే ఎక్కువ దూరం సైన్యం ప్రయాణం చెయ్యదు. మీరు నిజమైనపౌరులై చక్రవర్తియెడల వినయ విధేయతలుగల ప్రజలైతే ఇప్పుడు మీ కర్తవ్యాన్ని నిర్వ హించండి. దీనివల్ల మీకుకూడా లాభముంది. వ్యవసా యావసరాలవల్ల ప్రతి రైతూ ఒక వాగన్‌ను సప్లయిచేయ లేకపోవచ్చు. అప్పుడు ఇద్దరు ముగ్గురుకలసి ఒక్కరువాగనూ మరొకరు గుఱ్ఱాలను, మరొకరు చోదకుడిని సప్లయిచేసి లాభాలు సమంగా పంచుకోవచ్చు. మీరుగనక ఐచ్ఛికంగా రాజుకు ఈ సేవచేయకపోతే మీ విధేయతను శంకించవలసిన అవసరం ఏర్పడుతుంది. రాజకార్యం నిర్వహించబడాలి. మన రక్షణకోసం అంత దూరంనుంచి సైన్యాలువచ్చాయి. ఈ పరిస్థితుల్లో మనకు నిర్లిప్తతాభావం తగదు. వాగన్లు, గుఱ్ఱాలు లభించితీరాలి. అవసరమైతే ఇందుకు వారు హింసా త్మకమైన పద్ధతులుకూడా అవలంబించవచ్చు. అప్పుడు మనకు ప్రతిఫలంగానీ, గౌరవంగానీ దక్కదు.

ఇందులో నాకు ప్రత్యేకమైన శ్రద్ధ ఏమీ లేదు. ఒక మంచిపనిచేయటంవల్ల కలిగే సంతృప్తిమాత్రమే నాకు మిగి లేది. వాగన్లను, అశ్వాలను ఈ పద్ధతిద్వారా సంపాదించ లేకపోతే పధ్నాల్గు రోజులలోపల జనరల్‌కు అదే విష యాన్ని నేను తెలియజేయాలి. అప్పుడు సర్ జాన్ సెంట్ క్లెయిర్ ఒక సైనికబృందంతో దేశంలో ప్రవేశించి తన కర్తవ్యం నిర్వహించుకుపోతాడు. నేను యథార్థంగా మీ

క్షేమాన్ని కోరే నమ్మకమైన స్నేహితుణ్ణి కావటంచేత ఆ వార్త వింటానికి బాధపడ్డాను.

బి. ఫ్రాంకిలిన్.

వాగన్ యజమానులకు అడ్వాన్సు ఇవ్వటంకోసం జనరల్ దగ్గర ఎనిమిదివందల పౌన్లు పైకం నేను తీసుకుని వచ్చాను. కానీ అది చాలకపోవటంచేత యింకా రెండు వందలపౌన్లు ఖర్చుపెట్టాను. రెండు వారాల్లో 150 వాగన్లూ, 259గుఱ్ఱాలూ సైన్యందగ్గరకు బయలుదేరినవి. యజమానులు జనరల్ బ్రాడక్‌ను ఎఱిగిఉండకపోవటంచేత వారివాగన్లకూ, గుఱ్ఱాలకూ ఏదైనా నష్టం సంభవించినప్పుడు ప్రతిఫలం చెల్లించే బాధ్యత, నేను తీసుకోవలసివచ్చింది.

ఒక రోజు సాయంత్రం కల్నల్ డన్‌బార్ పటాలానికి చెందిన కొందరు ఉద్యోగులతో నేను భోంచేస్తున్నాను. అతడు తన క్రింది ఉద్యోగులు సాధారణంగా తగినంత ఆర్థిక స్తోమతలేనివారనీ, అందుచేత పచ్చిమంచినీరుకూడా దొరకని యీ సుదీర్ఘ ప్రయాణంలో కావలసిన ఆహారధాన్యాలను సమకూర్చుకునే శక్తి వారికి లేదనీ చెప్పాడు. దానికి నే నేమీ జవాబు చెప్పలేదు. కానీ మర్నాటి ఉదయమే అస్సెంబ్లీలోని కమిటీకి, యీ ఉద్యోగులకు కొంత సహాయం చేయమని సిఫార్సుచేస్తూ ఒక లేఖ వ్రాశాను. మజిలీప్రయాణంలో కొంత అనుభవంఉన్న నా కుమారుడు అందుకు కావల్సిన వస్తువుల జాబితాను తయారుచేశాడు. కమిటీ దాన్ని ఆమోదించింది. భోజనసామాగ్రి అంతా ఇరవై బంగీలుగా వాగన్లతోపాటు సైన్యం దిగినచోటుకు వచ్చి

చేరింది. ఈ ఇరవై బంగీలు ఆఫీసరు కొకటి-చొప్పున ఇవ్వ బడ్డాయి. వారు చాలా కృతజ్ఞతతో వాటిని స్వీక రించారు. జనరల్ కూడా వాగన్లు సరఫరా చేయటం మొద లైన విషయాల్లో, నా ప్రవర్తన చూసి చాలా సంతృప్తి చెంది పదే పదే నాకు కృతజ్ఞత లందజేయసాగాడు. ఆ తరు వాత అవసరమైన ఇతర సామాగ్రికూడా సరఫరాచేయుమని నన్ను ప్రార్థించాడు. నేను అలాగే చేశాను. అతడు అప జయంపొందిన వార్త వినేవరకూ నేను ఆ కార్యక్రమంలోనే మునిగి తేలుతున్నాను. ఇందులో వేయిపౌనుల సొంతపైకం కూడా ఖర్చుపెట్టి దానికి సంబధించిన లెఖ్కలు అతనికి పంపాను. అదృష్టవశాత్తు అతడు అపజయంపొందటానికి వారంరోజులముందు నా జమాఖర్చు లెఖ్కలు అతనికి చేర టంచేత వెంటనే నా పైకం నాకు అందింది.

ఈ జనరల్ చాలా ధైర్యసాహసాలు కలవాడే. ఐరోపా యుద్ధంలో సమర్థుడైన సైనికోద్యోగిగా పేరుగడించ వలసినవాడే. కానీ అతనిలో ఆత్మవిశ్వాసం ఎక్కువై పోయింది. అతనికి అమెరికన్లపైనమా, ఇండియన్లపైనమా కూడా సదభిప్రాయంలేదు. ఉన్నట్లయితే జార్జి క్రాగ్‌హామ్ నూరుమంది పరివారంతో కలసి అతనికి సహాయంచేసేవాడే. కాని అతడు వారిని అశ్రద్ధచేయటంవల్ల వారు క్రమంగా అతన్ని వదిలి వచ్చేశారు.

ఒకరోజు అతనితో సంభాషించేటప్పుడు తా నుద్దే శించిన సైనిక పురోగమనం గురించి యిలా అన్నాడు: "డాక్వేస్‌నే కోట పట్టుకున్న తర్వాత, నేను నయాగరా

మీదకు నడుస్తాను. అదికూడా స్వాధీనమయ్యాక ఫ్రాంటే నాక్ వరకు పురోగమిస్తాను. డాక్వేస్ నేను లొంగదీయటం మూడు నాల్గు రోజులకంటె ఎక్కువ పట్టదు.

ఆ తరువాత నయాగరా పోయేదాకా మనకి అంత రాయం ఉంటుందని నేననుకోవటం లేదు." అరణ్యాన్ని ఛేదించుకుంటూ మార్గాన్ని నిర్మించుకుంటూ ఆ యిరుకైన మార్గంలో వారు సాగించవలసిన సుదీర్ఘమైన ప్రయాణం నాకళ్ళముందు ఒక్కసారి తిరిగింది. జనరల్ చెప్పినమాటలు అసాధ్యమైనవని నాకు సందేహం కలిగింది.

"మీరనుకునక డాక్వేన్‌నే ముట్టడించినట్లయితే అది త్వరగా లొంగిపోవచ్చు. కానీ మీ పురోగమానికి ఇండియన్లు అడ్డుపడతారని అనుమానంగా ఉంది" అని మాత్రం జవాబు చెప్పాను.

నా తెలివితక్కువ తనానికి జనరల్ నవ్వి "ఈ అడవి మృగాలు తగినంత అనుభవం లేని అమెరికన్ సైన్యాలకు ఇబ్బంది కలిగించవచ్చుగాని, పూర్తిగా క్రమశిక్షణ నేర్చిన రాజు సైన్యానికి వారు ఏవిధమైన అవరోధమూ కలిగించ లేరు" అన్నాడు. ఒక సైనికోద్యోగితో సైనికవ్యూహానికి సంబంధించిన వివాదం పెంచుకోవటం యిష్టంలేక, అంత కంటే ఎక్కువ మాట్లాడలేను. శత్రువు నిరోధించక పోవటం చేత అతను అలాగే సైన్యాల్ని ముందుకు నడిపించాడు. తొమ్మిదిమైళ్ళదూరం వచ్చేసరికి శత్రువులు చెట్లు, పొదలు చాటుచేసుకొని, ఒక్కసారిగా అగ్నివర్షం కురిపించారు. అంత వరకుశత్రువులు సమీపంలోనున్న సంగతిజనరల్‌కు తెలియదు.

మొదటి శ్రేణి ఈ విధంగా భిన్నాభిన్నమై పోయినతర్వాత జనరల్ మరికొంతసైన్యాన్ని అక్కడకు పరుగెత్తించాడు. అశ్వారూఢులైన ఆఫీసర్లు తొందరగా గుర్తుకట్టబడి హతులై పోయారు. సిపాయిలందరూ కంగారులో ఒకచోట గుంపుగా చేరారు. వారికిఏవిధమైన ఆజ్ఞలు జారీ కావటం లేదు. వారిలో మూడింట రెండువంతులమంది నిహతులైనారు. చివరికి భయపడి ఎటువారటు కంగారుగా చెల్లాచెదురై పోయారు. వాగన్లు తోలుకువచ్చిన వారు తలో గుర్రాన్ని ఎక్కి పరుగెత్తారు. తక్కినవారు వార్ని అనుసరించారు. అందుచేత వాగన్లు, సాధన సామాగ్రి, ఫిరంగులు, అన్నీకూడా శత్రువుల చేతుల్లో చిక్కాయి. జనరల్ క్షతగాత్రుడై ఆతికష్టం మీద బయటకు తీసుకురాబడ్డాడు. అతని కార్యదర్శి పిల్లే అప్పుడే చంపబడ్డాడు. 86 మంది ఆఫీసర్లలోనూ అరవై ముగ్గురు గాయపడినవారు, మరణించినవారూ ఉన్నారు. 1100 మంది సోల్జర్లలోనూ 714 మంది వధింప బడ్డారు. మొత్తం సైన్యంలో ఎంచుకోబడిన చురకత్తుల్లాంటి వారు యీ 1100 మందీ. తక్కినవారు కల్నల్ డన్ బర్ వెంట బయలుదేరారు. ఈ సంఘటనతో బ్రిటిష్ వారిని గురించి వరకుగల మహోన్నతమైన అభిప్రాయాలు కొంతవరకు అనుమానాస్పదమైనవని తేలిపోయాయి. వారు దేశంలో దిగిన తరువాత మొదటి ప్రయాణంలోనే అనేక అత్యాచారాలు, దోపిడీలు సాగించి ఎన్నో పేదకుటుంబాలను నాశనంచేశారు. అలాటివారిపై మా రక్షణభారాన్ని వేయటం మంచిదికాదని వెల్లడయింది. 1781 లో ఫ్రెంచిసైనికులు మన దేశంలో రోడ్ ద్వీపంనుంచి వర్జీనియా వరకూ ఏడువందలమైళ్ళు

ప్రయాణం చేశారు. ఒకపందిగానీ, కనీసం కోడిపెట్టగానీ, పోయినట్టు గూడా ఆరోపణలో రాలేదు. వీరి ప్రవర్తనకూ, వారి ప్రవర్తనకూ ఎంత వ్యత్యాసం? జనరల్ యొక్క ఎయిడ్ - డి - క్యాంప్ అయిన కెప్టెన్ ఆర్మ్సకూడా బాగా గాయపడ్డాడు. అతడు మరణించేముందు "వీళ్ళతో ఎలా ప్రవర్తించాలో ఇకమీదట మనకు బాగా తెలుస్తుంది" అన్నాడు. కార్యదర్శిదగ్గర గల రికార్డులన్నీ శత్రువుల చేతుల్లోకి చిక్కినయ్. వాటిని వారు ఫ్రెంచి భాషలోకి అనువదించి ప్రకటించి, యుద్ధానికి ముందే తమపై ఇంగ్లీషువారెంత ద్వేషభావం వహించియున్నారో నిరూపించుకున్నారు. అందులో మంత్రివర్గానికి జనరల్ వ్రాసిన ఉత్తరాలు కొన్ని ఉన్నాయి. వాటిలో నేను చేసినటువంటి సేవను ఉగ్గడిస్తూ వ్రాసినలేఖలుకూడా ఉన్నాయి. కానీ దండయాత్ర విఫలమైపోవటంచేత నేనుచేసిన కృషియొక్క విలువను వారు గుర్తించలేదు.

ఇక బహుమతి విషయంలో నే నడిగింది ఒక్కటే. మేము కొనుక్కున్న సేవకులను తనపట్టీలో చేర్చుకోవద్దనీ, అప్పటికే జేర్చుకున్నట్లయితే వారిని విడుదల చేయమనీ అభ్యర్థించాను. అతడు దానిని ఆమోదించాడు. నా యీ అభ్యర్థన వలన చాలామంది సేవకులు వారి యజమానుల దగ్గరకు వచ్చివేశారు. డన్‌బర్ కమాండర్ చేయవలసిన బాధ్యత తనమీదపడ్డప్పుడు ఉదారంగా ప్రవర్తించలేదు. అతడు తిరోగమిస్తూ ఫిలడల్ఫియా వచ్చినప్పుడు లంకాస్టర్ లోని ముగ్గురు పేదరైతులయొక్క సేవకులను విడుదలచేయ

మని అభ్యర్థించాను. ఆ విషయంలో జనరల్ యొక్క ఆజ్ఞ లను గుర్తుకు తెచ్చాను. అతడు తాను కొద్దిరోజుల్లో న్యూయార్కు వెళ్తూ మార్గమధ్యంలో ట్రెంటన్‌లో ఆగుతా ననీ, అప్పుడు యజమానులువచ్చి తనను కలుసుకుంటే వారి సేవకులను విడుదల చేయగలననీ వాగ్దానం చేశాడు. ఆ ముగ్గురు రైతులూ మిక్కిలి వ్యయప్రయాసలకోర్చి ట్రెంటన్ వెళ్ళి డన్‌బర్‌ను కలుసుకున్నారు. కానీ అతడు తనవాగ్దా నాన్ని నెరవేర్చుకోనటానికి నిరాకరించాడు. విపరీతమైన ఆశాభంగంతో వారు తిరుగుముఖం పట్టారు.

యుద్ధంలో వాగన్లూ, గుఱ్ఱాలూ నష్టపడిపోయినట్లు తెలియగానే నష్టపరిహారం చెల్లించమంటూ నా మీదకు దండెత్తి వచ్చారు. ఇది నాకు చాలాచిక్కు కలిగించింది. నష్టపరిహారం చెల్లించటానికి కావలసిన మొత్తం సిద్ధంగానే ఉందనీ, కానీ ముందు జనరల్ షిర్లేనుంచి ఆజ్ఞ రావాలనీ, అనతికాలంలోనే అది వస్తుందనీ, ఎంత చెప్పినా ఎవరూ సంతృప్తిపడక నన్ను వేధించటం మొదలుపెట్టారు. చివరకు జనరల్ షిర్లే యీ ఉపద్రవం నుంచి నన్ను రక్షించాడు. నష్టపరిహారం విలువకట్టి చెల్లించటానికి కమీషనర్లు నియ మించ బడ్డారు. మొత్తం యిరువది వేల పౌన్లవరకూ చెల్లించ వలసి వచ్చింది. ఆ బాధ్యత నా మీద పడితే నేను సర్వ నాశనమై పోయేవాణ్ణి.

ఈ అపజయాన్ని గురించినవార్త మాకు చేరకముందు ఇద్దరు డాక్టర్లు నాదగ్గరకు వచ్చి మనసైన్యాలు డిక్‌వెస్‌నే కోట ఆక్రమించిన సందర్భంలో ఉత్సవం జరుపుకుంటానికి

చందాలు ప్రోగుచేస్తున్నామనీ, నన్నుకూడా కొంత విరాళ మిమ్మనీ అడిగారు. నేను యుద్ధంలో జయాపజయాలు ముందే నిర్ణయించటం సాధ్యం కాదనీ, అలాంటిఉత్సవం ఏర్పాటుచేసుకుంటానికి యింకా కావల్సినంత వ్యవధివుందనీ చెప్పాను. ఈ విజయాన్ని నేననుమానించటానికి గల కారణాలను గూడా వివరించి చెప్పాను. వెంటనే వారు చందాలు ప్రోగుచేసి, ఉత్సవం జరిపించే ప్రసక్తి మానివేశారు. లేకపోతే గొప్ప అవమానానికి వారు గురికావాల్సి వచ్చేది. డ్రాడక్ ఓడిపోకముందు గవర్నర్ మారిస్ తన సందేశాల వర్షంతో అస్సెంబ్లీకి చీకాకు కలిగిస్తూనే ఉన్నాడు యెస్టేట్లను మినహాయించి అదనపు పన్నులు విధించి ఆ మొత్తాన్ని యుద్ధపుఖర్చులకు పంపాలని అతని ఊహ కానీ అస్సెంబ్లీ అందుకు అంగీకరించలేదు. న్యాయం తమపక్షాన కలదని అస్సెంబ్లీవారు భావించారు. డబ్బుకు సంబంధించిన బిల్లులను సవరించే అవకాశం గవర్నరు కిచ్చినట్లయితే తన ముఖ్యమైన హక్కు కోల్పోవలసివస్తుందని వారు గుర్తించారు. ఈవార్త ఇంగ్లండు చేరినప్పుడు అక్కడి మా స్నేహితులంతా దీని విషయంలో కొంత ఆందోళన ప్రారంభించారు. రాష్ట్రరక్షణకు యెస్టేట్ల యజమానులు అవరోధం కలిగించటం చేత వారికి ఏవిధమైన హక్కు ఉండగూడదని కొందరు వాదించారు. దీనికి వారు కొంతకంగారుపడి అలాటి రక్షణచర్యలకు అయిదువేల పౌన్ల ద్రవ్యాన్ని విరాళంగా యిమ్మని తన ప్రతినిధికి ఆదేశం పంపారు. ఈవిషయం అస్సెంబ్లీకి తెలియజేయ బడింది. అప్పుడు తయారుచేయబడిన బిల్లులో

వారికి మినహాయింపు జరిగింది. యీ సమయంలో ఒక ఐచ్ఛిక సేనను తయారుచేయుటానికి కావలసిన బిల్లును అస్సెంబ్లీలో నేను ప్రతిపాదించాను. సునాయాసంగా ఇది ఆమోదింప బడింది. దీనివిషయంలో క్వేకర్లకు మాత్రం పూర్తి స్వేచ్ఛ యివ్వబడింది. ఈ సంఘాన్ని అభివృద్ధిపరచటానికి నేను ఒకసంభాషణను 1756 ఫిబ్రవరి, మార్చి నెలలో జంటిల్ మెన్స్ మాగ్జయిన్‌లో వ్రాశాను. ఇందులో అలాంటి సేనను స్థాపించటానికి గల అభ్యంతరాలు, వాటికి సమాధానాలు పూర్తిగా చర్చించబడ్డాయి. దీనివల్ల మంచి ప్రయోజనమే కలిగింది. దేశంలోనూ, నగరంలోనూ, అనేకజట్లు నిర్మింపబడి శిక్షణ పొందుతున్నాయి. నైఋతీ సరిహద్దులో రక్షణశ్రేణి నిర్మించి, సైన్యాన్ని సమకూర్చే బాధ్యత నాకు అప్పగించ బడింది. తగిన అర్హత లేకపోయినా యీసైనిక వ్యవహారాన్ని నేను స్వీకరించాను. నాకు ఈ విషయంలో పూర్తి అధికారాలు యివ్వబడ్డయ్. తగినవారిని ఆఫీసర్లుగా నియమించటానికి సంతకం చేయబడిన ఖాళీ ఆజ్ఞాపత్రాలు కూడా కొన్నింటిని నా కిచ్చారు. అనతికాలంలోనే, అయిదు వందల అర్హవైమందిని సైన్యంలో జేర్పించాను. ఇటీవల యుద్ధంలో ఆఫీసరుగా పనిచేసిన నా కుమారుడు నా దగ్గరే పనిచేస్తూ చాలా సహాయకారిగా ఉన్నాడు. ఇటీవల ఇండియన్లు, 'గ్నాడెన్ హట్' అనే గ్రామాన్ని నేలమట్టంచేశారు. అందులో స్థిరనివాసం ఏర్పరచుకొన్న మొరేవియన్లను చిత్రవధ చేశారు. కానీ ఆప్రదేశం కోట నిర్మించటానికి అనువైనదిగా భావించబడింది. సైనిక జట్లులన్నింటినీ బెత్లీహామ్

లో నేను సమావేశపరచాను. అక్కడివారంతా గ్రాడెన్ హాట్ నాశనం చేయబడటం చూసి భీతచిత్తులై ఉన్నారు. ముఖ్యమయి నటువంటి భవనాలముందు ప్రత్యేకమయిన ఆయుధాలతో కాపలా ఏర్పాటుచేయబడింది. సాయుధులైన సోదగులు క్రమపద్ధతిలో ఆప్రాంతాన్ని కాపలాకాస్తున్నారు. జనవరి మాసారంభంలో మేముకోటలను నిర్మించటం ప్రారంభించాం. ఒకపటాలాన్ని మినిసింగ్ దిశకు పంపాను. అక్కడ ఎగువభాగంలో ఒక కోటనూ, దిగువ భాగంలో మరొక కోటను నిర్మించమని వారికి ఆదేశాలు జారీచేయబడినయ్. గ్నాడెన్ హాట్ లో ఒక కోట నిర్మించటం తక్షణావసరంగా భావించి నేను అక్కడికి వెళ్ళాలని నిశ్చయించు కున్నాను. మా సాధనసామాగ్రి సరఫరాకావటానికి మొరేవియన్లు మాకు అయిదువాగన్లు సప్లయిచేశారు. మేముబెత్లీహామ్నుండి బయలుదేరేముందు పదకొండుమంది రైతులు మా దగ్గరకు పరుగెత్తుకొనివచ్చారు. వారు తమపొలాలనుంచి ఇండియన్ల చే తరమ బడినవారు. ఆయుధాలు సప్లయి చేయమనీ వాటి సహాయంతో తమ పశువులను మరలించుకొని వస్తామనీ వారు ప్రార్థించారు. మేం బయలుదేరాం. మార్గమధ్యంలో వాన ప్రారంభ మయింది. మాకు ఆశ్రయ మీయటానికి రోడ్డుప్రాంతంలో ఎక్కడా ఇళ్ళులేవు. చివరికి ప్రొద్దు కుంకిన తరువాత ఒక జర్మన్ ఇంటికి వచ్చాం. తడిసి ముద్ద లైపోయిన మేమంతా అక్కడ కొంత విశ్రాంతి తీసు కున్నాం. ఆ వానలో మార్గ మధ్యంలో శత్రువులు మమ్మ ల్ని ముట్టడించ లేదు. అది కొంత నయం. సామాన్యమైన

మా తుపాకులు నీటిలో పూర్తిగా తడిసిపోయాయి. ఇండియన్లు చాలా అభిసేతికరంగా ప్రవర్తించగలరు. ఆరోజున పదకొండుమంది రైతులను పట్టుకొని అందులో పదిమందిని చంపివేశారు. మిగిలిన ఒక్కడూ వచ్చి తమ తుపాకులు వానలో తడిసి పోవటంచేత యీ ప్రమాదం జరిగిందని చెప్పాడు.

మర్నాడు వాతావరణం బాగుండటంచేత మేము ప్రయాణంసాగించి •నిర్మానుష్యమై పోయిఉన్న గ్నాడెన్ హాట్ చేరుకున్నాం. వెంటనే అక్కడ లభించిన కొద్దిసాధన సామాగ్రితో తాత్కాలికనివాసాలు ఏర్పాటుజేసుకున్నాం. మొట్టమొదట అక్కడ పడిఉన్న మృతకళేబరాల నన్నింటినీ సక్రమంగా సమాధి చేసివేశాం. మర్నాటి ఉదయం మా కోటకు కావాల్సిన ప్లాను వేయబడింది. మా దగ్గరగల డెబ్బై గొడ్డళ్ళు చురుకుగా పనిచేసి అరణ్యాన్ని ఛేదించటం ప్రారంభించాయి. ఆరునిమిషాలలో ఇద్దరు మనుషులు పైన్ చెట్టును నరికివేయటం నేను చూశాను. దాని అర్ధవ్యాసం పదునాల్గు అంగుళాలవరకూ ఉంది. ఈలోగా మా బృందం లోని తక్కినవారు చుట్టూ మూడు అడుగుల లోతుగల గోతిని త్రవ్వుతున్నారు. నరికిన దూలాలన్నింటినీ ఇందు లోనే పాతిపెట్టాలి. మా వడ్రంగులు చుట్టూ లోపల ఆరు అడుగుల ఎత్తున ఒక వేదిక నిర్మించారు. అక్కడ నిలబడి శత్రువులపై కాల్పులు సాగించవచ్చు. మా దగ్గర ఒక స్వీవెల్ తుపాకీఉంది. మా దగ్గర అలాంటి తుపాకులున్న విషయం ఇండియన్లకు తెలియాలని ఒకసారి కాల్చిచూశాం.

ఆ విధంగా మా కోట నిర్మాణం వారం రోజుల్లో పూర్తయింది.

ఈ సందర్భంలో నేనొక విషయాన్ని పరిశీలించాను. ఎవరికైనా ఏదోఒక విధమైన వ్యాపకం ఉన్నప్పుడు రోజులు కులాసాగా గడుస్తాయి. రోజంతా కష్టించి ఒక మంచిపని చేశామనే సంతృప్తితో వారు సాయం సమయాలు ఆహ్లాదకరంగా గడపగలరు. కానీ పనిలేని రోజుల్లో వారంతా ఒకరిలో ఒకరు తప్పులు పట్టుకుంటూ, పోట్లాడుకుంటూ ఉండేవారు. ఈ విషయం చూచినప్పుడు ఒక ఓడకెప్టెన్ నాకు గుర్తుకు వచ్చాడు. తన పరివారం అందరినీ ఎప్పుడూ పనిలో ఉంచటం అతని సూత్రం.

మేము నిర్మించినటువంటి కోట ఎంత అవిటిదైనా ఇండియన్లనుంచి రక్షణ పొందటానికి అది సరిపోతుంది. ఎందుకంటే వారికి ఫిరంగులు లేవు. ఈ విధంగా మాకు ఒకసురక్షితమైన స్థావరం సంపాదించాక చుట్టుపట్ల ప్రాంతాల్లోకి బయల్దేరాం. మాకు ఇండియన్ లెవరూ కన్పించలేదు. కాని దూరంగా కొండలమీద వారు మా కార్యక్రమాన్నంతా గమనిస్తున్నారని మాత్రం గ్రహించాం. అది శీతాకాలం కావటంచేత ఇండియన్లకు చలిమంట అవసరమయ్యేది. కాని అలా మామూలుగా నిప్పు చేసినట్లయితే వారియొక్క ఉనికి మాకు తెలిసిపోయే ప్రమాదముంది. అందుచేత వారు భూమిలో మూడుఅడుగుల వ్యాసంగల గోతులను త్రవ్వుకునే వారు. అందులో నిప్పుచేసుకొని చలికాగేవారు. ఈ విధమైనమంటవల్ల వారిని గుర్తుపట్టటానికి అవకాశంలేకపోయేది.

బహుశా వారు తగినంతమంది లేకపోవటంచేత మమ్మల్ని ముట్టడించటానికి సాహసించిఉండరు.

కోట నిర్మించటం - అందులో సాధన సామాగ్రి నింపటం పూర్తిఅయేసరికి - గవర్నర్ దగ్గరనుంచి నా కొక లేఖ వచ్చింది. తాను అస్సెంబ్లీ సమావేశాలు ఏర్పాటుచేసి నట్టూ వెంటనే నన్ను బయులుదేరి రమ్మనీ వ్రాశాడు. ఇంకా అస్సెంబ్లీలోని కొందరు స్నేహితులుకూడా, సమావేశాలకు హాజరుకమ్మంటూ పదేపదే లేఖలు వ్రాయసాగారు. ఇప్పుడు నా ఆశయంప్రకారం మూడు కోటలూ నిర్మించబడ్డాయి. వాటి రక్షణతో ప్రజలు తృప్తిపడి పనిపాటలు చేసుకుంటు న్నారు. నేను తిరిగి వెళ్ళిపోవాలని నిశ్చయించుకున్నాను. దానికితోడు ఇండియన్ యుద్ధంలో పనిచేసిన కల్నల్ క్లాప్‌హామ్ అనే న్యూ ఇంగ్లండు ఆఫీసరొకడు - మా కోటను చూడటానికి వచ్చాడు. నాబదులు అతడు కమాండర్‌గా ఉంటానికి అంగీకరించాడు. అతనికి నా అధికారాన్ని బదిలీ చేసి, సైనికవందనమయాక, సైనికులకు అతన్ని పరిచయం చేశాను. సైనిక వ్యవహారాలలో అతనికిగలవిశేషప్రజ్ఞా పాండి త్యాలవల్ల, నాకంటే ఆయనే ఆపదవికి అర్హుడని, వారికి చెప్పాను.

ఆ తర్వాత నేను శెలవుపుచ్చుకుని బయులుదేరాను. బెత్లీహామ్ వరకూ నా వెంట కొందరు సైనికులు వచ్చారు. అక్కడ నేను కొంతకాలం విశ్రాంతితీసుకున్నాను. గార్డెన్‌లో కఠినమైన శయ్యమీద నిద్రించటం అలవాటయిన నాకు, ఆ రాత్రి మెత్తటి పక్కమీద నిద్రపట్టలేదు.

జెర్మీ హోమ్‌లో ఉండగా మొరేవియన్ల ఆచారాన్ని గురించి నేను కొంత ఆరాతీశాను. కొందరు నాతో కలిసే ఉన్నారు. నా మీద చాలా ఆదరాభిమానాలు వ్యక్తం చేశారు. వారి చర్చికి నేను వెళ్ళానుకూడా. అక్కడ చక్కటి సంగీతం నాకు వినిపించారు. వయొలిన్, ఫ్లూట్, క్లారినెట్ వాద్యాలు వాయించారు. అక్కడ ఆధ్యాత్మికోత్సవాలకూ, ఉపన్యాసాలకూ, ఆడా మగా పిల్లలూ అందరూ మనలా ఒకేసారి సమావేశం కారు. ఒకసారి వైవాహికజీవితంగడిపే పురుషులు, మరోసారి వారిభార్యలు, ఒకోసారి బ్రహ్మచారులూ, వేరొకసారి కన్యలూ, మరొకసారి పిల్లలూ వేరు వేరుగా సమావేశమై ఉపన్యాసాలు వింటారు. వారందరూ చాలా క్రమశిక్షణతో సంచరిస్తారు. కాని అనారోగ్యంగా, పాలిపోయినట్లు కనిపిస్తారు. బహుశా తగినంత శరీర వ్యాయామం వారికి అలవాటు ఉండీఉండక పోవచ్చు.

మొరేవియన్ వివాహపద్ధతినిగురించి నేను వివరాలు అడిగి తెలుసుకున్నాను. పెళ్ళిళ్లు లాటరీ పద్ధతిమీద జరిగే మాట నిజమేనా అని అడిగాను. సాధారణంగా చీట్లపద్ధతి అవలంబించ బడదనీ, పెద్దలే తగిన వధూవరులను ఏరికూర్చి వివాహంచేస్తారనీ తెలిసింది. కాని, ఒక యువకునకు తగిన ఇద్దరు ముగ్గురు కన్యలు కనిపించినప్పుడుమాత్రం చీట్ల పద్ధతి అవలంభించబడుతుందట !

నేను ఫిలడల్ఫియా తిరిగివచ్చాను. అక్కడ సంఘం బాగా పనిచేస్తున్నట్లు తెలిసింది. క్వేకర్లు కానివారు చాలా

మంది ఇందులో జేరారు. వారే తమ నాయకులను ఎన్ను కున్నారు. ఇదంతా కొత్త శాసనం ప్రకారం జరిగింది. డాక్టర్ బి నా దగ్గరకువచ్చి, ఈ కొత్త శాసనాన్ని తయారు చేయటానికీ, వ్యాపింపజెయ్యటానికీ, తాను పడినశ్రమను వర్ణించాడు. నేను లోగడ జంటిల్‌మన్స్ మాగజయిన్‌లో వ్రాసిన రచనవల్లనే ఇదంతా జరిగిందనే గర్వం నా కున్న ప్పటికీ, అతని అభిప్రాయాన్ని ఖండించటం యిష్టంలేక ఊరుకున్నాను. మా జట్లు ఎన్నో నాకు గుర్తులేదుగాని, రమారమి పన్నెండు వందలమంది ధృఢగాత్రులైన సైని కులూ, ఒక ఫిరంగిదళమూ కనిపించింది. నేను మొట్టమొదట ఆ దళాన్ని పర్యవేక్షించినప్పుడు, వారు నా వెంట యింటి వరకూవచ్చి, గౌరవసూచకంగా ఆకాశంలోకి కాల్పులు సాగించారు. కాని, ఇంగ్లండులో చెయ్యబడిన ఒక శాసనం ఫలితంగా ఆ తర్వాత కొద్ది కాలానికే మా ఉద్యోగాలన్నీ రద్దయిపోయాయి.

నేను కల్నల్‌గా ఉన్న కాలంలో, ఒకసారి వర్జీనియా వెళ్తున్నాను. నా దళంలోని ఆఫీసర్లు, నన్ను కొంత దూరం వెంబడించి, వీడ్కోలీయటం మంచిదని భావించారు. నేను గుఱ్ఱాన్ని ఎక్కే ముందు వారంతా నా గుమ్మం దగ్గరకు వచ్చారు. షుమారు ముప్ఫై నలభై మంది ఉన్నారు. అందరూ పూర్తి యూనిఫారంలు ధరించి ఉన్నారు. ఈ మర్యాదలు నా కంతకుముందు అలవాటు లేవు. అయినా వాటిని నేను నివారించదల్చుకోలేదు. చిక్కు ఎక్కడవచ్చిం దంటే– నాతోపాటు విచ్చుకత్తులతో, వారు వెంబడించటం

భూస్వామి చూశాడు. ఇది అతనికి చాలా కష్టంకలిగించింది. రాష్ట్రంలో తనకిగానీ, తన గవర్నర్లకుగానీ ఎన్నడూ అటువంటి గౌరవం జరగలేదు. రాజవంశానికి చెందినవారికి మాత్రమే అలాటి గౌరవం జరగాలని అతని ఘోష. ఈ స్వల్ప విషయంవల్ల, ఆయనకు నాపైగల కోపం యింకా పెరిగింది. ఎస్టేట్లకు పన్ను మినహాయించే ప్రతిపాదనలను, నేను అనేకసార్లు వ్యతిరేకించటంచేత, అంతకుముందే ఆయనకు నాపై చాలా ఆగ్రహంగాఉంది. ప్రభుత్వానికి నేను చాలా ఆటంకంగా ఉన్నాననీ, డబ్బు రాబట్టే బిల్లులు ఆమోదింపబడనీయకుండా అస్సెంబ్లీలో నేను అడ్డుపడుతున్నాననీ, అతడు మంత్రివర్గానికి ఫిర్యాదుచేశాడు. నా వెంట సిపాయిలు సాయుధులై వెంబడించిన దృశ్యానికి అపార్థంతీస్తూ, నేను అనతికాలంలోనే, రాష్ట్ర ప్రభుత్వాన్ని చే జిక్కించుకోవాలని చూస్తూన్నట్లు నేరం మోపాడు. పోస్టుమాస్టర్ జనరల్ సర్ ఎవర్ట్ షా కెనక్కు, నాఉద్యోగం తీసివేయమని సిఫారసు చేశాడు. దానివల్ల ఏ కార్యమూ జరగలేదు. గవర్నర్కూ, అస్సెంబ్లీకీ మధ్య తరచుగా చెలరేగే వివాదాలలో భాగం పంచుకోవటంమినహా, ఆయనతో నాకు, ఏ విధమైన వ్యక్తిగతమైన వివాదమూ రాలేదు.

మేం కలిసి సమిష్టిగా, బ్రాడక్ సైన్యాలకు సామాగ్రి సరఫరా చేశాం. ఆ తర్వాత పిడుగులాంటి వార్త వచ్చిన తక్షణం సంప్రదించటానికి నా కోసం కబురు పంపాడు. అప్పుడు ఆయనకు నేను యిచ్చిన సలహా ఏమిటో నాకిప్పుడు గుర్తులేదు. బహుశా, డన్‌బర్ సరిహద్దుప్రాంతంలో తన

సైన్యాలను నిలపాలనీ, కొత్తసైన్యాలు రాగానే, దండయాత్ర ప్రారంభించవచ్చనీ, ఆవిధంగా ఆయనకు, ఒక లేఖ వ్రాయమనీ సలహా యిచ్చినట్లు గుర్తు. ఆ తర్వాత నన్ను జనరల్‌గా నియమించదల్చుకున్నట్లు కూడా ఆయన తెలియజేశాడు. కాని ఆయన చెప్తున్నట్లు సైనికవిషయాలలో నాకు గొప్ప ప్రజ్ఞా పాండిత్యా లున్నాయని నాకే నమ్మకం లేదు. బహుశా నాకుగల పలుకుబడివల్ల తొందరగా సైన్యం సమకూరి, అస్సెంబ్లీ సహాయం లభిస్తుందని ఆయన అనుకుని ఉండవచ్చు. ఈ విషయంలో నాకు ఉత్సాహం లేకపోవటం గమనించి, ఈ ప్రతిపాదనను ఉపసంహరించుకున్నాడు. ఆ తర్వాత కొద్దికాలానికే అతడు ప్రభుత్వం వదిలి వెళ్ళిపోయాడు. కెప్టెన్ డెన్నీ వచ్చాడు.

ఈ రాజకీయాల్లో నేను నిర్వహించినపాత్రను వర్ణించుకుంటూ పోయేముందు, ఇక్కడ శాస్త్రజ్ఞునిగా నేనుగడించిన పేరు ప్రఖ్యాతుల్ని గురించి కొంతవివరిస్తాను.

1746 లో నేను బోస్టన్‌లో ఉండగా, డాక్టర్ స్పెన్స్ అనేవ్యక్తిని కలుసుకున్నాను. అతడు అంతకుముందే స్కాట్‌లండ్ నుంచి వచ్చాడు. అతడు నాకు కొన్ని విద్యుత్ ప్రయోగాలను చూపించాడు. అందులో అతనికి పూర్తిపాండిత్యం లేకపోవటం చేత, ప్రయోగాలను అతడు సక్రమంగా నిర్వహించలేదు. అయినా వాటినిచూసి నేను చాలా ఆనందాశ్చర్యాలు అనుభవించాను.

నేను ఫిలడల్ఫియా తిరిగి రాగానే, లండన్ రాయల్ సొసైటీకి చెందిన మిస్టర్ పి. కాలిన్స్ అనేవ్యక్తి, మా లైబ్ర

రీకి కొన్ని విద్యుత్ ఉపకరణాలు పంపాడు. వాటితో కొన్ని ప్రయోగాలు చేయటానికి వీలుంది. వెంటనే బోస్టన్‌లో నేనుచూసిన ప్రయోగాలను ఇక్కడ స్వయంగా చేయటం ప్రారంభించాను. అనతికాలంలోనే వీటిని చాలా చురుగ్గా చేయగలుగుతున్నాను. అలా చాలా కాలం రకరకాల ప్రయోగాలు సాధన చేశాను. అవి చూడటానికి వచ్చిన ప్రజలు చాలా ఆశ్చర్యపోయేవారు.

ఆ తర్వాత అలాటి ఉపకరణాలు కొన్నింటిని తయారు చేసి, స్నేహితులందరం వేరువేరుగా ప్రయోగాలు మొదలు పెట్టాం. ఇందులో మిస్టర్ కిన్నర్స్లే ముఖ్యుడు. అతడు చాలా మేధావంతుడు. అతని కిప్పుడు మరో వ్యాపారం లేక పోవటం చేత, ఈ ప్రయోగాలను బహిరంగంగా ప్రజలకు చూపుతూ డబ్బు గడించుకొమ్మని సూచించాను. అందుకు కావలసిన ఉపన్యాసాలుకూడా అతనికితయారుచేసి ఇచ్చాను. ఈ పనికి అతడు చక్కటివాంగు కూర్చుకున్నాడు. నేనంతకు ముందు తయారుచేసిన చిన్నచిన్న యంత్రాలన్నింటినీ మెరుగులు దిద్ది ప్రదర్శించాడు. అతని ఉపన్యాసాలుకూడా ఆకర్షణీయంగానే ఉండటంచేత ప్రజలు బాగానే వచ్చారు. కొంత కాలానికి, వీటిని ప్రదర్శిస్తూ కాలనీలన్నింటిలోనూ, అన్ని ముఖ్యపట్టణాల్లోనూ అతను తిరిగాడు. ఆ విధంగా కొంత లాభం గడించాడు కూడా. ఎటుతిరిగీ, ప్రతికూల వాతావరణం వల్ల వెస్ట్ ఇండీస్‌లో ఈ ప్రయోగాలు చెయ్యటం కష్టమైంది.

మిష్టర్ కాలిన్స్ మాకీ ఉపకరణాలు పంప్రాడుగనుక, అందులో మేం సాధించిన విజయాలను ఆయనకు తెల్లియ జెయ్యటం మా కర్తవ్యమని భావించాను. మా ప్రయోగా లను వివరంగా వర్ణిస్తూ ఆయన కనేకలేఖలు వ్రాశాను వాటన్నింటినీ అతడు రాయల్ సొసైటీలో చదివాడు. కాని మొదట వారు వాటికి తగినంత ప్రాధాన్యం ఇయ్యలేదు. విద్యుత్‌తో లైట్లు వెలిగించటం గురించి నేను మిష్టర్ కిన్నర్‌స్లేకు వ్రాసిన లేఖ ప్రతిని, నాకు పరిచయంగల డాక్టర్ మిట్చెల్‌కు కూడా పంపాను. అతడుకూడా రాయల్ సొసై టీలో సభ్యుడు. దాన్ని చదవగా విని, అందరూ నవ్వారని ఆయన నాకు జవాబు వ్రాశాడు. ఆ తర్వాత ఆ పత్రాలను డాక్టర్ ఫాదర్‌గిల్ చూసి, వాటికి కొంత విలువనిచ్చి, ప్రక టించాలని సలహా యిచ్చాడు. మిష్టర్ కాలిన్స్ వాటిని జంటిల్‌మన్స్ మాగజయిన్‌లో ప్రకటించటానికి, కేవ్ అనే పెద్దమనిషికి యిచ్చాడు. కాని అతడు వాటిని మాగ్‌జయిన్‌లో కాక విడిగా ప్రకటించాడు. వ్యాపార దృష్ట్యా ఇదే లాభదాయకమైన నిర్ణయం. ఎందుకంటే, ఆ తర్వాత ఇవి బాగా అమ్ముడుపోయి, అయిదుసార్లు అచ్చు పడినయ్.

క్రమంగా, ఈ పత్రాలు ప్రజలదృష్టిని ఆకర్షిస్తు న్నాయి. దీనిప్రతి ఒకటి ఫ్రాన్సులో గొప్ప పేరు ప్రఖ్యా తులు సంపాదించిన కౌంట్ డీ బఫన్ అనే శాస్త్రజ్ఞుని చేతిలో పడింది. అతడు దానిని ఫ్రెంచిభాషలోకి అనువదింపజేసి ప్యారిస్‌లో ప్రకటించాడు. అంతకుముందే విద్యుచ్ఛక్తిని

గురించి ఒకసిద్ధాంతాన్ని ప్రకటించిన 'అబ్బీనాలెట్' అనే శాస్త్రజ్ఞునికి యిది కొంతకష్టం కలిగించింది. అమెరికానుంచి ఈకొత్తసిద్ధాంతం వచ్చిందని అతడు నమ్మలేదు. పారిస్‌లోనే తన విరోధులు కొందరు తన సిద్ధాంతాన్ని చులకనచేయటం కోసం దీన్ని మారుపేరుతో ప్రచురించారని అన్నాడు. ఆ తర్వాత ఫిలడల్ఫియాలో ఫ్రాంక్లిన్ అనే ఒకవ్యక్తి నిజంగా జీవించిఉన్నాడని అతనికి తెలియగానే అతడు కొన్ని లేఖల సంపుటిని ఒకదానిని ప్రకటించాడు. అందులో అనేకం, నన్ను సంబోధిస్తూ ఉన్నాయి. తన వాదాన్ని సమర్థించుకుంటూ నా పరిశోధనలను, వాటిపై నేను చేసినసిద్ధాంతాలను ఖండిస్తూ అవి వ్రాయబడ్డాయి.

నేను ఒకసారి ఈ విమర్శకులకు జవాబు వ్రాయాలనుకున్నాను. వ్రాయటం మొదలుపెట్టానుకూడా. కాని నా రచనల్లో ప్రయోగాలు చేసేవిధానం కూడా వర్ణించబడటంచేత ఎవరైనా ప్రయోగాలుచేసి నేను చెప్పింది యదార్థమని గ్రహించగలరు. అందుచేత నా సిద్ధాంతాన్ని రక్షించుకోవలసిన బాధ్యత నాకులేదు. అదీగాక రెండు వేరు వేరు భాషలలోని వ్యక్తులమధ్య చెలరేగే వాగ్వివాదాలు అంతూ అవధిలేకుండా పెరిగే అవకాశం ఉంది. తప్పుడు అనువాదాల వల్ల మరికొన్ని అపవాదాలేర్పడవచ్చు. అందుచేత యిలాటి వాగ్వివాదాలలో వ్యర్థపుచ్చే కాలాన్ని సరికొత్త ప్రయోగాలు చేసుకుంటూ గడపటం మంచిదని నేను భావిస్తాను. అందుచేత నే నెన్నడూ నాలెట్ విమర్శలకు జవాబు వ్రాయలేదు. ఇలా తటస్థంగా ఉండటంవల్ల నాకు కలిగిన

ప్రమాదమూ లేదు. ఎందుచేతనంటే, నా స్నేహితుడైన యమ్లీరాయ్ నా తరఫున సమాధానం చెప్పాడు అతడు కూడా రాయల్ యెకాడిమీ సభ్యుడు. నా పుస్తకం ఇటాలియన్, జర్మన్, లాటిన్ భాషల్లోకి అనువదించబడింది. శాస్త్రజ్ఞులందరూ ఏకగ్రీవంగా ఎబ్బే సిద్ధాంతాన్ని గాక నా సిద్ధాంతాన్నే ప్రాతిపదికగా తీసుకుంటున్నారు. అతని కళ్ళముందే అతని సిద్ధాంతాన్ని ఆమోదించిన వారిసంఖ్య తగ్గి క్రమంగా అదృశ్యమైపోయింది.

ఆ తరువాత ఒక సంఘటన నా గ్రంథానికి విశేషమైన ప్రచారాన్ని తెచ్చిపెట్టింది. నేను సూచించిన ప్రయోగాన్ని ఆధారంగా మార్లేలోని మెస్సర్స్ దాలీబాద్ అండ్ డీలార్ కంపెనీవారు మబ్బుల్లోంచి విజయవంతంగా వెలుగును పుట్టించగలిగారు. ఈ విషయం ప్రజలందరినీ ఆకర్షించింది. యమ్ డీలార్ వద్ద ప్రయోగాలు చేయటానికి కొన్ని ఉపకరణాలున్నాయ్ ఫిలడల్ఫియా ఎక్స్‌పెరిమెంట్స్ అనే పేరుతో అనేక ప్రయోగాలు చేశాడు. చివరకు వాటిని రాజసభలో ప్రదర్శించటంతో ప్రజలందరూ వాటిని చూడటంకోసం ఎగబడ్డారు. ఆ తర్వాత కొద్దికాలానికే ఒక గాలిపటం సాయంతో నేనొక పెద్దప్రయోగం చేశాను. దాని విజయంవల్ల నాకు లభించిన ఆనందం వర్ణించ నలవికానిది.

డాక్టర్ రైట్ అనే ఇంగ్లీషు శాస్త్రజ్ఞుడు ఒక స్నేహితునకు ఒక లేఖ వ్రాశాడు. నా ప్రయోగాలు విదేశాలలో పండితులచేత అంతగా ఆదరింప బడుతున్నప్పుడు, ఇంగ్లండులో వాటికి తగినంత ప్రాముఖ్యం యివ్వక పోవటం గురించి

ఆశ్చర్యం వెలిబుచ్చాడు. డాక్టర్ రైట్ కూడా రాయల్ సొసైటీ సభ్యుడు. ఆ తరువాత నా లేఖలన్నింటినీ వారు పునః పరిశీలించారు. డాక్టర్ వాట్సన్ వాటన్నింటి యొక్క సారాంశాన్ని ఎత్తి వ్రాశాడు. దాన్ని వారి ట్రాన్సాక్షన్ లో ప్రకటించారు. సొసైటీలోని కొందరు సభ్యులు ముఖ్యంగా మిస్టర్ కాంటన్ అనే మేధావి నా ప్రయోగాల్ని చేసి చూసి మబ్బులనుండి వెలుగు పుట్టించటం సాధ్యమని తెలుసుకోవటం జరిగింది. వారు మొదట నన్ను చులకనగా చూసిన దానికంటె ఎక్కువ గౌరవాన్నిచ్చారు. నేను ప్రార్థించకుండానే వారు తమ సంఘంలో నన్ను సభ్యుడుగా జేర్చుకున్నారు. సాధారణంగా చెల్లించవలసిన యిరువై అయిదు గినీల మొత్తాన్ని నాకు మినహాయింపు చేశారు. అప్పటినుంచీ వారి ట్రాన్సాక్షన్ నాకు ఉచితంగా పంపుతున్నారు. 1753లో సర్ గాడ్ ఫ్రేకోప్లే యొక్క బంగారు పతకాన్నికూడా నాకు బహూకరించి గొప్పగౌరవం చేశారు. ఆ సందర్భంలో అధ్యక్షుడైన లార్డ్ మెక్లిస్ ఫీల్డ్ నన్ను గౌరవిస్తూ చక్కటి ఉపన్యాస మొకటి చేశాడు.

మా కొత్త గవర్నర్ కెప్టెన్ డిన్నీ రాయల్ సొసైటీ పతకాన్ని తీసుకొనివచ్చి ఒక సమావేశం ఏర్పాటు చేసి అందులో దాన్ని నాకందజేశాడు. అప్పుడు నా గుణగణాల విషయంలో అతనికిగల పరిచయంవల్ల నాపై గొప్ప గౌరవభావ మేర్పడిందని చెప్పాడు. విందయిన తరువాత ఆచారం ప్రకారం అందరం మద్యాన్ని సేవించాం. అప్పుడు గవర్నర్ నన్ను తన గదిలోకి తీసుకొని పోయాడు. ఇంగ్లండులో

తన స్నేహితులు నా స్నేహం సంపాదించమని సలహాయిచ్చి నట్లు చెప్పాడు. నానుంచి సక్రమమైన సలహాలు లభించట మేగాక పరిపాలనకూడా తీరికగా నిర్వహించే సహాయం లభిస్తుందని అతడు ఆశిస్తున్నాడు. నా సదభిప్రాయాన్నీ స్నేహాన్నీ అర్థించాడు. తన అధికారంలో గల సహాయా లన్నింటినీ చేయటానికి తను సిద్ధంగా ఉన్నట్లు వాగ్దానం చేశాడు. అతడు నాకనేక విషయాలు చెప్పాడు. రాష్ట్ర విషయాల్లో భూస్వామికిగల అభిమానాన్ని గురించి యిన్నాళ్ళుగా చెలరేగిన వివాదాన్ని రద్దుచేసుకొని ఆయనతో రాజీ పడటంవల్ల కలిగే ప్రయోజనాన్నిగురించి చెప్పి ఈ కార్యక్రమం నిర్వహించటానికి నేనే తగిన వ్యక్తినని వక్కాణించాడు. ఆ తరువాత మేం తిరిగి రాకపోవటం గమనించి 'మెడీరా' ను మా గదిలోకే పంపించారు. గవర్నర్ దాన్ని బాగా త్రాగి దానికి తగ్గట్టుగా యింకా ఎక్కువ ప్రార్థనలూ వాగ్దానాలూ చేయటం మొదలెట్టాడు. దీనికి నేనిచ్చిన జవాబు యిలావుంది. "భగవదనుగ్రహంవల్ల భూస్వామి యొక్క దయాధర్మభిక్షాలకోసం ఎదురుచూసే కర్మ నాకు పట్టలేదు. నేను అసెంబ్లీలో సభ్యుణ్ని కావటంచేత అందుకు విరుద్ధమైన విషయాలేమీ చేయలేదు. ఏమైనా వ్యక్తిగతంగా నాకు భూస్వాములతో ఎలాటి విరోధమూ లేదు. కాని ప్రజాక్షేమాని కుపయోగపడే ఏ కార్యక్రమంలో నైనా తల దూర్చటానికి అందరికంటే నేను ముందడుగు వేయగలను. ఇంతకుముందు సామాన్య ప్రజానీకానికి నష్టాన్ని, భూస్వామికి లాభాన్ని కల్గించే ప్రయత్నాలు జరగటంవల్ల

వాటిని నేను వ్యతిరేకించాను. కాని, నా శక్తివంచన లేకుండా పరిపాలనా నిర్వహణలో మీకు సాయం చేయ గలను" అని వాగ్దానం చేశాను.

దీన్ని గురించి అతడేమీ వ్యాఖ్యానం చేయలేదు. కాని ఆ తరువాత మళ్ళీ వివాదాలు పొడసూపాయి. ప్రతి పక్షంలో నేనే ప్రముఖుణ్ణయాను. కాని మాయిద్దరిమధ్యా వ్యక్తిగతంగా శత్రుభావం ఏర్పడలేదు. మేము చాలాసార్లు కలుసుకునేవాళ్ళం. అతడు సాహితీపరుడు. ప్రపంచంలో చాలా విషయాలు చూసినవాడు. చమత్కారంగా విన సొంపుగా మాట్లాడగలడు. నా పాతస్నేహితుడు రాల్ఫ యింకా బ్రతికేఉన్నట్లు ఇంగ్లండులోని గొప్ప రాజకీయ రచ యితల్లో ఒకడుగా పరిగణింప బడుతున్నట్లు మొట్టమొదట అతడే నాకు చెప్పాడు. రాజుకు ప్రిన్స్ ఫ్రెడరిక్ కు చెలరేగిన వివాదంలో ఇతడు మధ్యవర్తిగా పనిచేసినట్లూ, సాలీనా మూడువందలు ఉపకారవేతనం లభించినట్లూ తెలిసింది. కవిగా అతనిలో చెప్పుకోతగ్గ గొప్పగుణాలు లేవు. పోప్ అతని కవిత్వాన్ని ఖండించాడు కూడా. కాని గద్యరచనలో మాత్రం అతడు ఎవరికీ తీసిపోడు.

భూస్వామి తరచుగా ప్రజాహక్కులకు భంగం కలి గించేలా ప్రవర్తిస్తూ ఉండటంచేత ఆ విషయాన్ని రాజుకు ఫిర్యాదు చేయాలని అస్సెంబ్లీవారు నిర్ణయించి ఆ కార్య క్రమం నిర్వహించటానికి నన్ను నియమించారు. అస్సెంబ్లీ రాజు ఉపయోగం కోసమంటూ అరవైవేల పౌనులను మంజూరుచేయటానికి వీలుగా ఆమోదించి పంపిన బిల్లును

గవర్నరు పూర్తిగా నిరాకరించాడు. నా ప్రయాణానికి అన్ని సన్నాహాలూ చేసుకున్న తర్వాత, లార్డ్ లౌడన్ ఫిలడల్ఫియా వచ్చి, అసెంబ్లీకీ గవర్నరుకూ సమాధానం కుదర్చటానికి నన్నుకూడా కృషి చెయ్యమని అడిగాడు. అటు గవర్నరు, యిటు మేమూ ఆయన్ను కలుసుకుని, ఎవరి అభిప్రాయాలు వారు చెప్పుకున్నాం. చర్చించుకున్నాం. అసెంబ్లీ తరఫున నేను వాదించాను. గవర్నర్ తనకీయబడిన ఆదేశాలగురించీ, వాటిని తామిస్తానని తాను యిచ్చిన ఒప్పందలను గురించీ, దానికిని ధిక్కరిస్తే తనకు కలిగే ప్రమాదం గురించీ వివరించి చెప్పాడు. ఏమైనా లార్డ్ సలహా ప్రకారం నడుచుకుంటానికి తన కభ్యంతరం లేదని చెప్పాడు. కాని లార్డు లౌడన్ అతనికి విరుద్ధమైన సలహాను ఇయ్యలేదు. అసెంబ్లీని ఒప్పించటమే మంచిదని నిర్ణయించుకున్నాడు. అందుకు నా సాయం అర్థించాడు. మా సరిహద్దుల్ని రక్షించటానికి, యికముందు రాజు సైన్యాలురాకుండా చేస్తానని చెప్పివేశాడు. మారక్షణ భారాన్ని మేమే వహించుకోవాలని హెచ్చరించాడు.

ఆయన అభిప్రాయాన్ని నేను అసెంబ్లికిఅందజేశాను. మాకుగల హక్కులను వివరిస్తూ, వాటిని ఎన్నడూ వదలుకోవటం జరగదనీ, కాగా తాత్కాలికంగా వాటిని ఉపయోగించుకోకుండా మాత్రమే ఉండగలమనీ చెపుతూ, కొన్నితీర్మానాలను ఆమోదించాం. చివరకు ఎస్టేట్లకు కొంత లాభదాయకమైన బిల్లును మేం అంగీకరించాం. గవర్నర్ దాన్ని ఆమోదించాడు. అప్పుడు నా ప్రయాణం సాగించటానికి మళ్ళీ స్వేచ్ఛ లభించింది. ఈ లోగా నేను బయలు

దేరవలసిన నౌక వెళ్ళిపోయింది. ఇంతకూ నాకు లభించిన ప్రతిఫలమల్లా లార్డ్ అందజేసిన కృతజ్ఞతలుమాత్రమే. కాగా ఈ రాజీకుదిర్చిన గౌరవమంతా ఆయనకే దక్కింది.

నాకంటె ముందే ఆయన న్యూయార్కు బయలు దేరాడు. నౌకలను ఎప్పుడు పంపాలో నిర్ణయించే అధికారం అతనికుండటంచేత, రేవులోగల రెండు నౌకల్లో ముందు పోతుందనుకుంటున్న నౌక ఎప్పుడు బయలుదేరుతుందో ఖచ్చితంగా చెప్పుమని అడిగాను. ఏమైనా, దానికి తప్పకుండా వెళ్ళాలని అనుకున్నాను. దానికతడు "అది శనివారం బయలుదేరుతుంది. మీరు సోమవారం ఉదయమే అక్కడుంటే సకాలంలో జేరినట్లవుతుంది. కాని అంతకంటేమాత్రం ఆలస్యం చేయబోకండి సుమా" అన్నాడు.

మార్గమధ్యంలో సంభవించిన ఒక చిన్న ప్రమాదం వల్ల నేను అక్కడకు చేరేసరికి సోమవారం మధ్యాహ్నమయింది. అప్పుడు గాలి అనుకూలంగా ఉండటంచేత ఓడ వెళ్ళిపోయిందేమోనని భయపడ్డాను. కాని అదింకా హార్బరులోనే ఉందన్నవార్త విని చాలా సంతోషించాను. అది రేపు బయలుదేరుతుందని చెప్పారు. అప్పటికి లార్డ్ ప్రవర్తనతో నాకంత పరిచయం లేకపోవటంచేత, నేను యూరప్ చేరినట్లే భావించాను. కాని ఆయనలో ఒక లోపం ఉంది. ఎవరినీ నిర్ణయించి సకాలంలో చేయలేడు.

దానికి కొన్ని ఉదాహరణలు చెప్తాను.

నేను ఏప్రియల్ నెలారంభంలో న్యూయార్కు వచ్చాను. కాని జూన్ నెల చివరి రోజుల్లోగాని మేం బయలు

చేరటం జరగలేదు! అప్పుడు రేవులో రెండునౌకలున్నాయి. జనరల్ యివ్వాల్సిన లేఖలు తీసుకున్నాకగానీ అవి బయలు దేరటానికి వీలులేదు. కాని ఆ లేఖలు రేపు సిద్ధమైపోతా యనుకుంటూ అన్ని రోజులు గడిపాం. ఆతర్వాత మరో రెండు నౌకలుగూడా రావటం, అక్కడే దిగబడిపోవటం జరిగింది. అన్నింటికంటె ముందు మా నౌకవచ్చిందిగనుక అదే ముందు బయలుదేరాలి. ప్రయాణీకులు నిండిపోయి తొందరగా వెళ్ళిపోవాలని తొందరపెడ్తున్నారు. వర్తకులు ఆరాటపడ్తున్నారు. కాని వారి ఆరాటంవల్ల ప్రయోజనం లేకపోయింది. లార్డు ఉత్తరాలు వ్రాయటం ఎన్నాళ్ళకూ పూర్తికావటం లేదు. అనవరతం వ్రాతబల్లముందు చేతితో కలంపుచ్చుకునిమాత్రం, వెళ్ళినవారందరికీ దర్శన మిచ్చే వాడు.

ఒకరోజుఉదయం గౌరవాభినందనాలు అందజేయుటం కోసం ఆయనన్ను దర్శించాను. అప్పుడు ఫిలడల్ఫియా నుంచి గవర్నర్ డెన్నీచే పంపబడిన ఇన్నిస్ అనే రాయబారి అక్కడే ఉన్నాడు. నా కిమ్మని నా స్నేహితులిచ్చిన కొన్ని ఉత్తరాలను ఆయన నా కందించాడు. మళ్ళీ ప్రత్యుత్తరాలు వ్రాయాలనే అభిప్రాయంతో, అతన్ని ఎక్కడ బసచేసిందీ, ఎప్పుడు తిరిగి వెళ్ళేదీ, మొదలైన వివరాలన్నీ అడిగాను. గవర్నర్‌కు జావాబు లేఖ నీయటానికి రేపు తొమ్మిదిగంట లకు లార్డు తన్ని రమ్మన్నాడనీ, ఆ వెంటనే తిరిగి వెళ్ళి పోతాననీ చెప్పాడు. ఆ రోజునే వ్రాయవలసిన ఉత్తరాలు

వ్రాసి అతనికందించాను. ఒక పక్షంరోజులతర్వాత అక్కడే అతణ్ణి మళ్ళీ చూశాను.

"అంత త్వరగా తిరిగివచ్చారే ?" అని అడిగాను.

"తిరిగిరావటమా ? అసలు నేను యిక్కణ్ణుంచి కద లందే."

"ఏం ? ఎందు కలా జరిగింది ?"

"జరగటాని కేముంది? రెండువారాలనుంచీ, జవాబు యిస్తారని లార్డు దర్శనంచేసుకోవటం, ఆయన వ్రాత యింకా పూర్తి కాకపోవటం జరుగుతూంది."

"ఆయన అనవరతం రాతబల్లను వదిలిపెట్టడాయెను. అలాటి వ్రాయసకాడు యిలా చేయుటం సంభవమేనా ?"

"ఆఁ. ఎప్పుడూ గుర్రంమీదఉన్నట్టేఉండి, ఎన్నడూ స్వారీచెయ్యని, సెంట్ జార్జి బొమ్మలాటివాడు ఆయన."

రాయబారి చేసిన ఈ వ్యాఖ్య సరైనదే. మంత్రి పిట్ ఇతన్ని జనరల్‌గా తొలగించి, జనరల్ అహంరెస్ట్, వుల్ఫులను పంపటానికి చూసిన కారణాల్లో, ఇతగాడి అశ్రద్ధ ఒకటని ఇంగ్లండులో నాకు తెలిసింది. అతడు ఏం చేస్తు న్నాడో, ఎక్కడున్నాడో, ఏ విధమైన కబురూ ఎన్నడూ మంత్రి కందేది కాదట !

రోజూ నౌకలు బయలుదేరతా యని ఎదురుచూస్తూ ఉన్నాం. ఇంతలో మూడు నౌకలు సైన్యాన్ని చేరటానికి శాండీ హుక్ కు బయలుదేరటం చూసి, ఏ క్షణంలోనైనా

తమ నౌక బయలుదేరే అవకాశం ఉందని భావించి ప్రయాణీకులంతా రేవులోనే పడిగాపులు కాస్తున్నారు. అలా ఆరువారాలు అక్కడ గడచినట్లు గుర్తు. చివరికి యుద్ధ నావలు జనరల్ సైన్యంతో బయలుదేరాయి. వారిప్పుడు లూయీస్‌బర్గ్ పైకి పోతున్నారు. నౌకలన్నీ జనరల్ ఓడను అనుసరించాలని ఆజ్ఞాపించబడింది. అయిదురోజులు గడిచాక, మాకు శెలవీయబడింది. మా ఓడ యుద్ధనౌకల గుంపులోంచి బయటపడి, ఇంగ్లండుకు బయలుదేరింది. తక్కిన రెండు నౌకలనూ ఆయన తనతోపాటు హాలీఫాక్సుకు తీసుకు పోయాడు. అక్కడ కొంతకాలం ఆగి, దొంగదాడులు జరపటానికి కావలసిన శిక్షణలు తన సైన్యానికి యిప్పిస్తూ వచ్చాడు. అంతలో అకస్మాత్తుగా లూయీస్‌బర్గ్ పట్టుకోవాలనే తన అభిప్రాయాన్ని మార్చుకుని, తిరిగి న్యూయార్క్ బయలుదేరాడు! సైన్యం, ఓడలూ, ప్రయాణీకులూ, అందరూ తిరుగుప్రయాణం సాగించారు!!

ఇంతలో ఫ్రెంచివాళ్ళూ, అడవిమూకలూకలసి, ఫోర్ట్ జార్జిని ఆక్రమించారు. అందులోఉన్న రక్షకభటుల్ని నాశనం చేశారు. అప్పుడు ఒక నౌకకు అధిపతిగా ఉన్న కెప్టెన్ బొనెల్ అనే వ్యక్తిని నేను లండన్‌లో కలుసుకున్నాను. అతడొక సంఘటన గురించి చెప్పాడు. ఒకసారి లార్డుయొక్క ఓడను తాను పరిశీలించి, అది సక్రమంగా లేదనీ కొంత మరమ్మతు వెంటనే చేయాలనీ చెప్పాడట. దానికి ఆయన, ఆ మరమ్మతుకు ఎన్నిరోజులు పడుతుంది? అని అడిగాడు. మూడురోజులు పడుతుందని ఈయన సమా

థానం చెప్పాడు. అప్పుడాయన "ఒక్కరోజులో ఆ పనంతా చేయగల్గితేనే అనుమతిస్తాను. ఎందుచేతనంటే ఎల్లుండి నువ్విక్కణ్ణుంచి బయలుదేరి వెళ్ళితీరాలి" అన్నాడట.

ఆ తర్వాత బయలుదేరనీకుండా, మూడు నెల్లపాటు అతన్ని ఆపినప్పటికి, ఓడను మాత్రం మరమ్మత్తు చేయించుకోలేదట ! లండన్‌లోనే బోనెల్ ఓడలో ప్రయాణం చేసిన ఒక ప్రయాణీకుడు కనిపించాడు. తన్ను మోసగించి న్యూయార్కులో అంతకాలం నిలిపినందుకూ, హాలీఫాక్స్ వరకూ తీసుకుపోయి, తిరిగి తీసుకొచ్చి న్యూయార్కులో దించినందుకూ, లార్డుపై ఆ ప్రయాణీకునకు చాలా ఆగ్రహంగా ఉంది. అందుకై అతనిమీద చర్య తీసుకుంటానని కూడా చెప్పాడు. ఆ తర్వాత అతడు తీసుకున్న చర్య ఏమిటో తెలియదుగాని, తన వ్యవహారాలకు సంబంధించిన కష్టనష్టాలను గురించి అతడు చెప్పింది విన్నప్పుడు, అది ఆలోచించవలసిన విషయంలాగనే కనిపించింది.

కాని నాకు ఆశ్చర్యం కలిగించిన విషయం ఒక్కటి. అలాటి వ్యక్తిపై గొప్ప సైన్యాన్ని నడిపేటంత ముఖ్యమైన బాధ్యత ఎలా వేశారూ అని ? కాని ప్రపంచంలో అనుభవాన్ని గడించి, పదవులు యివ్వటాలలో ఉద్దేశాలు, అవి సాధించటానికి గల సాధనాలు, తెలుసుకున్నాక నా ఆశ్చర్యం ఆవిరై పోయింది.

బ్రాడక్ మరణానంతరం, కమాండర్‌గా నియమించబడిన, జనరల్ షిర్లే యింకా కొంతకాలం గనుక, ఉద్యోగంలో ఉంచబడి నట్లయితే, 1757లౌడన్ దండయాత్రకంటె

పదింతల సలక్షణంగా, కార్యభారం నిర్వహించేవాడు. ఆ దురదృష్టకరమైన దండయాత్రవల్ల మన జాతికి విపరీతమైన కష్టనష్టాలు సంభవించాయి.

పిర్లే ఇంగితజ్ఞానం కలవాడు. ఇతరులిచ్చే మంచి సలహాలను గ్రహించగలవాడు. చక్కటి పథకాలు తయారు చేయటానికీ, వాటిని అమలుజరపటానికీ సమర్థుడు. లౌడన్ తన సైన్యంతో కాలనీలను రక్షించటానికి బదులు, గొప్పగా హాలీఫాక్సు పోయి, అక్కడ కూలబడటంతో ఫోర్టు జార్జి శత్రువులకు చిక్కటం జరిగింది. దీనివల్ల మనవర్తక వాణిజ్యాలు దెబ్బతింటమే కాదు, శత్రువులకు సరఫరాలు బంద్ చేయుట మనే మిషతో, వర్తక యానాలన్నీ నిషేధించబడ్డాయి. కాని ఈచర్య నిజానికి, సరకుల ధరలు పడగొట్టి కాంట్రాక్టర్లకు లాభం కలిగించటానికి తీసుకోబడిందనీ, ఆ లాభాలలో ఆయనకుకూడా కొంత భాగముందనీ ఒక అనుమానం. పిర్లే తనపైగల బాధ్యతను తొలగించి నందుకు చాలా సంతోషించి ఉంటాడు. సైన్యాలు నడిపే వ్యక్తి ఎప్పుడూ ఆవిషయాల్లో పరిపూర్ణ పరిజ్ఞానం కలవారే కావాలి. అతనునుంచి ఆధిపత్యాన్ని తీసుకున్న సందర్భంలో, లార్డు లౌడన్‌కు నగరంలో ఏర్పాటుచేయబడిన విందుకు నేను హాజరయ్యాను. పిర్లే మానసికంగా క్రుంగి ఉన్నప్పటికీ ఆ విందుకు వచ్చాడు. చాలామంది ఆఫీసర్లు, పౌరులు, అపరిచితులు ఎందరో వచ్చారు. కుర్చీలు చాలక ఇరుగు పొరుగు నుంచి కొన్ని ఎరువు తేబడ్డాయి. అందులో అన్నింటికంటె చిన్నకుర్చీలో పిర్లే కూర్చోవాల్సివచ్చింది ఆయనప్రక్కనే

కూర్చునిఉన్న నేను, "మీకు చాలాచిన్నకుర్చీ ఇచ్చారండీ" అన్నాను. దానికి జవాబుగా ఆయన "ఫ్రాంక్లిన్ - చిన్న ఆసనమే నాకు తేలికగాఉంది సుమా" అన్నాడు.

ఇందాక చెప్పినట్లు, నేను న్యూయార్కులో దిగబడి పోయినపుడు, బ్రాడక్ కు నేను అందజేసిన సాధన సామాగ్రికి చెందిన లెక్కలు అందాయి. ఆ వ్యవహారం నిర్వహించ టానికి, సహాయకులుగా నియమించిన వారిదగ్గర మాత్రం కొన్ని మిగిలిపోయాయి. నాకు రావలసిన కురదలా మొత్తం యిస్తాడనే ఆశతో ఆలెఖ్ఖలన్నింటినీ ముందు లార్డు లౌడన్ కు చూపించాను. ఆయన ఒక ఆఫీసరుచేత వాటిని ఖచ్చితంగా తనిఖీ చేయించాడు. అతడు ఓచర్లతోసహా లెఖ్ఖలన్నింటినీ పరీక్షించి, అన్నీ సరిగ్గానే ఉన్నాయని చెప్పాడు. అంచేత మిగిలిన కురదలా మొత్తాన్ని యిప్పిస్తానని లార్డు వాగ్దానం చేశాడు. ఆ మొత్తంకోసం అనేకసార్లు కాలికి బలపాలు కట్టుకుని తిరిగాను. లాభం లేకపోయింది. చివరకు ఆయన ఇలా అన్నాడు "నా పూర్వీకుల లెఖ్ఖలతో నా లెఖ్ఖలనుకలిపి వేయ దల్చుకోలేదు. మీరు ఇంగ్లండులో ఉన్నప్పుడు వాటిని ట్రెజరీలో చూపించండి. వెంటనే మీ పైకం మీకు ముట్టుతుంది"

ఇంతకాలం న్యూయార్కులో ఉండటం చేత నాకు చాలా నష్టం కలిగిందనీ, ప్రతిఫలాపేక్ష లేకుండా నేను పెట్టిన పెట్టుబడి యింకా యివ్వకుండా ఆలస్యం చేయటం భావ్యం కాదనీ చెప్పాను. దానికతడు "అయ్యా! ప్రతి ఫలాపేక్ష లేకుండా ఏదో సేవ జేశామంటూ మమ్మల్ని

వేధించకండి. ఈ వ్యవహారాలు మీకంటే మాకే బాగా తెలుసు. సైన్యానికి సామాగ్రి సరఫరాచేస్తూ జేబులు నింపు కోనివా రెవరున్నారు?" అన్నాడు.

నా విషయంలో అలాటిదేమీ లేదని ఆయనకు హామీ యిచ్చాను. నాకు ఒక్క ఫార్తింగ కూడా ముట్ట లేదని చెప్పాను. కాని అతడు నా మాట నమ్మినట్టు కనిపించ లేదు. నిజమే! అలాటి సమయాల్లో పుష్కలంగా గడించవచ్చని ఆ తర్వాత తెలిసింది. ఇక నాకు రావలసిన బాకీ, యీనా టికీ చెల్లించబడ లేదు.

మేం లండన్ బయలుదేరేముందు నౌకాధిపతి, తన నౌకనుగురించి ఎన్నో డంబాలు పల్కాడు. కాని తీరా సముద్రంలోకి వచ్చేసరికి, ఆ తొంభైఆరు నౌకల్లోనూ, మాదే నిదానస్థురాలని తేలిపోయింది. దాని కతడు చాలా సిగ్గుపడ్డాడు. ఓడ అంతనింపాదిగా నడవటానికి ఏవేవో కారణాలు చెప్పాడు. ఇంతలో ఇంచుమించు మా నౌక మాదిరి నిదానస్థురాలే మరొక నౌక, మమ్మల్ని అధిగమించి ముందుకు సాగింది. కెప్టెన్ నౌకలోని వారి నందరినీ సాధ్యమైనంతవరకూ జండా స్తంభానికి దగ్గరగా జరగమన్నాడు. మేం అలా చేయగానే, నౌక కొంచెం తేలికపడి వేగంగా, యిందాకటి నౌకను అధిగమించింది. పైభాగంలో ఎక్కువ బరువు వేయటంవల్ల నౌక గమనం మందగించిందని, అతడు చెప్పిన విషయం నిజమే అయింది. నీటి జాడీలు ఓడ ముందు భాగంలో పేర్చారు. వాటిని వెనక్కు మార్చమని ఆజ్ఞాపించాడు కెప్టెన్. ఈ మార్పుతో నౌక పరిస్థితి

యింకా మెరుగయింది. ఆ నౌక ఒకానొకసారి గంటకు ముప్పై మైళ్ళ వేగంతో వెళ్ళిందంటాడు కెప్టెన్. మాతో ప్రయాణం చేస్తున్న మరొక కెప్టెన్ కెన్నెడీ, ఇంతవరకూ ఏ నౌకా అంత వేగంతో ప్రయాణం చేయలేదనీ, అందు చేత తాసీ విషయం నమ్మజాలననీ తేల్చి వేశాడు. బాగా గాలి వీచేటప్పుడు ఈ విషయం నిర్ణయించు కుంటానికి కెప్టెన్లు యిద్దరూ పందెం కట్టారు. ఆ పందెంలో కెన్నెడీ ఓడిపోయాడు.

ఈ సందర్భం నేనెందుకు చెప్తున్నానంటే ఒకనౌకపై ప్రత్యక్షంగా ప్రయాణంచేసి చూసేవరకూ, దాని విషయం తెలుసుకోవటం కష్టం. బాగా యానంచేసే ఓడనే నమూనాగా పెట్టుకుని మరియొక ఓడను నిర్మించినా, సముద్రంలో వదిలేసరికి, అది అందుకు విరుద్ధమైన ఫలితాల నీయవచ్చు. సరుకులు ఎక్కించటంలో, నౌకను నడపటంలో, నావికు లందరూ, ఎవరిపద్ధతిని వారు అనుసరిస్తారు. ఒక కెప్టెన్ దగ్గర బాగా పనిచేయని ఓడ, మరొక కెప్టెన్ దగ్గర బాగా పని చెయ్యవచ్చు. దానికితోడు ఓడ నిర్మించటం, దానిని నడపడం, ఒకే వ్యక్తి చేతులమీదగా జరగదు. ఒకడు ఓడ స్థూల భాగాన్ని నిర్మిస్తే మరొకడు పై భాగాన్ని కూర్చుస్తాడు. వేరొకడు ఓడలో బరువుల నెక్కించి సముద్రంలోకి వదులుతాడు. ఏ ఒక్కరికీ, అందరి అభిప్రాయాలూ, అనుభవాలూ తెలుసుకునే అవకాశంమాత్రం లభించదు.

ఆఖరికి సాధారణంగా సముద్రంలో ప్రయాణంచేసే టప్పుడు కూడా ఆఫీసర్లలో విభిన్నాభిప్రాయాలు పొడ

సూపటం నాకు తెలుసు. ఒకరిని మించి ఒకరు తాము గొప్పగా నౌకను నడపగలమని గొప్పలు చెప్పుకుంటారు. వారందరికీ పాటించటానికి కొన్ని నియమాలూ నిబంధనలూ ఉన్నట్టు కనిపించ లేదు. వీరందరి అనుభవాలను వరికూర్చి, వేగంగా ప్రయాణంచేయగల ఓడయొక్క స్థూల రూపం నిర్ణయించుకోవచ్చు. ఆ తరువాత అత్యుత్తమమైన ఆకారాలు నిర్ణయించుకొనటానికికూడా అవకాశం ఉంటుంది. ఓడ స్తంభం పెట్టటానికి సరైన చోటు ఏమిటో, తెరచాపల యొక్క తీరుతెన్నులు ఎలా ఉండాలో, చివరకు ఓడలోనికి సరుకులు ఎలా ఎక్కించాలో ఇలాటి విషయాలెన్నో తెలుసుకోవచ్చు. ఇది ప్రయోగయుగం గనుక, ఇందుకు సంబంధించిన ప్రయోగాలను, సమిష్టిగా చేసుకుంటే ఎంతో ప్రయోజనముంటుంది. అంచేత ఎవరైనా మేధావంతుడు ఈ కార్యభారాన్ని వహించాలని కోరుతున్నాను. ఆయనకు విజయం లభిస్తుందని ఆశిస్తున్నాను. అలా ముప్పై రోజులు ప్రయాణం సాగించాం. ఒకచోట మా ఉనికిని పరీక్షించుకున్నాం. మేం చేరవలసిన రేవు ఫాల్‌మౌత్ చాలా దగ్గరలోనే ఉందని అనుకున్నాం. రాత్రి బాగా ప్రయాణంచేస్తే శత్రు సైనికుల కంటపడకుండా తెల్లవారేసరికి, గమ్యం జేరవచ్చని కెప్టెన్ చెప్పాడు. అంచేత సాధ్యమైనంత త్వరగా ఓడను పరుగెత్తిస్తున్నాం. గాలి అనుకూలంగాఉంది. తెల్లవారేసరికి మాకు కొన్నిశబ్దాలు వినిపించసాగాయ్. వాటిని బట్టి తీరానికి దగ్గరకువచ్చామని అనుకున్నాం. దట్టమయిన పొగమంచు కురుస్తూండటంచేత, భూభాగం మాకు బాగా

కనిపించటంలేదు. తొమ్మిదిగంట లయేసరికి నాటకశాల లోని తెరవలె, పొగమంచు పైపైకి పోతూంది. దానిక్రింద ఫాల్‌మౌత్ పట్టణం, దాని హార్బరులోని నౌకలు, దాని చుట్టూగల పొలాలూ, కనిపించాయి. చిరకాలం చైతన్యం లేని సాదా సముద్రంతప్ప మరొక్క దృశ్యంచూడని మాకు, ఆ దృశ్యం ఎంతో ఆహ్లాదకరంగా కనిపించింది. నేను నా కుమారునితో కలసి లండన్‌కు బయలుదేరాను. మార్గ మధ్యంలో, శాలిస్‌బరీ మైదానంపైగల స్టోన్‌హెంజ్‌నూ, లార్డు పెంబ్రూక్ యిల్లు, తోట, చిత్రమైన పూర్వకాలపు వస్తువులూ చూడటానికి మాత్రం కొంచెంసేపు ఆగాం. 1757 జూలై 27 వ తేదీకి, మేం లండన్ చేరుకున్నాం. మిస్టర్ చార్లెస్ ఏర్పాటుచేసిన బసలో దిగాం. వెంటనే ఒక పెద్ద సిఫార్సుతోపాటు డాక్టర్ ఫాదర్ గిల్‌ను చూడ టానికి బయలుదేరాను. నా కార్యకలాపాలగురించి ఆయ నతో సంప్రదించమని, నాకు సలహా యివ్వబడింది. ఈ విషయాన్ని తక్షణం ప్రభుత్వానికి ఫిర్యాదుచేయుటం మంచిది కాదని ఆయన సలహాయిచ్చాడు.

ఆ తర్వాత నేను నా పాతస్నేహితుడైన పీటర్ కాలిసన్‌ను కలుసుకున్నాను. జాన్‌హాన్‌బరీ అనే ఒక వర్జీ నియా వ్యాపారస్తుడు నా కోసం ఎదురుచూస్తున్నాడనీ. కౌన్సిల్ అధ్యక్షుడయిన లార్డుగ్రాన్‌విల్లీ దగ్గరకు నన్ను తీసుకుని వెళ్ళటానికి ఎదురుచూస్తున్నాడనీ అతడు చెప్పాడు. ఆ మర్నాడు ఆయన్ను కలుసుకున్నాను. తన బండిలో నన్ను, లార్డుయింటికి తీసుకువెళ్ళాడు. అక్కడ నాకు చాలా గౌరవ

ప్రదమైన ఆహ్వానం లభించింది. ప్రప్రథమంగా, ప్రస్తుతం అమెరికాలోని స్థితిగతుల్ని గురించి, దానిపై జరుగుతున్న చర్చలను గురించీ కొన్ని ప్రశ్నలు వేశాడు. తర్వాత యిలా అన్నాడు:

"మీ అమెరికన్లకు రాజ్యాంగాన్ని గురించి చాలా తప్పుడు అభిప్రాయాలున్నాయి. రాజు గవర్నరుకు పంపిన సందేశాలు శాసనాలు కావని మీరు భావిస్తున్నారు. వాటిని గౌరవించటానికి గానీ, లేదా అగౌరవించటానికిగానీ, మీకు పూర్తి స్వేచ్ఛ ఉందనుకుంటున్నారు. కాని, ఈ ఆదేశాలు కేవలం విదేశాలకు పోతున్న మంత్రికి సహాయకారిగా ఉండటంకోసం యిచ్చే సలహాలవంటివి కావు. అవి మొదట శాసన నిర్మాణంలో పాండిత్యంగల న్యాయమూర్తులచే తయారు చేయబడుతాయి. ఆ తర్వాత వాటినిగురించి ఆలోచిస్తారు. చర్చలు జరుపుతారు. అవసరమైన మార్పులు చేశాక, రాజు సంతకంకోసం పంపబడతాయి. కాలనీలన్నింటికీ శాసన కర్త రాజుగనుక, ఆయన ఆదేశాలన్నీ శాసనాలన్నమాట"

ఆయన చెప్పిందంతా నాకు పూర్తిగా కొత్త సిద్ధాంతమని చెప్పాను. చార్టర్‌లో నాకర్థమయిన విషయమల్లా, మా శాసనాలన్నీ మా అసెంబ్లీలచేతనే చేయబడాలి. అవి అనుమతికోసం రాజుకు పంపబడతాయి. కాని వీటిని తీసివేయటానికిగాని, మార్చటానికిగాని రాజుకు అధికారం లేదు. ఆయన అంగీకారంలేకుండా శాశ్వతమైన శాసనాలు అసెంబ్లీ ఎలా చెయలేదో; అలాగే అస్సెంబ్లీ అనుమతి లేకుండా, ఆయనకూడా దేన్నీ చేయలేడు - అని లార్డుకు

చెప్పాను. నేను పూర్తిగా పొరపడుతున్నానని ఆయన హామీ యిచ్చాడు. నేను మాత్రం అలా అనుకో లేదు. కాగా ఆ లార్డు ధోరణి బట్టి, రాజ సభలోని అభిప్రాయాలు ఇలా ఉంటాయిగదా– అని తెలుసుకున్నాను.

ఈ సందర్భంలో నాకొక విషయం గుర్తుకువస్తున్నది. కాలనీలన్నింటికీ శాసనాలిచ్చే అధికారాన్ని రాజుకు సంక్రమింప జేస్తూ, మంత్రివర్గం ఒకబిల్లును ప్రతిపాదించింది. కాని కామన్సు సభ మాత్రం దాని కంగీకరించలేదు. అప్పుడు వారిని మేము మా స్నేహితులుగా, స్వేచ్ఛా ప్రియులుగా, ఆరాధించాం. కాని 1765 లో మా యెడల వారి ప్రవర్తన చూశాక, రాజుకు సర్వం సహాధికారం లేకుండా వారు ప్రయత్నించటానికి కారణం, ఆ ఆధికారాన్ని తమ స్వంతం చేసుకుంటానికే అని తేలిపోయింది. కొన్ని రోజులయాక, డాక్టర్ ఫాదర్ గిల్ భూస్వాములతో మాట్లాడి, నాతో వారికి స్ప్రింగ్ గార్డెన్‌లోని మిస్టర్ టిపెన్సు యింట్లో సమావేశం ఏర్పాటు చేశాడు. ఒకరియెడ ఒకరు సరసమైన ధోరణిలో ప్రవర్తించాలనుకుంటూ సమావేశం ప్రారంభించాం. ఎవరి వాదాలను వారు వివరించుకున్నాం. మా అభిప్రాయాల మధ్య అనంతమైన అగాధాలున్నాయని తేలిపోయింది. మాకు ఒడంబడిక కుదురుతుందనే ఆశ అంతరించింది. చివరకు మా ఫిర్యాదులలోని ముఖ్యవిషయాలు వ్రాసియిస్తే, వాటిని పరిశీలిస్తామని చెప్పారు. నేనలాగే వ్రాసియిచ్చాను. వారు ఆ కాగితాలను, తన వకీలు చేతుల్లో పెట్టారు. అతడు

గర్విష్టి-ముక్కోపి. అతనివాదనల్లో పాయింట్ ఉండేదికాదు కాని వేడివేడిగా మాట్లాడేవాడు. వాటికి నేను తీవ్రంగానే సమాధానం చెప్పటంచేత, నాపై అతనికి అంతులేని వ్యక్తి గత ద్వేషం ఏర్పడింది. మేం కలుసుకున్నప్పుడల్లా అది పెల్లుబికేది. వారు చేసిన ప్రతిపాదనలన్నింటినీ నేను తిరస్క రించాను. ఆ తర్వాత భూస్వాములు అతని సలహా ప్రకారం ఆ కాగితాలన్నింటినీ, అటార్నీ, సొలిసిటర్ జనరల్‌ల చేతిలో పెట్టారు. వారు ఇంచుమించు ఒక సంవత్సరంపాటు ఏ జవాబు చెప్పకుండా, ఆ కాగితాలను దగ్గర పెట్టుకుని కూర్చున్నారు. ఈ లోగా నాకు జవాబుచెప్పమని అనేక సార్లు భూస్వాములను అడగటం, వారు తమ సలహాదారుల నుంచీ యింకా ఏ సూచనలూ రాలేదని జవాబు చెప్పటం జరిగింది. చివరికి వారికి అందినసలహా ఎటువంటిదో నాకు తెలియదు. అదినాకుమాత్రం ఎన్నడూ అందజేయబడలేదు. పారిస్‌చే సంతకం పెట్టబడిన ఒక సుదీర్ఘమైన సందేశాన్ని వారు అసెంబ్లీకి పంపారు. అందులో నా వ్రాతలను ఉదహ రిస్తూ నేను చాలా మొరటగా ప్రవర్తించినట్లు ఆరోపించ బడింది. అసెంబ్లీ సరైన మర్యాదగల ప్రతినిధులను పంపితే మళ్ళీ చర్చలు సాగించటానికి తమకు అభ్యంతరం లేదని తెలియజేశారు. వారిని 'నిజమైనపరిపూర్ణమైన పెన్సిల్వేనియా అధినేతలు' అని నేను పేర్కొనలేదట. అదేవారికి మొరటుగా కన్పించి ఉండవచ్చు. కాని నేను దీన్ని ఉద్దేశపూర్వకం గానే చేశాను.

ఈ సమయంలో ప్రజల ఆస్తులతోపాటు యెస్టేట్లపై గూడా పన్నువిధించేచట్టాన్ని, గవర్నర్ చేత అసెంబ్లీ ఆమోదింపజేయించింది. వివాదానికి అదేఅసలు హేతువు. ఈ చట్టానికి రాజుఅనుమతి లభించనీయకుండా, భూస్వాములుఅడ్డుపడదామనుకున్నారు. అలాగే కౌన్సిల్‌లో రాజుకుదరఖాస్తు పెట్టుకున్నారు. వారికి అనుకూలంగా వాదించటానికి యిద్దరు లాయర్లనుకూడా నియమించుకున్నారు. మాకు అనుకూలంగా వాదించటానికి నేనుకూడా యిద్దరు లాయర్లను నియమించాను. ప్రజలపై తక్కువభారాన్నీ యెస్టేట్లపై ఎక్కువ భారాన్నీ వేసి, వారిని యిబ్బంది పెట్టటానికే యీ చట్టం ఉద్దేశింపబడిందని వారు వాదించారు. ఇదే పరిస్థితి కొనసాగినట్లయితే, తాము ప్రజల దయమీద ఆధారపడి బ్రతకవలసి వస్తుందనీ, దానితో తాము నాశనమైపోవచ్చనీ, వారు వాదించారు.

చట్టానికి అలాటి అభిప్రాయం లేదనీ, దానివల్ల అలాటి పరిణామాలు ఎన్నడూ జరగవనీ, పన్నులు విధించేవారు సక్రమంగా, సమంగా, న్యాయంగా వ్యవహరిస్తామని ప్రమాణాలు చేసిన వారే గనుక, ప్రజల పన్నులు తగ్గించి, భూస్వాములపన్నులు హెచ్చించటంవల్ల కలిగేఅల్పమైనలాభాలకు ఆత్మవంచన చేసుకోరని చెప్పాం. ఇరుపక్షాల వాదాల్లోని సారాంశం ఇది. కాగా 100, 000 పౌన్ల కరెన్సీ అచ్చు వేసి, రాజు ఉపయోగానికి ఖర్చు పెట్టటం వల్ల అదంతా యిప్పుడు ప్రజల్లో వ్యాపించింది. ఇప్పుడు గనుక దాన్ని తీసివేస్తే చాలామంది బీద ప్రజలు నాశనమైపో

తారు. అప్పుడుభవిష్యత్తులో గ్రాంట్లు సంపాదించటంకూడా కష్టమైపోతుంది. ఇందువల్ల కలిగే దుష్పరిణామాలను గురించి మేం వాదించాం. భూస్వాములు, తమమీద అధికపు పన్నులు పడతాయని, అర్థంలేని భయం చెందటమే ఈ ఉపద్రవానికి కారణమని చెప్పాం. ఈ విధంగా వాద ప్రతివాదాలు సాగుతుండగా, మాన్‌సిఫీల్డ్ అనే సలహాదారు, నన్ను గుమాస్తా గదిలోకి తీసుకుపోయి, "ఈ చట్టం అమలు జరపటంవల్ల నిజంగా భూస్వాములకు ఏవిధమైన నష్టమూ కలగదా?" అని ప్రశ్నించాడు. కలగదని జవాబు చెప్పాను. "అయితే ఆ విషయాన్ని హామీ ఇయ్యటానికి మీరు ఒక ఒడంబడిక వ్రాసుకోవచ్చు" అన్నాడు. అలాటిది వీలులేదని చెప్పాను. అప్పుడాయన పారిస్‌ను పిలిచాడు. కొంత చర్చ జరిగాక లార్డ్ చేసిన సూచన ఉభయత్రా ఆమోదించబడింది. కౌన్సిల్ గుమాస్తా వెంటనే ఒడంబడిక పత్రాన్ని వ్రాశాడు. నేనూ, మిష్టర్ చార్లెస్ దానిమీద సంతకాలు పెట్టాం. లార్డ్ మాన్‌సిఫీల్డు కౌన్సిలు చాంబర్‌కు వచ్చాక, ఆ బిల్లు ఆమోదించబడింది. కొన్ని మార్పులు చేయాలనుకున్నారు. కాని అందుకు వేరొక చట్టం చేసుకోవచ్చని ఊరుకున్నారు. ఆ తర్వాత వేరొక చట్టం చేయవలసిన అవసరం అసెంబ్లీకి కలగలేదు. ఎందుచేతనంటే, కౌన్సిల్‌నుంచి ఆజ్ఞ జారీకాకముందే ఒక సంవత్సరం పన్ను వసూలుచేయబడింది. ఆ పన్నువసూలు ఎలా చేయబడిందో తనిఖీ చెయ్యటం కోసం, ఒక కమిటీ ఏర్పాటు చేయబడింది. అందులో భూస్వాములయొక్క స్నేహితులే

ఎక్కువమంది ఉన్నారు. పూర్తిగా విచారణ జరిగాక పన్నులు పూర్తిగా సమానతను పాటిస్తూనే విధింపబడినట్లు తేలింది.

ఈ వ్యవహారంలో నేను చేసుకున్న ఒడంబడిక రాష్ట్రానికి గొప్పసేవగా అసెంబ్లీవారు భావించారు. దీనివల్ల రాష్ట్రంలో కాగితపు కరెన్సీకి తగినంత విలువవచ్చింది. నేను తిరిగివచ్చినపుడు వారు నాకు కృతజ్ఞతలుఅందజేశారు. కాని చట్టాన్ని ఆమోదించినందుకు గవర్నరు డెన్నీమీద భూస్వాములు ఆగ్రహావరవశు లయ్యారు. అతడు పాటించ గలనని అంగీకరించిన ఒడంబడికకు విరుద్ధంగా అతడు ప్రవర్తించినందుకు చర్య తీసుకుంటామని బెదిరించారుకూడా. కాని గవర్నరు ఆ పనిని జనరల్ యొక్క ప్రోత్సాహంతోనే చేయుటంవల్లనూ, అది రాజుకు ఉపయోగకారి కావటం వల్లనూ, కోర్టులో తనకు పలుకుబడిగల కొందరు వ్యక్తులుండటంచేతనూ, అతడు వారి బెదిరింపులకు లెఖ్ఖచెయ్యలేదు. ఆబెదిరింపులు కార్యరూపం ధరించటంకూడా ఎన్నడూ జరగలేదు.

—*—